# చతుర

అక్టోబరు 2008

రూ.10/-



'శిల్ప'ం ఇలా..6

మాచిరాజు కామేశ్వరరావు

## దిశానిర్దేశం




## స్పూనోపాఖ్యానం

మొహంమీద ఒక చెంచాను నిలబెట్టాలంటేనే నానా తంటాలు పడతాం. కానీ బ్రిటన్‌కు చెందిన ఈ తొమ్మిదేళ్ల కుర్రకుంక జోఅల్లిసన్ ఇలా 16 చెంచాలను నిలబెట్టి ప్రపంచ రికార్డు బద్దలు కొట్టాడుట.

# చతుర

సంపుటి -31
సంచిక - 9
అక్టోబరు 2008
369వ సంచిక



ముఖచిత్రం : లయ ఫొటో : జయకృష్ణ
ముఖపత్రాలంకరణ : రాజు యాట



అందరిరాతలు రాసేది
భగవంతుడైతే ఆడదాని
రాత రాసేది కేవలం
మగవాడేనన్న
సంప్రదాయక వాదాన్ని
సమాధి చేస్తూ
నచ్చిన విధంగా
జీవితాన్ని
మలచుకున్న
స్త్రీమూర్తి జీవితం
మాచిరాజు కామేశ్వరరావు
నవల

**దిశానిర్దేశం**

14 వ పేజీలో

బొమ్మలు:
బాలు



# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**

# బాల రచయిత్రులు




హాలీవుడ్‌లో రచయిత కావాలంటే ఎంతో ప్రతిభ ఉండాలి. ముఖ్యంగా దర్శకుడు స్టీఫెన్ స్పీల్ బర్గ్ సినిమాకు స్క్రిప్ట్ రైటర్ కావాలంటే ఎంత ప్రతిభ కావాలో కదా? అలాంటిది పద మూడేళ్ల స్కూలు విద్యార్థినులు ముగ్గురు స్పీల్ బర్గ్‌కి స్క్రిప్ట్ రైటర్స్‌కావడం విశేషం!

స్పీల్ బర్గ్ ఫాక్స్ నెట్ వర్క్ టి.వి.కి తయారు చేసిన 'టైనీ టూన్ అడ్వెంచర్స్' కార్టూన్ షోని చూసి, వర్జీనియాలోని ఓ ఊ రికి చెందిన ముగ్గురు ఎనిమిదో తరగతి విద్యార్థినులు కలిసి, 'బస్టర్ అండ్ బేబ్స్. గో హవాయియన్' అనే 200 పేజీల కథను బొమ్మలతో సహా రాసారు. దాన్ని వారు ఆ షోను సిండి కేట్ చేసిన వార్నర్ బ్రదర్స్‌కి పంపారు. ఆ స్క్రిప్ట్ అంచెలంచెలుగా పైకి పోతూ స్పీల్ బర్గ్ బల్లమీదకి చేరు కుంది. దాన్ని చదివిన స్పీల్ బర్గ్‌కి ఆ కథ నచ్చడంతో వాళ్లకి ఆ సంగతి తెలియజే సాడు. రీనీ కార్టర్, ఎమీ క్రాస్‌బీ, సారాక్రి ఫ్‌లను తన ఖర్చుతో వారి ఊరినుంచి లాస్ ఏంజెలెస్‌కి పిలిపించి నాలుగు రోజు లపాటు సిటీ మొత్తం చూపించాడు.

సాధారణంగా ఒక్కో ఎపిసోడ్‌కి కార్టూన్ స్క్రిప్ట్‌కు 500 డాలర్లు చెల్లిస్తారు. కానీ ఆ ముగ్గురికి తలో 250 డాలర్లు చెల్లించాడు. అతనితో కలిసి వారు కాంట్రాక్ట్ మీద సంతకం చేసారు.

'హాలీవుడ్‌లో ఎవరూ కోర కుండా బయటనించి వచ్చిన స్క్రిప్ట్‌ను చూడరని మీకు తెలీదా? 'అడిగాడు స్పీల్ బర్గ్.




'మీరిప్పుడు చెప్పేదాకా ఆ సంగతి మాకు తెలీదు' ఆ ముగ్గురూ ఆశ్చర్యంగా చెప్పారు.

'అయినా మీ స్క్రిప్ట్ నా దగ్గరకి వచ్చిం దంటే దాన్ని మధ్యలో చదివిన అనేక మంది మీ ప్రతిభని గుర్తించబట్టే కదా?' నవ్వుతూ చెప్పాడు స్పీల్ బర్గ్.

'కానీ బయటి స్క్రిప్ట్‌ని పరిశీలించని మీ హాలీవుడ్ పాలసీ నాకేం నచ్చలేదు' అంది రీనీ కార్టర్ ధైర్యంగా.

ముప్పయి మూడేళ్లు దాటినా
చెక్కు చెదరని ఒంపుసొంపుల
దేహసిరి ఆమె సొంతం.
బాలీవుడ్‌లో పొడుగుకాళ్ల
సుందరిగా పేరొందిన ఆమె
గత ఏడాది లండన్‌లో
జరిగిన
బిగ్ బ్రదర్ షోలో
అత్యధిక స్కోరు
సాధించింది.
ఇంతకీ ఆమెవరో తెలుసా?
ఇంకెవరు అందాల
శిల్పాశెట్టే కదా అంటున్నారా?
అవును ఆమె తన
ఆరోగ్యరహస్యాలను
వివరించిందిలా..



# అందమైన 'శిల్ప'ం ఇలా..

★ చాలామంది ఆరోగ్యంకోసం ఆహార నియమాలు, చిట్కాలు పాటిస్తారు కానీ మానసిక ఆరోగ్యం సంగతి విస్మరిస్తారు. మనస్సును నిర్మలంగా ఉంచుకోవడం, అనవసర భయాలు, ఆందోళనలు, ఒత్తిళ్లకు దూరంగా ఉండటం ఆరోగ్యానికి కీలకం.

★ శరీరం గాజు గ్లాసులాంటిది. లోపల పరిశుభ్రంగా లేకపోతే బయట దాన్నెంత పాలిష్ చేసినా సరిగ్గా కనిపించదు. అందువల్ల ఎప్పుడూ తాజా, ఆరోగ్యకరపదార్థాలే తినాలి.

★ మంచి ఆలోచనలే చేయాలి. ఈర్ష్యాద్వేషాలకు అతీతంగా ఉంటే మానసిక అలసట, తల బరువు ఉండవు.

★ మీ డ్రెస్సులు, శృతిమించని మేకప్‌లు మీ వ్యక్తిత్వానికి శోభ చేకూర్చేలా ఉండాలి.

★ రోజూ యోగాతోపాటు వారానికి మూడురోజులు వ్యాయామం చేస్తా.

★ మనసును, శరీరాన్ని ఆహ్లాదంగా పెట్టుకునేందుకు యోగాకు మించింది లేదు. ఏమైనా ఇబ్బందులు తలెత్తితే వైద్యుల సలహాతీసుకోవాలి.

★ గతంలో వెన్నునొప్పులతో బాధపడేదాన్ని. యోగా నేర్చుకుని దానిని పారద్రోలాను. దీన్ని ఎంతగా ఒంట బట్టించుకున్నానంటే ఇటీవల 'శిల్పాస్ యోగా' పేరుతో బ్రిటన్, దుబాయ్ మార్కెట్లో ఓ డీవీడీ కూడా విడుదల చేశాను.

★ యోగాను మతాచారంతో

ముడిపెట్టడం తప్పు. వెనుకటి తరాల కృషి ఫలితంగా ఆవిర్భవించిన శాస్త్రీయ ప్రక్రియ ఇది. ఇంటి పనులు, ఆఫీసు ఒత్తిడులతో సతమతమయ్యే స్త్రీలు కూడా తప్పకుండా యోగా చేయడం మంచిది.

★ నేను, నా చెల్లెలు ఇంట్లోని జిమ్‌లో అభ్యాసం చేస్తాం. ఇటలీ నుంచి తెప్పించిన మెషీన్స్, ఇంకా అధునాతన పరికరాలు అందుబాటులో ఉన్నాయి.

★ షెరిన్ పూజారి అనే శిక్షకుడి ఆధ్వర్యంలో వ్యాయామం చేస్తాం.

★ తక్కువ బరువున్న డంబ్ బెల్స్‌ను పైకెత్తుతుంటా. దీంతో చేతికండరాలు చక్కగా రూపుదిద్దుకుంటాయి.

★ వ్యాయామాల తర్వాత కాళ్లూ చేతులను చాపి కాస్సేపు పడుకోవాలి. దీంతో కండరాలకు విశ్రాంతి. కార్డియోవాస్క్యులర్ ఎక్సర్‌సైజులో భాగంగా ట్రెడ్‌మిల్ మీద పరుగెడతాను. దీంతో మంచి ఫిట్‌నెస్ లభిస్తుంది.

★ వేగంగా నడక సాగించడం నాకిష్టం.

★ ఎక్కడికి వెళ్లినా మంచినీళ్లు తీసికెళ్తా.. గోరువెచ్చనినీళ్లే తాగుతుంటాను. జీర్ణక్రియ బాగా జరగడమేకక నీటినుండి వచ్చే వ్యాధులు రావు.

★ సమతులాహారం తీసుకుంటూ వ్యాయామం చేయడం మంచిపద్ధతి.. డైటింగ్ చేసి కడుపుమాడ్చుకోవటంపై నాకు నమ్మకం లేదు. అలాగనీ ఇష్టాను సారం చికెన్, బటర్‌లాంటివి లాగించకూడదు. ఇంటి భోజనం మంచిది.

★ మాంసపుకృత్తులు ఎక్కువగా ఉండి పిండిపదార్థాలు తక్కువగా ఉన్న ఆహారం తీసుకుంటాను. దీంతో స్థూలకాయాన్ని అరికట్టడమేకాక, చక్కని ఆకృతి సొంతం అవుతుంది.

★ బయటి చిరుతిళ్లు ఎప్పుడూ తినొద్దు. స్నాక్స్‌వల్ల వచ్చే కాలరీలను కరిగించడం కష్టం. తియ్యటి పానీయాలు, కూల్‌డ్రింక్స్, 



జ్యూస్‌లకంటే అప్పుడప్పుడు టీ మేలు.

★ ఉదయం కొబ్బరినీళ్లు తాగుతాను. ఇటీవల గ్రీన్ టీ తాగుతున్నాను. శీతలపానీయాలు మానేసి ఏడేళ్లయింది.

★ బ్రేక్‌ఫాస్ట్ మితంగానే తీసుకుంటా. మధ్యాహ్నం భోజనంలో ఇంట్లో వండిన బ్రౌన్‌రైస్ లేదా రొట్టెలు, దాల్ లేదా చికెన్ కర్రీనో చేపలో తింటాను. రాత్రి బీటుదుంపలు, మొలకెత్తిన బీన్స్, ఆకుకూర ఫ్రై తింటాను. ఒక ఆమ్లెట్‌ను పుట్టగొడుగులతో తింటాను.

★ రాత్రి ఎనిమిది దాటిన తర్వాత ఇంకేమీ తినను. పడుకోడానికి మూడు గంటలు ముందు భోజనం చేయడంతో ఎక్కువ కాలరీలను కరిగించుకోవచ్చు.

★ చర్మ సౌందర్యానికి బీట్‌రూట్‌ను ఉడకబెట్టి మాయిశ్చరైజర్‌గా వాడుతాను. మొహంపై సోప్ వాడను. రాత్రి మేకప్‌ను శుభ్రంగా తొలగిస్తాను. అసలు మేకప్ బాగా పేరుకుపోయేలా వేసుకోను.

★ కేశ సౌందర్యం ఇనుమడించేందుకు రోజు విడిచి రోజు తలస్నానం చేస్తా. ©

## అపార్ట్‌మెంటాలజీ - 9

# లవ్‌కి మినిమమ్ ఏజ్ ఎంత?



యర్రంశెట్టి సాయి

(గత సంచిక తరువాయి...)

అప్పుడే ఇద్దరు గవర్నమెంట్ అధికారులు వాన్‌దిగి ప్రిన్సిపాల్ రూమ్‌లో కొచ్చారు.

"గుడ్ మార్నింగ్ మేడమ్! మేము ఎయిడ్స్ ప్రివెన్షన్ వింగ్ నుంచి వచ్చాం. మీతో ఆల్‌రెడీ ఫోన్‌లో మాట్లాడాము. ఎయిడ్స్ గురించి పిల్లల్లో అవగాహన కలిగించడానికి ఒక వీడియో ఫిలిమ్ ప్రదర్శించడానికొచ్చాం-"

"యా!! అయ్‌నో- మీరు మా ఆడిటోరియంలో మీ స్క్రీన్, వీడియో ఎక్విప్‌మెంట్ రడీ చేసుకోండి! నేను ఇప్పుడే పిల్లలందర్నీ ఆడిటోరియంలో అసెంబుల్ చేయిస్తాను- రాములూ వీరిని తీసుకెళ్ళు" అందామె.

"ఓ అరగంటాగి రండి మిస్టర్. ఈ వీడియో ఫిలిమ్ అయాక మళ్లీ మీతో మాట్లాడతాను" అంటూ ఆమె హడావుడిగా లేచి వెళ్లిపోయింది.

"పదండి- మనం కూడా బయట టీ తాగి- ఆ ఆడిటోరియంకెళ్దాం" అన్నాడు శంకరమూర్తి.

అందరం స్కూలుకి నాలుగిళ్ళ అవతల ఉన్న పంజాబీ దాబా కెళ్లాం.

"బాబూ ఆరు చాయ్ తీసుకురా!"

"ఇక్కడ చాయ్ దొరకదు సార్- బీరు- విస్కీ-"

"సరే- ఆరు బీర్ ఇవ్వు-" అని విజయ్ యాదవ్ అంటుంటే సీతావరదరాజన్ కంగారుగా అడ్డుపడింది.

"ఎన్నాప్పా? మేము లేడీస్‌దా ఉండి నాము- మాకు బీర్ తాగిస్తారా? "

"అయినా దాబాలో బీరు, విస్కీ ఎలా అమ్ముతున్నారు మీరు? " అడిగాడు శంకరమూర్తి.

"సార్ మీరు ఎక్సయిజ్ డిపార్ట్‌మెంటా? "

"కాదు"

"ఎక్సయిజ్ డిపార్ట్‌మెంటు సర్కిల్ ఇన్‌స్పెక్టర్ రోజూ ఇక్కడి కొచ్చి మందుకొట్టి వెళ్తుంటాడు. మీరేంది సార్ పెద్ద పుడింగ్ లెక్క కొశ్చెన్ చేస్తున్రు! ఇష్టమయితే తాగాలి, లేకుంటే బయటకు నడవాలి" అన్నాడతను.

దాంతో హమీద్‌మియా తిరగబడ్డాడు.

"హమ్‌కో క్యాసమజ్‌రైజీ! గావ్ వాలేస మ్‌జే క్యా? చాయ్ అడిగితే బీర్ ఇస్తానంటవ్? నేనిప్పుడే పోలీస్ కంప్లెయింట్

ఇస్తుంది"

ఈ గొడవ చూసి ఓనర్ లేచి మా దగ్గర కొచ్చాడు.

"అరేయ్- గిరాక్ సే క్యోం జగడాకర్ రహే హైరే-" అంటూ కోప్పడ్డాడు సర్వర్ ని.

"లేకపోతే రూల్స్ మాట్లాడుతున్రు సార్-"

"ఇదిగో చూడండి సార్! మేమీడ మద్యం అమ్ముతున్నందుకు అన్ని డిపార్ట్ మెంట్స్ లో పైసలు గడుతున్నాం! ఎరుకనా? మీరు ఎవళ్ళకి కంప్లెయిట్ చేసుకున్నా మాకేం కాదు-" అంటూండగానే బ్లూరోజ్ స్కూల్ యూనిఫాంలున్న బాయ్స్ నలుగురు- ఇద్దరు గాళ్స్ తో వచ్చి కూర్చున్నారు.

"ఆరు బీర్లు తీసుకురా" అన్నాడు అందులో ఒక స్టూడెంట్ సర్వర్ తో. మేము షాకయిపోయాం.

వాళ్ళందరికీ పదమూడేళ్ళ కంటే ఎక్కువ వయసుండదు. వెంటనే సర్వర్ బీర్లు తెచ్చి వాళ్ళ ముందుంచాడు.

"ఇదిగో సర్వర్- వాళ్లు చిన్నపిల్లలు- వాళ్ళకి మద్యం అమ్ముతున్నారా మీరు?"

"మంచిగున్నారు సార్- మాకు డిమాండంతా ఈ చుట్టూ ఉన్న రెండు స్కూల్స్, నాలుగు జూనియర్ కాలేజీలనుంచే - ఎరుకనా?"

హమీద్ కోపంగా లేచి ఆ స్టూడెంట్స్ దగ్గర కెళ్లాడు.

"మీరేక్లాస్ బాబూ?" అడిగాడా పిల్లల్ని.

"టెన్త్-"

"ఇంత చిన్న ఏజ్ లోనే బీరు తాగుతున్నారా?"

వాళ్లంతా మొఖాలు చూసుకుని ఒక్కసారిగా నవ్వారు.

"నీ చిన్నప్పుడు నువ్ తాగలేదని ఇప్పుడు అందర్నీ తాగొద్దంటే ఎట్లా అంకుల్... వెళ్ళి నీ పని చూస్కో-" అన్నాడొకడు రుబాబుగా-




దాంతో దాబా ఓనర్ ఓ కర్ర తీసుకొచ్చాడు మా దగ్గరకు.

"అరేయ్- బయటకు పోతారా - నాలుగు దంచమంటారా?" అన్నాడు ఆవేశంగా.

వాడి దూకుడు చూస్తుంటే దంచేట్లే ఉన్నాడని బయటకు నడిచాము.

ఎదురుగ్గానే సినిమాహాల్ ముందు - ఆ చుట్టుపక్కలున్న స్కూలు పిల్లలు చాలా మంది నిలబడి భయంకరమయిన బూతు పోజులున్న వాల్ పోస్టర్స్ వంకే చూస్తూ మాట్లాడుకుంటున్నారు.

"దిసీజ్ టూమచ్! ఈ సినిమా హాల్ మీద పోలీస్ కంప్లెయింట్ ఇస్తాం" అంది సీతావరదరాజన్.

"అమ్మా! దాబావాడు మంచివాడు కాబట్టి కర్ర తెచ్చాడు గాని తన్నకుండా వదిలేశాడు. అదే పోలీస్ స్టేషన్ అనుకో- లాఠీఛార్జే కాకుండా లోపల వేస్తారు-" అన్నాడు శంకరమూర్తి.

అందరం స్కూలు ఆడిటోరియం దగ్గర కెళ్లి అక్కడి దృశ్యం చూసి షాకయి నిలబడిపోయాం.

ఎదురుగ్గా ఎటు చూసినా కండోమ్‌లు-బెలూన్లలా ఎగురుతున్నాయ్. కండోమ్ పాకెట్స్ స్టూడెంట్స్‌కి ఫ్రీగా పంచుతున్నారు టెన్త్‌క్లాస్ పిల్లలు కొంతమంది.

"కండోమ్స్ విరివిగా వాడండి! 7ఇంట్లోనయినా, బయటయినా, మీరు వ్యభిచార గృహాలకెళ్లినా, - ఎక్కడయినా సరే కండోమ్ వాడండి! లైఫ్ ఎంజాయ్ చేయండి. ఎయిడ్స్ నుంచి రక్షణ పొందండి! ఎన్ని కావాలంటే అన్ని కండోమ్‌లు ఉచితం"- పిల్లలంతా ఫ్రీ కండోమ్స్ బోలెడు తీసుకుని బాగ్స్‌లో వేసుకుని బెలూన్స్‌లాగా ఉపయోగిస్తున్నారు.

"ఇంకాసేపు ఈ ఏరియాలో ఉంటే నాకు పిచ్చెక్కుతుంది-" అన్నాడు విజయ్‌యాదవ్. "ఇంపీరియలిజమ్ డౌన్ డౌన్!!" అని అరిచాడు ఆవేశంగా.

"అదంతా మన అపార్ట్‌మెంట్స్‌కెళ్లాక - ఇక్కడ కాదు" అన్నాడు శంకరమూర్తి.

అందరం ఆడిటోరియంలోకెళ్లేసరికి ఎయిడ్స్ మీద ఫిలిం చూపిస్తున్నారప్పటికే-

ఒక టీనేజ్‌గాళ్, టీనేజ్ బాయ్ మధ్యలో సెక్స్ సీన్-

"అరే అల్లా! యే బచ్చుంకో తుమ్‌హీ బచానా!" అన్నాడు హమీద్‌మియా.

"ఛీఛీ ఛీఛీ" అంది సీతావరదరాజన్ కళ్లు మూసుకుంటూ.

"ఇంత దారుణమయిన వీడియో ఫిలిమ్స్ పిల్లలకు చూపిస్తున్నారా!"

ఫిలిమ్‌లో ఆ అబ్బాయి డ్రస్ తీయపోతూంటే ఆ అమ్మాయి అతనికి తన జాకెట్‌లో దాచుకున్న కండోమ్ తీసి ఇచ్చింది.

దాని వెనకే ఫేమస్ సినిమా హీరోయిన్ డైలాగ్.

"మీరంతా కూడా ఎప్పుడు సెక్స్ అనుభవించాలనుకున్నా కండోమ్ వాడండి! బాగా తెలిసిన వ్యక్తితో సెక్స్ అయినా సరే కండోమ్ వాడండి. పూర్తిగా అపరిచితులతో కంపల్సరీగా కండోమ్ వాడండి! కండోమ్ వాడండి! ఎయిడ్స్ మహమ్మారిని పారద్రోలండి-" అందరూ తప్పట్లు కొట్టారు.

అందరూ బయటికెళ్లిపోతూంటే మేము కోపంగా ఆ ఎయిడ్స్ అధికారుల దగ్గర కెళ్లాం.

"మీకేమయినా కామన్ సెన్సుందా? చిన్న పిల్లలకు సెక్స్ ఎంజాయ్ చేయమని ఎంకరేజ్ చేస్తున్నారా? పైగా కండోమ్స్ పంచిపెడుతున్నారా? మీకేం సిగ్గూ శరం లేదా? మీకు పిల్లల్లేరూ - మీ పిల్లలు కండోమ్స్‌తో ఆడుకుంటుంటే మీకు హాపీగా ఉంటుందా? " అంటుండగానే ఓ పిల్ల చిన్న పరుగుతో కండోమ్ బెలూన్ పట్టుకొచ్చి ఆ ఎయిడ్స్ అధికారికి చూపించింది ఆనందంగా.

"డాడీ... నా కండోమ్ బెలూన్-"

"వెరీగుడ్-వెరీగుడ్- ఎంజాయ్" అన్నాడతను. ఆ పిల్ల మళ్లీ పరుగుతో వెళ్లిపోయింది.

"ఇదిగో చూడండి! మేము గవర్నమెంట్ అఫీషియల్స్‌మి. గవర్నమెంట్ తీసుకున్న పాలసీని ఇంప్లిమెంట్ చేస్తున్నాం! పిల్లలకు ఎయిడ్స్ అంటే అవగాహన కల్పించినప్పుడే ఎయిడ్స్‌ని ప్రివెంట్ చేయడానికి వీలుంటుందని మా నమ్మకం-" అన్నాడతను.

"కానీ మీ ప్రచారం తాలూకు నెగిటివ్ ఎఫెక్ట్స్ సంగతేంటి? పిల్లలు ఇప్పట్నుంచే సెక్స్‌లో పాల్గొనాలని అయిడియాలు మీరే క్రియేట్ చేస్తున్నారు కదా-"

"ఆ సంగతి మాకు తెలీదు- ప్రతి మంచి విషయానికీ ఒక చెడు కూడా ఉంటుంది. తప్పదు! అసలు అయిదోక్లాస్ లెవల్ నుంచే సెక్స్ ఎడ్యుకేషన్ స్టార్ట్ చేయాలని మేము ప్రయత్నిస్తున్నాం- ఏదోకరోజు అది ఇంప్లిమెంట్ చేసేస్తాం-" అనేసి వెళ్లిపోయాడతను.




మేము బయటకు నడుస్తోంటే ఆషా క్లాస్ టీచర్ సెల్‌ఫోన్లో బిగ్గరగా మాట్లాడుతోంది.

"యస్ డాక్టర్! నాది యాక్సిడెంటల్ ప్రెగ్నెన్సీ! టెర్మినేట్ చేయాలి. ఎప్పుడు రమ్మంటారు మీ నర్సింగ్ హోమ్‌కి? రేపా? ఓకే- థ్యాంక్యూ డాక్టర్- ఇంకోసారిలా ప్రెగ్నెన్సీ రాకుండా చూసుకోమంటారా? ఇకనుంచీ కేర్‌ఫుల్‌గా ఉంటాను మేడమ్"

అప్పుడే ఆషా ఒక కుర్రాడితో పరుగెత్తుకొచ్చింది. ఇద్దరి చేతిలో కండోమ్స్ ఉన్నయ్.

"డాడీ! ఇతనే రాహుల్- నా బాయ్ ఫ్రెండ్" - అంటూ ఆ కుర్రాడిని చూపించింది.

"మనం ఆషాని వదిలేసి ఈ కుర్రాడితో అన్ని విషయాలూ మాట్లాడితే బావుంటుంది" అన్నాడు శంకరమూర్తి.

"ఓకే ఆషా మేము రాహుల్‌తో మాట్లాడతాం-"

"ఓకే" అందామె.

అందరం ఆషానీ, రాహుల్‌ని ఓ చెట్టు కిందకు తీసుకెళ్లి ఇంటర్‌వ్యూ మొదలు పెట్టాం.

"నువ్వూ, ఆషా బాగా క్లోజ్ ఫ్రెండ్సా? "

"అవునంకుల్- నిజానికి మేమిద్దరం పెళ్లి కూడా చేసుకోవాలనుకుంటున్నాం-"

అందరం అదిరిపడ్డాం.

"వాట్ పెళ్లా? ఎయిత్ క్లాస్‌కే పెళ్లా? "

"అవునంకుల్! మేము ఆరో క్లాస్ నుంచే ప్రేమించుకుంటున్నాం-" అంది ఆషా.

"ఆ! ఆరోక్లాసా? ప్రేమించుకున్నారా? "

"అవునంకుల్- ప్రేమంటే తెలీదా? అదే సినిమాల్లో చూపిస్తుంటారు కదా? "

"కానీ ఇంత చిన్నవయసులో ప్రేమేంటి? "

"ప్రేమనేది నేచరల్‌గా కలుగుతుందం




కుల్- అది ఫలానా ఏజ్ నుంచి కలగాలి అని ఎక్కడా లేదు కదంకుల్-"

"కానీ ఇవన్నీ కాలేజ్ డేస్ కొచ్చాక చేయాల్సిన పనులు-"

"మొదట్లో మేమూ అదే అనుకున్నాం అంకుల్! కానీ అన్ని సినిమాల్లో ఇంటర్‌కొచ్చాక ప్రేమించుకోవచ్చన్నారు.. ఆ తరువాత 'టెన్త్‌క్లాస్' సినిమా చూశాం. ఓహో.. టెన్త్‌లోనే ప్రేమించుకోవచ్చని అప్పుడు మాకు తెలిసింది. ఆ తరువాత 'నైన్త్‌క్లాస్' అనే సినిమా చూసినప్పుడు అందులో హీరో వాళ్ల నాన్నతో అన్న డైలాగ్ మాకు నచ్చిందంకుల్-"

"ఏంటా డైలాగ్"

"ప్రేమకు మినిమమ్ ఏజ్ అంటూ ఏమీ లేదు నాన్నా! అది ఎప్పుడయినా.. ఏ వయసులోనయినా కలుగవచ్చు" అంటాడు హీరో.

"ఆ సినిమా చూశాక మేము ప్రేమించుకున్నాం" అంకుల్.

"ప్రేమించుకోటమన్నా ఎన్ని?" అంది సీతావరదరాజన్.

"టీవీలో అన్ని ఛానెల్స్‌లోనూ రోజు చూపిస్తున్నారు కదంకుల్! బాగా కావలించుకోటం - ముద్దులు పెట్టుకోవటం - ఒకళ్ళమీద ఒకళ్ళు పడుకోవటం-"

"చాలు చాలు" కెవ్వున అరచింది అంజన బొప్పాషా. సీతావరదరాజన్ సిగ్గుతో దూరంగా వెళ్ళి నిలబడింది "నా వల్ల కాదు- వాళ్ళ మాటలు వినటం" అంది.

"చాలేమిటి? అసలు వీళ్లిలా తయారవడానికి ఇంకేమేం అంశాలు ప్రభావం చూపుతున్నాయ్ అనేది మనం తెలుసుకోవాలి-" అన్నాడు విజయ్ యాదవ్.

"నువ్వూ, ఆషా ఇంకేమేం చేశారు? "

"ప్రేమించుకున్నాక అందరూ ఏం చేస్తారో అదే చేశాం అంకుల్- సినిమాల్లో చూశాంకదా! బట్టలన్నీ తీసేయటం-"

హమీద్‌మియా చెవులు మూసుకుని దూరంగా పరుగెత్తాడు.

"చూడు రాహుల్- అలా చూసినవన్నీ చేయటం తప్పుకదా? "

"తప్పనే భయపడి చాలా కాలం ఊరు

కున్నామంకుల్- కానీ ఒకసారి బ్లూఫిల్మ్‌ల గురించి ఫలానా న్యూస్ ఛానెల్లో చూపించారు. ఇంటర్నెట్ కేఫుల్లోనే యువతీయువకులంతా బ్లూఫిలింలు చూసి వాళ్లు కూడా ఆ కేఫ్‌లోనే సెక్స్ చేయటం- రోజంతా అదే చూపిస్తున్నప్పుడు నేనూ ఆషా మా ఇంట్లో ఆ ఛానెల్ చూశాం అంకుల్. అది చూశాక మాకూ అలా చేయాలనిపించింది. మేము కూడా ఇంటర్నెట్ కేఫ్‌కెళ్ళి అది చేస్తుంటే ఆ కేఫ్ ఓనర్ మమ్మల్ని బెదిరించి మా దగ్గర డబ్బు లాక్కున్నాడు. ఆ తరువాత మా మమ్మీ డాడీ ఆఫీస్‌కెళ్ళినప్పుడు ఇంట్లోనే ఇంటర్నెట్‌లో బ్లూ ఫిల్మ్ చూశాం. అది చూశాక మేము కూడా అలాగే చేశాం-"

ఆ డైలాగ్‌తో మాకు నీరసం వచ్చేసింది. అప్పుడే ఇంకో కుర్రాడు అరుస్తూ వచ్చాడు. "అరే రాహుల్! ఆ వీడియో షాపతను బ్లూఫిల్మ్ ఇస్తానన్నాడ్రా! ఎప్పుడు తీసుకుందాం?"

"ఇంక ఈ టాపిక్ అనవసరం" అన్నాడు విజయ్ యాదవ్ ఆవేశంగా.

వాళ్ళను వదిలేసి అందరం ఇంటికి బయల్దేరాం.

మాకు ముందు వెళ్తున్న ఒకామె సెల్‌ఫోన్లో బిగ్గరగా మాట్లాడుతోంది. "నీకేమయినా సిగ్గుందా? నేను మూడు నెలల్లో రెండోసారి ప్రెగ్నెంట్ అయాను- నీకెన్నిసార్లు చెప్పాలి? కండోమ్ మంచిది వాడమని?"

"ఏమిటి? ఎవరు మాట్లాడేది అనడుగుతున్నావా? ఇడియట్! ఎవరేంట్రా? అంటే ఎంత మందితో నీకు ఎఫైర్ ఉంది?"

"ఏంటీ - నన్ను మీ మిసెస్ అనుకున్నావా? సిగ్గులేకపోతే సరి! మిసెస్‌కి, గాళ్‌ఫ్రెండ్‌కి తేడా తెలీటం లేదంట్రా? నేను నీ మిసెస్‌నేరా రాస్కెల్- మిసెస్ అన్నా కూడా ఎన్నో నెంబరు, పెద్దిల్లా, చిన్నిల్లా అనవు కదా! అలా అంటే మర్డర్ చేస్తా! నా సంగతి నీకు తెలీదు-"

ఆమె ఇంకా మాట్లాడుతూనే ఉంది. దారిన పోయేవాళ్ళంతా ఆమె మాటలు హాపీగా వింటూ వెనకే ఫాలో అవుతున్నారు.

కానీ మేము మాత్రం ఆ వాగుడు భరించలేక కొంచెం ఫాస్ట్‌గా నడిచి బాగా ముందుకెళ్ళిపోయాం-

అక్కడ ఇంకో యంగ్‌గాళ్ రోడ్ పక్కన నిలబడి సెల్‌లో మాట్లాడుతోంది.

"నిజం రాజేష్! గాడ్ ప్రామిస్ యార్! నేను నిజంగానే తల్లిని కాబోతున్నాను. బిలీవ్‌మీ!"

"యా! నువ్ చెప్పింది నిజమే- నేను శేఖర్‌ని లవ్ చేశాక సిన్సియర్‌గా నిన్నే ప్రేమించాను రాజేష్!! కానీ నీ మీద లవ్‌తో రోజూ మీ ఇంటికొస్తున్న సమయంలో మీ డాడీతో ఫ్రెండ్‌షిప్ అయింది. సరిగ్గా అదే టైమ్‌లో అమితాబ్‌బచ్చన్ సినిమా 'నిశ్శబ్ద్' చూశాను. అందులో నాలాంటి యంగ్‌గాళ్ అమితాబ్ లాంటి ఎట్రాక్టివ్ ఓల్డ్‌మాన్‌తో లవ్‌లో పడటం నాకు థ్రిల్లింగ్ అనిపించింది. అప్పుడే మీ డాడీ మీద లవ్ ఏర్పడింది.

మీ డాడీ కూడా చాలా హాపీగా నన్ను ప్రేమించారు. ఆ థ్రిల్లే వేరనుకో రాజేష్- నిన్నే ఇద్దరం పెళ్ళి చేసుకోవాలని డిసైడ్ చేసుకున్నాం-"

"వాట్! బ్లడీ బిచ్ అంటున్నావా నన్ను! అయ్యో నేను ప్రెగ్నెంట్ అవలేదు రాజేష్! తల్లిని కాబోతున్నాను అంటే నీకు తల్లిని కాబోతున్నాను అని నా ఉద్దేశం! ఓషిట్! బాస్టర్డ్! కీప్ ది ఫోన్ అవే-"

'హే భగవాన్! ఈ సమాజాన్ని నువ్వే కాపాడాలి' అనుకుంటూ ఇంటిదారి పట్టాం అందరం. ©


ఆమె పాఠాలు బోధించే పంతులమ్మ. అయినా... ప్రపంచమనే పెద్ద పాఠశాలలో ఆమె కూడా ఒక విద్యార్థే. జీవితంపట్ల అవగాహన పెంచుకుంది. అంతులేని ఆత్మవిశ్వాసాన్ని అలవర్చుకుంది. అయినా దురదృష్టం అనే మాస్టారు బెత్తం పట్టుకుని బోధించిన పాఠాలతో అల్లకల్లోలమైందామె. అక్షరాక్షరంలో ఆసక్తిని రేకెత్తించే స్ఫూర్తిదాయక రచన
మాచిరాజు కామేశ్వరరావు దిశానిర్దేశం ఈనెల చతుర కానుక.

"ఏడుకొండల వెంకట రమణా, నాయనా-తండ్రీ! ఎక్కడ వున్నావురా స్వామి!" అని అలవాటుగా అనుకుంటూ మంచంమీద వాలింది అరుంధతి!

చిన్నగా కునుకు పట్టబోతూండగా వీధి తలుపు చప్పుడయింది. సాధారణంగా ఆ సమయంలో ఎవరూ రారు. "ఎవరూ!" అని అరిచింది అరుంధతి.

జవాబు లేదు. ఈసారి కాలింగ్‌బెల్ మోగింది.

"వస్తున్నా... వస్తున్నా" చిన్నగా నడుచుకుంటూ వెళ్ళి వీధి తలుపు తీసింది అరుంధతి.

గుమ్మంలో చేతిలో ఏదో పుస్తకంతో ఒక అపరిచితుడు! ముప్ఫై ఏళ్ళు వుండొచ్చు! మనిషి పొట్టిగా, కొద్దిగా లావుగా వున్నాడు. ఒత్తయిన మీసాలు- ఉంగరాల జుట్టు!

"ఎవరు కావాలి బాబు!" అతడినే తేరిపారి చూస్తోంది అరుంధతి.

"నీరజగారు..." అంటూ అతను ఇంకా ఏదో చెప్పబోతుండగా,

"లేదు బాబూ! పొద్దున్న ఎనిమిది గంటల బస్సులో చినలింగాయపాలెం వెళ్ళింది. వచ్చేసరికి సాయంత్రం ఆరు దాటుతుంది!" అంది అరుంధతి.

"మీరు నీరజగారి..."

"నీరజ మా అమ్మాయి బాబూ! అది చినలింగాయపాలెం స్కూల్లో టీచర్‌గా చేస్తుంది!"

"తెలుసు- మీతో మాట్లాడటానికే నేను వచ్చాను!"

"నాతో మాట్లాడలా!" ఆశ్చర్యపోతూ అడిగింది అరుంధతి.

"ఏం మాట్లాడాలి? "

"నన్ను కొద్దిగా లోపలికి రానిస్తే..." గుమ్మంలో ఇబ్బందిగా కదులుతూ అన్నాడు అతను.

"నా మతిమండ! నిన్ను గుమ్మంలోనే నిలబెట్టేశాను కదూ! లోపలికిరా బాబూ!" పక్కకి తప్పుకుంది అరుంధతి.

ముందు గదిలో నాలుగు ప్లాస్టిక్ కుర్చీలు, ఒక టీపాయ్ వుంది.

ఒక కుర్చీలో కూర్చుని కర్చీఫ్‌తో మొహం తుడుచుకున్నాడు అతను.

వంటింట్లోకి వెళ్ళి, స్టీలుగ్లాసులో మంచి నీళ్ళు తీసుకుని వచ్చింది అరుంధతి.

అతను గడగడ నీళ్ళు తాగేసి, గ్లాసు టీపాయ్ మీద పెట్టాడు. "మీరూ కూర్చోండి!"

"ఫ్యాన్ వేస్తాను- వుండు బాబు!" ఫ్యాన్ స్విచ్ వేసి, ఒక కుర్చీ కొంచెం పక్కగా జరుపుకుని కూర్చుంది అరుంధతి.

అతను గొంతు సవరించుకున్నాడు. "నా పేరు నిరంజనం- మొగిలిచెర్ల స్కూల్లో టీచర్‌గా చేస్తున్నాను!"

"మొగిలిచెర్ల కెనరా బ్యాంకు మేనేజర్ తోఫిక్ అని వున్నాడు. చాలా మంచివాడు. ఆయన ఇచ్చిన లోన్‌తోనే ఆ టి.వీ. కొనుకున్నాం" గదిలో ఒక మూల వున్న టీ.వీ చూపిస్తూ అంది అరుంధతి.

"అన్నట్లు మొగిలిచెర్ల చినలింగాయపాలెంకి ఎంతదూరం? "

"పది కిలోమీటర్లు వుండొచ్చు!" పొడిగా అన్నాడు నిరంజనం.

"ఆ ఊళ్ళోనే మేం ఎంతగానో అభిమానించిన రచయిత్రి రామేశ్వరిగారు వుంటున్నారట..."

"అవును- ఆ ఊళ్ళో ఆ కుటుంబాన్ని ఎరగనివారు వుండరు!"

"ఒకసారి ఆవిడను కలవాలనివుంది"

"మా ఊరు రండి. ఇంటికి వచ్చిన వారితో ఆవిడ ఎంతో ప్రేమగా మాట్లాడతారు. ఎన్నో ఆధ్యాత్మిక విషయాలు కూడా చెబుతారు? "

"నాకు సుగరు- ప్రయాణం చేసే ఓపిక

లేదు బాబూ!"

అతను ఒకసారి చేయి పైకెత్తి రిస్ట్‌వాచ్‌లో టైం చూసుకున్నాడు.

అతను చెప్పాలనుకున్నది చెప్పనీయకుండా ప్రసంగాన్ని తప్పుదారి పట్టించినందుకు నొచ్చుకుంది అరుంధతి. "అన్నట్లు నువ్వేదో చెప్పాలని వచ్చావు కదూ!"

అతను నవ్వాడు. "నీరజగారు నాకు నాలుగేళ్ళుగా తెలుసు!"

"అలాగా- అది వాళ్ళ నాన్నగారు పోయినప్పటినుంచీ- అంటే ఆరేళ్ళుగా అదే స్కూల్లో టీచర్‌గా చేస్తోంది. ఇరవై రెండేళ్ళకే అది ఉద్యోగంలో చేరిపోయింది. ఆ టైంలో అది ఉద్యోగంలో చేరకపోయివుంటే మా పాట్లు ఏం చెప్పమంటావు? " అతని మొహంలో చికాకు చూసి, క్షణం ఆగింది అరుంధతి.

"నీరజగారు నాకు తన గురించి అంతా చెప్పారు!"

"అలాగే బాబూ... నువ్వేదో చెప్పాలన్నావు? "

"మొగిలిచెర్లలోనే మాకు ఇల్లుంది- ఆరు ఎకరాల పొలం ఉంది. పొగాకు పండిస్తాడు నాన్న! అమ్మా నాన్నలకి నేనూ, మా చెల్లెలు ఇద్దరమే- చెల్లెలు ప్రైవేటుగా బి.ఎ. పరీక్షలు వ్రాస్తోంది"

"అలాగా- మాకు నీరజ ఒక్కతే! పెళ్ళయిన పదేళ్ళకి పుట్టింది. వాళ్ళ నాన్నగారు శింగరాయకొండ పొగాకు మిల్లులో చేసేవారు. రోజూ కందుకూరు నుంచి శింగరాయకొండ వెళ్ళి వచ్చేవారు! యాభైమూడేళ్ళకే దుక్కలాంటి మనిషిని అనారోగ్యం నమిలేసింది. ఇక్కడి ఇల్లు అమ్మి మద్రాసు తీసికెళ్ళి వైద్యం చేయించాను. అయినా ఆయన దక్కలేదు! ఈ ఊళ్ళోనే ఇప్పుడు అద్దె ఇంట్లో ఉంటున్నాం. నీరజకి చినలింగాయపాలెంలో టీచర్ ఉద్యోగం రాగానే, ఆ ఊరు వెళ్ళిపోదాం అన్నాను నేను. తను

## కొత్తగాలి...

మమ్మీడాడీలు
క్లబ్బు పబ్బులకి
ఇంట్లో పాపలకి తోడు
ఇంటర్నెట్

-వారణాశి రామకృష్ణ, హైదరాబాద్

ఒప్పుకోలేదు. ఇది అలవాటయిన ఊరు! నా అనారోగ్యంరీత్యా ఈ వూరే నయం అంది! ఏ అవసరం వచ్చినా గంటన్నరలో ఒంగోలు వెళ్ళిపోవచ్చు అందుకే ఇక్కడే వుండిపోయాం" తన ధోరణిలో చెప్పుకుంటూపోతోంది అరుంధతి. "ఉండు బాబూ, నీకు కొంచెం కాఫీ పెట్టి తీసుకువస్తాను!"

"కాఫీ వద్దు- మీరు నేను చెప్పేది వింటే చాలు!" కొంచెం అసహనంగా అన్నాడు నిరంజనం.

"చెప్పు బాబూ- మొహమాట పడకు!" కుర్చీలోంచి లేచిన అరుంధతి మళ్ళీ కూర్చుంది.

"నాకు ముందు అద్దంకిలో ఉద్యోగం వచ్చింది. వెళ్ళలేదు. నాలుగేళ్ళ క్రితం మొగిలిచెర్లలోనే టీచర్ ఉద్యోగం వస్తే చేరాను. అమ్మా నాన్న పెళ్ళి చేస్తాం అంటున్నారు. అయితే ఇంత చిన్న జీతంతో పెళ్లి చేసుకునే ధైర్యం లేదు నాకు! భార్య కూడా ఉద్యోగిని అయివుంటే బావుంటుందని నా ఉద్దేశం!"

"అవును బాబూ! ఈ రోజుల్లో మొగుడు పెళ్ళాలిద్దరూ సంపాదించుకుంటేనే గానీ సంసారం గడవదు- ఆ రోజుల్లోనే నేను, కనీసం డిగ్రీదాకా అయినా ఎందుకు చదువుకోలేదా అని బాధపడేదానిని! నీరజ బి.ఇడి పరీక్షలు వ్రాసే టైంలోనే నేను ఈయనను తీసుకుని మద్రాసు వెళ్లవలసివ

చ్చింది. నీరజ తనూ వస్తానంది. నేనే ఒప్పుకోలేదు! పరీక్షలు వ్రాయమన్నాను. అప్పుడు బి.ఇడి కంప్లీట్ చేసింది కాబట్టి, ఈయన పోయిన ఆరు నెలల్లో దానికి టీచర్ ఉద్యోగం వచ్చింది" గుక్క తిప్పుకోకుండా చెప్పుకుపోతోంది అరుంధతి.

"నేను మరో అరగంటలో ఇక్కడ ఒక మీటింగ్ అటెండ్ అవ్వాలి!" చెప్పదలుచుకున్నది చెప్పనీయి తల్లీ అన్నట్లుగా మొహం పెట్టాడు నిరంజనం.

"అలాగా- అయితే నువ్వు చెప్పాలనుకున్నది చెప్పేయి బాబూ!"

"నేను నీరజగారిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను!" అరుంధతి మొహంలో భావాలు చదవడానికన్నట్లు క్షణం ఆగాడు నిరంజనం.

అరుంధతికి నోట మాట రాలేదు. అది కలో, నిజమో రూఢీ పరచుకోడానికన్నట్లుగా "ఏమన్నావు బాబూ! మరోసారి చెప్పు!" అంది ఎలాగో గొంతు పెగుల్చుకుని.

"నేను నీరజగారిని పెళ్ళి చేసుకునే ఉద్దేశాన్ని వారం క్రితమే ఆమెకు తెలియజేశాను"

"మా నీరజ చాలా అదృష్టవంతురాలు బాబూ!" ఆనందంతో ఏం మాట్లాడాలో తోచడం లేదు అరుంధతికి.

"నీలాంటి నెమ్మదస్తుడు, మంచివాడు..."

అరుంధతి మాటలకి అడ్డుపడ్డాడు నిరంజనం. "ఈ విషయం చెప్పగానే మీ అమ్మాయి తను ఆలోచించుకోడానికి రెండు రోజుల టైం కావాలని అడిగింది. తరువాత కలిస్తే "ఇప్పుడు పెళ్ళి చేసుకునే ఆలోచన లేదు!" అంటోంది.

"అలా అందా మా నీరజ!" నమ్మలేనట్లుగా అడిగింది అరుంధతి.

"తను మీతో నా గురించి ఏమీ చెప్పలేదా? "

లేదన్నట్లుగా తల ఊపింది అరుంధతి. "నాతో మాట మాత్రం అనలేదు. అప్పుడే ఇరవై ఎనిమిదేళ్ళు నిండాయి! ఇంకా ఎప్పుడు చేసుకుంటుందట పెళ్ళి? " కోపంతో అరుంధతి మొహం ఎర్రబడింది.

"మొదట్లోనే కట్న ప్రసక్తి లేదని చెప్పాను...? మరి ఈ పెళ్ళి విషయంలో ఆవిడ అభ్యంతరం ఏమిటో తెలియడం లేదు! ముభావంగా 'ఇప్పట్లో ఆలోచన లేదు' అని మాత్రం అన్నారు ఆవిడ! ఈ ఫిబ్రవరిలోనే మా వాళ్ళు నా పెళ్ళి చేయాలని పట్టుదలగా వున్నారు. మొన్న నవంబర్‌లోనే నాకు ముప్పై నిండాయి!" అరుంధతి ఈ పెళ్ళి విషయంలో సుముఖంగా వుండేసరికి నిరంజనంలో కొత్త ఉత్సాహం వచ్చింది.

"మీ వాళ్ళు తొందరపడటంలో ఆశ్చర్యం ఏమీ లేదు! అప్పుడే నీకు ముప్పై దాటాయి కదా- ఇంకా పెళ్ళికి చెల్లెలు వుంది! వాళ్ళు మాత్రం పిల్లల బాధ్యత తీర్చుకోకుండా ఎన్నాళ్ళని ఆగగలరు? మా నీరజ ఇప్పుడు పెళ్ళి చేసుకోక ఏం చేస్తుందట? ఎవరిని ఉద్ధరిస్తుందట? " షుగర్ జబ్బున్న అరుంధతిని తాత్కాలికంగా పెరిగిన బి.పి. బాధిస్తోంది.

నిరంజనంలో కొత్త ఆశలు చిగురిస్తున్నాయి. "పెళ్ళి కూడా సింపుల్‌గా చేస్తే చాలని చెప్పాను! ఆవిడ ఏదో విషయంలో మధనపడుతున్నారనిపిస్తోంది. ఎందుకో నిర్ణయం తీసుకోలేకపోతున్నారు! పెద్దవారు మీరు నచ్చచెబితే..."

"నచ్చజెప్పడమా? కాదంటే కాళ్ళు విరగగొట్టి పీటలమీద కూర్చోబెడతాను! జీవితం అంటే ఏం అనుకుంటోందో? నలుగురు పిల్లలకి చెప్పడం కాదు, తన విషయం తను తెలుసుకోవాలి. ఆయన పైనుంచి చల్లగా చూస్తున్నారు కాబట్టే దానికి ఇంత

## గులకరాళ్లేనా..?

ఈ గులకరాళ్లలో
నిశితంగా పరిశీలించి
చూడండి ఓ చేప
కనిపిస్తుంది.
సముద్రం
అడుగుభాగంలో నివసించే
ఫ్లౌండర్స్‌చేప ఇది.
శత్రువుల కంటికి కనిపించ
కుండా ఉండేందుకు,
ఆహార సేకరణకు
రాళ్ల రంగులోనే ఇలా
కలగలిసిపోతుందీ
మత్స్యరాజం ..!



మంచి సంబంధం వచ్చింది!"

"మేం మధ్యతరగతి వాళ్ళమేలెండి!" తమది గొప్ప సంబంధం ఏమీ కాదన్నట్లుగా అన్నాడు నిరంజనం.

"డబ్బు కాదు బాబూ ప్రధానం! మనుషులు మంచివాళ్ళు కావాలి! ఒకరినొకరు అర్థం చేసుకోవాలి! మనసులు కలవాలి! పరస్పరం నమ్మకం వుండాలి! నేను సాయంత్రం అది రాగానే నాలుగు ముక్కలు రాసి పంపుతాను. ఎల్లుండి ఆదివారం మీ ఊరు వచ్చి పెళ్ళి చూపులకి రమ్మని మీ అమ్మగారినీ, నాన్నగారినీ ఆహ్వానిస్తాను. మీ ఎడ్రస్..."

"ఆ ఊళ్ళో కెనరాబ్యాంక్‌కి రెండు ఇళ్ళ ఇవతలే మా ఇల్లు. రాజేశం అని నాన్న పేరు చెబితే ఇల్లు ఎవరయినా చూపిస్తారు! కానీ మీరొక్కరే రాగలరా! అనుమానంగా అన్నాడు నిరంజనం, వాచి వున్న అరుంధతి పాదాలను చూస్తూ.

"మా ఇంటివాళ్ళు చాలా మంచివాళ్ళు! రత్నం రమాపతి నన్ను ఇంట్లో మనిషిలా చూసుకుంటారు. ముగ్గురు వస్తే పనికాదు కాబట్టి నాతో రమాపతిని తీసుకువస్తాను" అంది అరుంధతి.

"అయితే ఆదివారం నాన్నగారిని ఇంట్లోనే వుండమని చెబుతాను!" లేచాడు నిరంజనం! ఇప్పుడు అతని మనసెంతో తేలికగా వుంది. "మీరు మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ నీరజ గారిమీద ఒత్తిడి తీసుకుని రావద్దు. నా పట్ల తన అభిప్రాయం ఏమిటో ముందు తెలుసుకోండి!"

నిరంజనాన్ని బలవంతంగా కూర్చోబెట్టి కాఫీ కలిపి తెచ్చింది అరుంధతి. "అది పేరుకి టీచర్‌గానీ లోకజ్ఞానం బొత్తిగా లేదు! దాని మాటలకి మనసు కష్టపెట్టుకోకు బాబూ! నేను అంతా సరిచేస్తాను!" నిరంజనాన్ని గేటు దాకా సాగనంపింది అరుంధతి.

తలుపు మూసి, లోపలికి వచ్చిన అరుంధతి పడుకోలేకపోయింది, కూర్చోలేకపోయింది! మనసంతా ఆనందంతో తేలిపోతోంది. త్వరలోనే తన బాధ్యత తీరిపోతుంది! ఆయన వున్నప్పుడు నీరజ భవిష్యత్తు గురించి ఎన్నో కలలు కనేవారు. "మనకి లేకలేక పుట్టిన ఒక్కగానొక్క పిల్ల! ఇది మనలా కష్టపడకూడదు!" అనేవారు నీరజను ముద్దులతో ముంచెత్తుతూ. "దీనికి బాగా చదువు చెప్పిస్తాను. గొప్పింటి సంబంధం చేస్తాను. మన పిల్లకేం బంగారు బొమ్మ!" అంటూ మురిసిపోయేవారు!

నీరజ కూడా తండ్రి చంక దిగేది కాదు!

అరుంధతి ట్రంకు పెట్టెలో అడుగున వున్న పాత ఫొటో ఆల్బమ్‌లు పైకి తీసి దుమ్ము దులిపింది.

మొదటి పేజీలో అన్ని ఫొటోలూ నెలల పిల్ల నీరజని ఎత్తుకుని నవ్వుతున్న నారాయణవే!

చూస్తుండగానే ఫొటోలు మసకబారాయి.

పమిట చెంగుతో కళ్ళు వొత్తుకుంది అరుంధతి. "మన అమ్మాయికి మీరు ఆశించినట్లుగా గొప్పింటి సంబంధం చేయలేకపోయినా ఇది మంచి సంబంధమనే నాకు అనిపిస్తోంది. కుర్రాడు బుద్ధిమంతుడిలా కనిపించాడు. నెమ్మదస్తుడు కూడానూ!" తనలో తాను గొణుక్కుంది అరుంధతి.

అరుంధతి ఫొటోలు చూస్తుండగా పనిమనిషి సరోజమ్మ వచ్చి అంట్లు తోమింది. ఇల్లు తుడిచింది.

అప్పుడు టైం చూసింది అరుంధతి.

ఐదు కావస్తోంది.

"వెళుతున్నానమ్మా" సింకు దగ్గర తన కోసం వుంచిన రెండు అరటి పళ్ళను తీసుకుని వెళ్ళబోయింది సరోజమ్మ.

"మేడమీద ఆరిన బట్టలు తీసుకువచ్చి

## కొత్తగాలి

**చెట్టు**
**సేవకే**
**అంకితమైన ప్రాణి**
**రాయితో కొట్టినా, రంపంతో**
**కోసినా శపించని మౌని**

*–గరిశకుర్తి రాజేంద్ర, భిక్నూర్*

మడత పెట్టి వెళ్ళు సరోజమ్మా- రోజూ చెప్పాలా? " అరిచింది అరుంధతి.

సణుగుకుంటూ ఆరిన బట్టలు తెచ్చి టీపాయ్ మీద పెట్టి వెళ్ళిపోయింది సరోజమ్మ!

తలుపు మూసి వచ్చిన అరుంధతి కాలు గాలిన పిల్లిలా ఈ గదిలోంచి ఆ గదిలోకి, ఆ గదిలోంచి ఈ గదిలోకి తిరుగుతోంది. మాటిమాటికి టైం చూస్తోంది. "మరో అర గంటలో అమ్మాయి వచ్చేస్తుంది. ఇప్పుడే పెళ్ళి చేసుకోదట యువరాణీ- ఇంకా నయం! తన దగ్గర ఆ మాట ఎలా అంటుందో చూడాలి!"

సరిగ్గా ఆరింటికల్లా నీరజ వచ్చేసింది.

వస్తూనే స్నానం చేసి, ఇద్దరికీ కాఫీ కలిపి తెచ్చింది.

నీరజ కాఫీ పూర్తిగా తాగేదాకా ఏమీ మాట్లాడలేదు అరుంధతి!

నీరజ టీవీ ఆన్‌చేసి, రెండు అరిటికాయలు తెచ్చి చెక్కు తీస్తోంది.

"ఈరోజు ఇంటికి ఎవరు వచ్చారో తెలుసా? " టీవీ ఆఫ్‌చేస్తూ అంది అరుంధతి.

"ఎవరు వచ్చారు? "

"నిరంజనం"

తుళ్ళిపడింది నీరజ! వెంటనే సర్దుకుని, నీళ్ళగిన్నెలోకి అరటికాయముక్కలు తరిగి వేస్తూ, "నిరంజనం ఎవరు? " అంది తల్లి మొహంలోకి చూడకుండానే!

"నిజంగా నిరంజనం ఎవరో నీకు తెలియదా? " సూటిగా అడిగేసింది అరుంధతి.

క్షణంపాటు ఏం జవాబు చెప్పాలో తోచలేదు నీరజకి.

"నాకు ఇద్దరు నిరంజనాలు తెలుసు! ఇంతకీ వచ్చిందెవరు? ఏ పనిమీద వచ్చారు? " కూరముక్కలు తీసుకుని వంటింట్లోకి వెళ్ళిపోయింది నీరజ.

"వంట సంగతి తరువాత చూడొచ్చుగానీ ముందు నువ్విలారా!" అరిచింది అరుంధతి.

"వస్తున్నా- ఎందుకలా గొంతు చించుకుంటావ్? మూకుడులో కూరముక్కలు వేసి, కుక్కర్‌లో అన్నం పడేసి వస్తాను!" చిరాగ్గా వంటింట్లోంచే జవాబిచ్చింది నీరజ.

"ఇప్పుడు వంటకేం తొందర? రోజూ ఏడయితేనేగానీ వంటింట్లోకి అడుగు పెట్టనిదానివి, ఆరున్నరకే వెళ్ళిపోయావు? నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి!" అసహనంగా అంది అరుంధతి.

పది నిముషాల తరువాత నాప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ వచ్చింది నీరజ. "ఇప్పుడు చెప్పు- ఏమిటాముఖ్యమైన విషయం? "

"మన ఇంటికి వచ్చింది ఎవరో తెలుసా? నిన్ను పెళ్ళిచేసుకుంటానని నీ అభిప్రాయం అడిగిన నిరంజనం!" నీరజనే సూటిగా చూస్తూ అంది అరుంధతి.

"నా నిర్ణయం చెప్పేశాక, మన ఇంట్లో అతనికేంపని? "

"అలా టెంపర్‌గా మాట్లాడకు! ఆడపిల్లకి అణుకువే అందం!" ముద్దుగా కోపగించుకుంది అరుంధతి.

"ఇంతకీ నువ్వేం చెప్పదలుచుకున్నావ్? త్వరగా చెప్పు! అవతల కూర మాడిపోతుంది!"

"ఫర్వాలేదు- కూర మాడితే అవతల పారేయవచ్చు! ఇది జీవితానికి సంబంధం

చిన విషయం! అతనితో "ఇప్పట్లో పెళ్ళి ఆలోచన లేదు" అని చెప్పావట!"

"అవును- అన్నాను!" నిర్లక్ష్యంగా అంది నీరజ.

"నీకేమయినా మతి పోయిందా? నువ్వేమయినా ఇంకా ఇరవైఏళ్ళ కాలేజీ అమ్మాయనుకుంటున్నావా? లేకపోతే మీ నాన్నగారు కోటీశ్వరుడి సంబంధం తీసుకువస్తాడని కలలు కంటున్నావా? ఇప్పుడు నీ వయసెంత? ఇరవైఎనిమిది దాటింది! నా అంత వయసు వచ్చాక చేసుకుంటావా పెళ్ళి? అయినా ఈ విషయంలో ఒక్క మాట నాకు చెప్పావా? ఈ ముసలిదానికేమిటిలే చెప్పడం అనుకున్నావా?" ఆవేశంగా మాట్లాడటంతో ఆయాసం వచ్చింది అరుంధతికి.

"ముందు ఈ నీళ్ళు తాగు!" గ్లాసులో మంచినీళ్ళు తీసుకువచ్చింది నీరజ.

మాట్లాడకుండా నీళ్ళు తాగేసింది అరుంధతి.

"ఇప్పుడు చెప్పు! అసలు ఏమిటి నీ ఉద్దేశం?"

"చెప్పడానికేం వుంది? నాకు ఇప్పట్లో పెళ్ళి చేసుకునే ఆలోచన లేదు!"

"అదే ఎందుకు లేదని అడుగుతున్నాను!"

"ఏమో! అసలు జీవితంలో పెళ్ళి చేసుకుంటానో లేదో, అదీ చెప్పలేను!"

"అలా మాట్లాడితే పళ్ళు రాలగొడతాను! అలా అనడం గొప్ప అనుకుంటున్నావేమో! పెళ్ళి అనేది లేకపోతే జీవితానికి పరిపూర్ణత అనేదే లేదు!"

"అవన్నీ పాత మాటలు! ఈ కాలంలో ఎంతోమంది అమ్మాయిలు పెళ్ళి అనే ఊబిలో కూరుకుపోకుండా, స్వంత కాళ్ళ మీద నిలబడి, హాయిగా గడిపేస్తున్నారు!"

"అలా అని భ్రమ పడుతున్నారు! ఒంటరిగా పక్షులు కూడా ఆనందంగా వుండలేవు- అది తెలుసుకో!"

"జీవితానికో లక్ష్యం నిర్దేశించుకుంటే దానిని సాధించడంలోనే ఆనందం, తృప్తి వుంటాయి! అయినా ఇప్పుడు నాకేం లోటుంది? హాయిగా లేనూ?"

"అలా మొండిగా మాట్లాడకు. నిరంజనం మంచివాడిలా కనబడ్డాడు. చినలింగాయపాలెంకి ఇప్పుడు కందుకూరు నుంచి వెళుతున్నావు. అప్పుడు మొగిలిచెర్ల నుండి వెళతావు. ఉద్యోగం మానేసే పనిలేదు. నీ ఆర్థిక స్వాతంత్ర్యం నీకు వుంటుంది!" అంటూ అరుంధతి ఇంకా ఏదో చెప్పబోతుండగా వంటింట్లోకి వెళ్ళి వంట పూర్తి చేసి పావుగంట తరువాత తిరిగి వచ్చింది నీరజ.

"ఏడున్నర కావస్తోంది. టీవీ పెట్టుకో- రోజూ చూసే సీరియల్ మిస్ అయిపోతావు!" తల్లి చేతిలోంచి రిమోట్ అందుకోబోయింది నీరజ.

అరుంధతి ఆ చేయి వెనక్కి పెట్టుకుని, "ఈ ఆదివారం నేను మొగిలిచెర్ల వెళతాను. నిరంజనం తల్లిదండ్రులతో అన్నీ మాట్లాడి వస్తాను!" అంది స్థిరంగా.

"అటువంటి వృధా శ్రమలు పడకు! నేనీ పెళ్ళిచేసుకోను" టేబుల్‌పైని వున్న మేగజైన్ తీసుకుని, ముందు గదిలోకి వెళ్ళిపోయింది నీరజ.

ఎనిమిది అయ్యాక వచ్చి "భోజనం వడ్డించనా?" అని అడిగింది తల్లిని.

"నాకు ఆకలిగా లేదు" ముక్తసరిగా అంది అరుంధతి.

తొమ్మిది అయ్యాక మళ్ళీ వచ్చింది. అప్పుడు కూడా భోజనానికి లేవకుండా "నా మాట విను..." అంటూ కూతురికి నచ్చజెప్పాలని చూసింది అరుంధతి.

"నేను ఎవరి మాటా విననను" అంటూ విసురుగా మళ్ళీ వీధి గదిలోకి వెళ్ళిపోయింది నీరజ.

## కొత్తగాలి... 

**గుప్పెడు గుండెనిండా**
**సముద్రాలు**
**అందుకే**
**కళ్లలో ఎపుడూ అలలు**

*-ఎస్.ఆర్. భల్లం, తాడేపల్లిగూడెం*

'ఏమిటీ పిల్ల? ఇంత మొండిగా తయారయింది!' కూతురి ప్రవర్తనకి భారంగా నిట్టూర్చింది అరుంధతి.

ముందుగదిలో కుర్చీలో కూర్చుని మేగజైన్ తిరగేస్తోంది నీరజ. మేగజైన్‌లో అక్షరాలన్నీ అల్లుకుపోయినట్లుగా కనిపిస్తున్నాయి!

వారం క్రితం చినలింగాయపాలెం బస్సు స్టాండులో జరిగిన సంఘటనే కళ్ళ ముందు కదులుతోంది!

ఆరోజు స్కూలు వదలగానే అలవాటుగా సుగుణతో కలిసి బస్సు స్టాండుదాకా వచ్చింది నీరజ.

"వెళ్ళొస్తాను- బై" వెళ్లిపోయింది సుగుణ. వాళ్ళ ఇల్లు సినిమా హాలు ఎదురు సందులో వుంది!

నీరజ బస్సు కోసం చూస్తోంది!

"హాయ్! నీరజగారూ, బావున్నారా?" రోడ్డు దాటి వచ్చాడు నిరంజనం.

తమ స్కూల్ హెడ్‌మాస్టర్ గోపాలరావుగారి చుట్టం నిరంజనం! తరుచూ స్కూలుకి వస్తుంటాడు. కలివిడిగా మాట్లాడతాడు! నీరజ కూడా అతనితో అన్ని విషయాలు చర్చిస్తూ వుంటుంది.

"ఏమిటి ఈ టైంలో వస్తున్నారు! ఈ రోజు స్కూల్‌కి గోపాలరావుగారు రాలేదు!' ' అంది నీరజ నవ్వుతూ.

"తెలుసు- నేను మీతో మాట్లాడాలనే వచ్చాను. అందుకే బస్సు స్టాపు దగ్గర ఎదురు చూస్తున్నాను!" చుట్టూ చూస్తూ అన్నాడు నిరంజనం!

చుట్టుపక్కల మనుషులు లేరుగానీ ఆ వైపు పాక హోటల్ దగ్గిర చాలా మంది బజ్జీలు తింటున్నారు. టీలు తాగుతున్నారు. మొగిలిచెర్ల వెళ్ళే ఎర్రబస్సు హోటల్ దగ్గిర ఆగి వుంది! డ్రైవర్, కండక్టర్ కూడా టీ కోసం దిగారు!

"నాతో మాట్లాడాలా" నమ్మలేనట్లుగా అడిగింది నీరజ. "ఏమిటో చెప్పండి!"

కాస్సేపు మౌనంగా ఉన్నాడు నిరజంనం.

"మీ అభిప్రాయం తెలుసుకోవాలని వచ్చాను"

"ఏ విషయంలో..."

"నా విషయంలో"

"మీ విషయంలోనా? నాకేమీ అర్థం కావడం లేదు" నీరజకి నిజంగా అంతా అయోమయంగా వుంది.

"ఉండండి- అర్థం అయ్యేలా చెబుతాను! కూల్‌డ్రింక్ తీసుకుంటారా?"

"వద్దు- అసలు విషయం చెప్పండి. మళ్ళీ బస్సు వచ్చేస్తుంది!" దుమ్ము రేపుకుంటూ వెళుతున్న మొగిలిచర్ల బస్సును చూస్తూ ముక్కుకి కర్చీఫ్ అడ్డం పెట్టుకుంది నీరజ.

"నేను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను!"

"కంగ్రాట్స్" వెంటనే అంది నీరజ.

"మీరు అంగీకరిస్తే మిమ్మల్నే" ఆపై ఏం అనాలో తోచలేదు నిరంజనంకి.

తుళ్ళిపడింది నీరజ.

వెంటనే ఎలా స్పందించాలో తెలియదు.

"మా కుటుంబ విషయాలు మీకు తెలుసు. మీ సంగతులన్నీ నాకు తెలుసు. ఈ రోజుల్లో మొగుడు పెళ్ళాలిద్దరూ ఉద్యోగాలు చేసుకుంటేనే బావుంటుందని నా ఉద్దేశం..."

"అది నిజమే అనుకోండి..."

"మాకు కట్నాలతో పనిలేదు. మీరు ఒ.కె అంటే మీ వాళ్ళతో మాట్లాడి..." అతను వాక్యం పూర్తి చేయకముందే కందుకూరు బస్సు వచ్చింది.

"ఆలోచించుకోడానికి నాకు రెండు రోజుల వ్యవధి కావాలి!" బ్రతుకు జీవుడా అనుకుని బస్సు ఎక్కేసింది నీరజ.

ఆ రాత్రి నీరజకి కంటి మీద కునుకు లేదు.

నిరంజన్ మంచివాడు. మృదుస్వభావి. తను నాలుగేళ్ళుగా చూస్తోంది. అందగాడు కాకపోయినా, అనాకారి మాత్రం కాదు. అయినా ఒకసారి వాళ్ళ ఇంట్లో వాళ్ళతో మాట్లాడితేనేగానీ తను ఈ పెళ్ళి విషయంలో ఒక నిర్ణయం తీసుకోలేదు!

మర్నాడు స్కూల్‌కి లీవ్‌పెట్టి, తిన్నగా మొగిలిచెర్లకి వెళ్ళింది. మొదటిసారి ఆ ఊరు వెళ్ళడం.

ఇల్లు సులభంగానే తెలిసింది!

ఆ టైంలో నిరంజనం స్కూల్లో వుంటాడని తెలుసు! చుట్టూ స్థలం, మధ్యలో డాబా ఇల్లు. ముందువైపు స్థలంలో కొబ్బరి చెట్లు, రాచ ఉసిరిక చెట్టు!

ఒక పద్దెనిమిదేళ్ళ అమ్మాయి ఒక కర్రతో పండిన రాచ ఉసిరికాయలు దులుపుతోంది.

"ఎవరు కావాలండీ?" గేటు తీసుకుని లోపలికి వస్తున్న నీరజను చూసి, కర్ర పక్కకు పడేసింది ఆ అమ్మాయి.

ఆ అమ్మాయి నిరంజనం చెల్లెలయి వుంటుందని ఊహించిన నీరజ "అమ్మగారు ఇంట్లో వున్నారా" అని అడిగింది, చెప్పులు ఒక పక్కగా విడుస్తూ.

"లోపలికి రండి!" అంది ఆ అమ్మాయి ముందుగదిలో అడ్డదిడ్డంగా వున్న కుర్చీలు సర్దింది. "అమ్మా, అమ్మా! ఎవరో వచ్చారు!" అంటూ లోపలికి వెళ్ళింది.

నీరజ కుర్చీలో కూర్చుందిగానీ మనసంతా అల్లకల్లోలంగా వుంది. అసలు తను ఇలా రావడం మంచి పనేనా? అవతలి వాళ్ళు ఏం అనుకుంటారు? తను తొందరపడిందా? గోపాల్రావుగారిని పంపివుంటే బావుండేదేమో! అయినా ఇంట్లో వాళ్ళతో ముఖాముఖి మాట్లాడితేనేగానీ తనకి సంతృప్తి వుండదు. ఈ సమయంలో ఆడవాళ్ళే వుంటారని తెగించి వచ్చేసింది. ఇక ఎలా జరిగితే అలా జరుగుతుంది.

టీ పాయ్ మీద పేపరు చేతిలోకి తీసుకోబోతూండగా, "ఎవరు కావాలమ్మా!" అంటూ ఒక నడివయసు స్త్రీ వచ్చింది. వంటగదిలోంచి వస్తోందేమో, చేతులకి తెల్లగా పిండి కాబోలు అంటుకుని వుంది!

"నమస్కారమండీ" అప్రయత్నంగా కుర్చీలోంచి లేవబోయింది నీరజ.

"ఫర్వాలేదు- కూర్చో అమ్మా!" తను మరో కుర్చీలో కూర్చుంది ఆవిడ. మనిషి కొద్దిగా స్థూల శరీరంతో పొట్టిగా వుంది.

ఆ పద్దెనిమిదేళ్ళ అమ్మాయి గుమ్మంలో నిలబడి ఆసక్తిగా నీరజనే చూస్తోంది.

"రాధా, మంచి నీళ్ళు తీసుకురా!" కూతురికి పురమాయించింది ఆవిడ.

రాధ తీసుకువచ్చిన మంచినీళ్ళు గడగడ తాగేసింది నీరజ.

"శారదమ్మా, ఇంకా భోజనాలు చేయలేదు కదా!" చేతిలో టిఫిన్ బాక్స్‌తో వచ్చిన ఒక ఆవిడ, నీరజను చూసి గుమ్మంలోనే ఆగిపోయింది.

"లోపలికిరా కాత్యాయనీ ఫరవాలేదు" ఆహ్వానించింది శారదమ్మ.

"మీ అన్నయ్యకి జ్వరంగా వుంది. వెళతాను. ఉసిరి పచ్చడి నూరాను- రాధకి ఇష్టం అని తెచ్చాను" టిఫిన్ బాక్స్ రాధ చేతిలో పెట్టి, మరోసారి నీరజని పరికించి చూసి వెళ్ళిపోయింది కాత్యాయని!

టిఫిన్ బాక్స్ లోపల పెట్టి, రాధ కూడా వచ్చి మరో కుర్చీలో కూర్చుంది.

"ఇప్పుడు చెప్పమ్మా! ఎవరు నువ్వు" పేపరుతో విసురుకుంటోంది శారదమ్మ.

నీరజకి ఎలా మొదలు పెట్టాలో అర్థం కావడంలేదు. "నా పేరు నీరజ. చినలింగాయపాలెం స్కూల్లో టీచర్ని..." అంటూ మొదలుపెట్టి, క్లుప్తంగా తమ కుటుంబం గురించి వివరించింది.

నీరజ చెప్పేది శ్రద్ధగా వింటోంది శారదమ్మ.

తన గురించి చెప్పిందిగానీ, నిరంజనం గురించి ఎలా మొదలుపెట్టాలో తోచడం లేదు నీరజకి!

"మా అబ్బాయి నిరంజనం ఈ ఊరి స్కూల్లో టీచరు. మా బాబాయి కొడుకు గోపాలరావు మీ స్కూలు హెడ్‌మాస్టర్. మావాడు తరుచూ మీ స్కూల్‌కి వస్తుంటాడు. నీ గురించి కూడా ఎప్పుడో చెప్పినట్లు గుర్తు!" అంది పమిటతో మొహం మీద స్వేదం తుడుచుకుంటూ శారదమ్మ.

"అవును మీ అబ్బాయి నాకూ పరిచయమే! నిన్న సాయంత్రం ఆయన బస్సు స్టాండులో నన్ను కలిశారు!" క్షణం ఆగింది నీరజ.

ఆ మాటలకి శారదమ్మ మొహంలో గబగబ రంగులు మారాయి. "చినలింగాయపాలెం వచ్చాడా? "

అవునన్నట్లుగా తల ఊపింది నీరజ. "నా దగ్గర పెళ్ళి ప్రస్తావన తీసుకు వచ్చారు!"

"నిజంగానా? " నమ్మలేనట్లుగా అడిగింది శారదమ్మ.

"అవును. నిన్న బస్సుస్టాండులో ఈ విషయం చెప్పారు!"

తల్లీ కూతుళ్ళిద్దరూ మొహమొహాలు చూసుకున్నారు.

"మా అబ్బాయికి నువ్విచ్చిన జవాబు ఏమిటి? " నిర్మొహమాటంగా అడిగేసింది



శారదమ్మ.

"రెండురోజుల టైం అడిగాను!"

"ఎందుకు!"

"మీతో మాట్లాడాలని..."

"ఏం మాట్లాడాలి? ఏమయినా మాటలు వుంటే మగపెళ్ళివారికి కదా వుంటాయి! శారదమ్మ మాటల్లో అహం స్పష్టంగా కనిపిస్తోంది. "నీతో మీ అమ్మగారు ఎందుకు రాలేదు? "

"ఆవిడకి ఇంకా ఈ విషయం చెప్పలేదు"

"అంటే పెద్దవాళ్ళను పక్కకు పెట్టి,



ముఖ్యమైన నిర్ణయాలు నువ్వే తీసుకుంటావా?"

"అలా అని కాదు..." నసిగేసింది నీరజ.

"ఈ పెళ్ళి అంటూ జరిగితే మా అమ్మగారు నాతోపాటే వుంటారు. మీరు అందుకు అంగీకరిస్తేనే ఈ పెళ్ళి జరుగుతుంది. మీ అభిప్రాయం తెలుసుకోవాలని వచ్చాను" అంది.

ఆ విషయం విని తెల్లబోయింది శారదమ్మ. "ఇంతకీ మీ అమ్మగారు అమ్మాయి పెళ్ళికి కట్నం ఎంత ఇస్తారట?" వ్యంగ్యంగా అడిగింది శారదమ్మ.

ఆ ప్రశ్న అమితమైన కోపాన్ని తెప్పించింది నీరజకి. అతికష్టం మీద తనని తాను నిగ్రహించుకుని, "మీ అబ్బాయి కట్న ప్రసక్తి లేదంటేనే నేను రావడం జరిగింది!" అంది కుండబద్దలు కొట్టినట్లుగా.

"వాడికి అవసరం లేదేమో! మాకు కావాలి! మా రాధని అత్తవారింటికి పంపిచడానికి అధమపక్షం రెండు లక్షలు

కావాలి!"

"అంటే...? "

"అంటే అర్థం కాలేదా? అబ్బాయి కట్నం డబ్బుతో అమ్మాయి పెళ్ళి చేయాలి మేము!" నిర్మొహమాటంగా చెప్పేసింది శారదమ్మ.

"కట్నం తీసుకోకుండా మా అబ్బాయి పెళ్ళి చేసే స్థితిలో లేము మేము! అదీగాక వియ్యపురాలిని ఇంట్లో పెట్టుకోడానికి ఎట్టి పరిస్థితుల్లోనూ నేను అంగీకరించను!

"అయితే ఇక చర్చ అనవసరం. నేను వెళతాను!" కుర్చీలోంచి లేచింది నీరజ.

"వెళ్ళు తల్లీ!" చేతులు తిప్పింది శారదమ్మ.

నీరజ వెనకే తల్లీ కూతుళ్లు గట్టిగా మాట్లాడేసుకుంటున్నారు.

"ఇంకా నయం- కట్నం కానీ తీసుకురాక పోయినా రోగిష్టి కన్నతల్లిని వెంట తీసుకు వస్తుందట ఈ మహాతల్లి- మీ అన్నయ్యకి ఇంతకన్నా గొప్ప సంబంధం దొరకదు కాబోలు" వ్యంగ్యంగా శారదమ్మ అంటున్న మాటలు గేటు మూస్తున్న నీరజకి స్పష్టంగా వినిపించాయి.

"అవును... మీ అబ్బాయికి మీరు ఎలాగో నాకు మా అమ్మ అలాగ! పెళ్లి అయ్యాక మీ అబ్బాయి మీతోపాటే వుంటాడు కాబట్టి నా బాధ మీకు అర్థం కాదు! నాన్నలేని నేను ఈ వయసులో మా అమ్మని ఒంటరిగా ఎలా వదలగలను? నా స్వార్థం కోసం పెళ్ళి పేరుతో అమ్మను దూరం చేసుకోనా? మా అమ్మను నాతో పాటే వుంచుకోడానికి అంగీకరించిన వాడి తోనే నా పెళ్లి! లేకపోతే నాకు పెళ్లే అవసరం లేదు!" అంటూ గట్టిగా అరవాలనిపించింది నీరజకి!

'డబ్బు మనుషుల దగ్గర మానవ సంబంధాల ప్రస్తావన వ్యర్థం!' తల్లి అనే మాట గుర్తుకు వచ్చి మౌనం వహించింది నీరజ.

నీరజ రెండు నిముషాల్లో బస్సు స్టాండులో వుంది. ఆ పదిహేను మందితో భారంగా కదిలింది జీపు.

గతుకుల రోడ్డుకి రెండు వైపులా ఏపుగా పెరిగిన పొగాకు తోటలు- మిర్చీ తోటలు! సగం దారిలో గుప్పున మత్తైన వాసనతో, నిండా పూతతో వున్న బత్తాయి తోట! కను చూపు మేరంతా పచ్చదనం- చల్లగా వీస్తున్న గాలి?

నీరజకి దుఃఖం పొంగివస్తోంది. అమ్మను గురించి ఆవిడ ఎంత చులకనగా మాట్లాడింది! కన్నవాళ్ళ బాధ్యత మగపిల్ల వాడికేనా? ఆ బాధ్యత ఆడపిల్ల నెత్తికెత్తుకుంటే నేరమా! తనదాకా వస్తేనేగానీ ఎవరికీ సమస్య తీవ్రత అర్థం కాదు! తను పెళ్లి పేరుతో మరో ఇంటికి వెళ్లిపోతే అమ్మను ఎవరు చూస్తారు? పిచ్చి అమ్మ, అన్నింటికీ ఆ దేవుడే వున్నాడు అంటుంది. కనబడిన వాళ్లందరికీ తనకి పెళ్లి సంబంధాలు చూడమని చెబుతూ వుంటుంది. తనను పంపించేసి ఎలా బతుకుదాం అనీ! ఈ అనారోగ్యంతో ఒంటరిగా వుండటం ఎంత ప్రమాదం! మామయ్య దగ్గరికి వెళ్లినా, అత్తయ్య అమ్మని రెండు రోజులు కూడా వుండనీయదు.

నిరంజనం మంచివాడు! దురాశ లేదు. మాటల్లో నిజాయితీ వుంది! ఈ విషయం తెలిస్తే అతను తల్లిని తమ ఇంట్లో వుంచుకోడానికి తల్లిదండ్రుల్ని ఒప్పించగలడు! అయితే ఇంట్లో ఆడవాళ్లకి ఇష్టం లేనప్పుడు ఆ ఇంటికి తల్లిని తీసుకువెళ్లడం ఎంతవరకు సబబు? తనూ, నిరంజనం స్కూళ్ళకు వెళ్ళగానే వాళ్ళు అమ్మను పురుగును చూసినట్లు చూస్తారు. ఆ విషయం మింగలేక కక్కలేక అమ్మ సతమతం అయిపోతుంది! అయితే ఇటువంటి అభ్యంతరం లేవదీస్తే నిరంజనం చినలింగాయపా

లెంలో వేరే కాపురం పెట్టి, అమ్మను దగ్గర వుంచుకుందాం అనవచ్చు! అయితే ఈ తల్లికి కొడుకును దూరం చేసిన ఉసురు తనకి తగులుతుంది! పైగా వాళ్ళు అమ్మాయి పెళ్లి చేయడానికి కొడుకు తెచ్చే కట్నంమీదే ఆశలు పెట్టుకున్నారు. తను అడుగు పెట్టిన ఇంట్లో తన మూలంగా ఎటువంటి ఎడబాటు మనస్పర్థలూ రాకూడదు! తనకి ప్రశాంతంగా వుండే వైవాహిక జీవితం కావాలి!

పెళ్లి పేరుతో అశాంతిని కొని తెచ్చుకోడానికి తను సిద్ధంగా లేదు! 'సారీ నిరంజనం గారూ, ఈ పెళ్లి జరగదు!' తనలో తను అనుకుంది నీరజ!

అయితే వెంటనే నిరంజనం ఎందుకు? అంటాడు. అందుకు సమాధానం ఏమి చెప్పాలో ఆలోచించుకోవాలి! తనలో తనే అనుకుంది నీరజ.

మర్నాడు సాయంత్రం బస్సుస్టాపులో కలిసిన నిరంజనంతో "సారీ సర్! ఇప్పట్లో పెళ్ళి చేసుకోవాలనే ఆలోచన నాకు లేదు!' ' అంది ముందే ఆలోచించి పెట్టుకున్నట్లుగా.

ఆ జవాబు విని నిర్ఘాంతపోయాడు నిరంజనం. "నిజం చెప్పండి నీరజగారూ, ఎనీ ప్రాబ్లమ్? ఇప్పుడు మీ వయసు..." అంటూ ఇంకా ఏదో అనబోతుండగా...

"ఇక ఈ విషయంలో తర్జనభర్జనలు వద్దు! వదిలేయండి! నా మీద మీకున్న అభిమానానికి థాంక్స్! బుద్ధిగా మీ పేరేంట్స్ తీసుకువచ్చిన సంబంధం చేసుకోండి!" రెండు చేతులూ జోడించి, అప్పుడే వచ్చిన బస్సు ఎక్కేసింది నీరజ.

అయితే అనుకోని విధంగా ఇలా నిరంజనం ఇంటికి వచ్చి తల్లితో మాట్లాడి వెళతాడని ఊహించలేకపోయింది.

తన కోసం ఈ సంబంధం కూతురు వదులుకుందని తల్లికి తెలియకూడదు! అందుకే నిరంజనంకి చెప్పినట్లుగానే "ఇప్పట్లో నాకు పెళ్లి చేసుకోవాలని లేదు!' అంది తల్లితో.

అయితే ఆ జవాబు తల్లికి అమితకోపం తెప్పించింది! తనని ఆ పెళ్లికి ఒప్పించే ప్రయత్నంలో భాగంగా నిరాహారదీక్ష మొదలు పెట్టింది పిచ్చిది!

ఒక కంచంలో కూరా అన్నం, కందిపొడి అన్నం కలిపి తల్లి గదిలోకి వెళ్ళింది నీరజ!

"...చెప్పానుగా! నాకు ఆకలిగా లేదు" మొహం పక్కకు తిప్పేసుకుంది అరుంధతి.

"నువ్వు తినకపోతే నేను ఊరుకునేది లేదు!" బలవంతంగా అన్నం ముద్ద తల్లి నోట్లో కుక్కింది నీరజ.

"అయితే నేను చెప్పినట్లు వింటావా? "

"ఈ పెళ్ళి విషయంలో తప్ప!"

"అదేం? "

"నిజం చెప్పమంటావా? ఆ నిరంజనం నాకు నచ్చలేదమ్మా!" అంత తేలికగా అబద్ధం చెబుతున్న తనమీద తనకే ఆశ్చర్యం వేసింది నీరజకి.

"కుర్రాడు బాగానే వున్నాడు కదే!" కూతురి జవాబుతో నీరసపడి పోయింది అరుంధతి.

"నా కళ్ళు పెట్టుకుని చూడు!" లేని నవ్వు మొహాన పులుముకుంది నీరజ. "నువ్వే చెప్పావు- నీ చిన్నతనంలో ఇష్టం లేని పెళ్ళి చేసిన మీ మామయ్య కూతురు బావిలో దూకి చచ్చిందని!"

"అయ్య బాబోయ్! ఇప్పుడాపిచ్చిమాటలు ఎందుకే? అయినా నీకు ఇష్టంలేని పెళ్ళి చేయడానికి నేనేమయినా నీ సవితి తల్లినా? " కూతురి బుగ్గలు ఆప్యాయంగా పుణికింది అరుంధతి.

"హమ్మయ్య! ఇప్పటికయినా నా మనసు తెలిసింది కదా!"

"నా కోసం పెళ్ళి సంబంధం చూడాలను

కుంటే ఆరడుగుల అందగాడిని చూడు!" తేలికపడిన మనసుతో అంది నీరజ.

"మొగుడు అంత పొడగరి అయితే వాడి జుట్టు నీ చేతికి చిక్కదే పిచ్చిమొద్దూ!" పెద్దగా నవ్వేసింది అరుంధతి.

"నవ్వులు తరువాత! త్వరగా భోజనం చేయి! నాకు ఆకలి దంచేస్తోంది!" గబగబ కందిపొడి అన్నంముద్దలు తల్లి నోట్లో కుక్కుతూ అంది నీరజ.




నాలుగు రోజుల తరువాత మళ్ళీ బస్సుస్టాప్‌లో కనిపించాడు నిరంజనం.

అతడిని చూడనట్లుగా మొహం పక్కకు తిప్పేసుకుంది నీరజ.

"నీరజగారూ, మిమ్మల్ని ఒక విషయం అడగాలి" ఈ ఆదివారం మీ అమ్మగారు మా ఊరు వస్తానని అన్నారు. కానీ రాలేదు" అంటూ ఇంకా ఏదో చెప్పబోయాడు.

"ఎదురు చూడకండి, ఆవిడ రారు!" ముక్తసరిగా అంది నీరజ.

"ఆవిడ వస్తానని అన్నారు. మీ ఇంటాయనను కూడా తీసుకువస్తామన్నారు"

"చెప్పానుగా ఆవిడ రారు! ఈ సంబంధం విషయంలో మాకు ఆసక్తిలేదు. మీరు మళ్ళీ మళ్ళీ అడగడం, ఇంటికి రావడం మర్యాదగా వుండదు!" కుండబద్దలు కొట్టినట్లుగా చెప్పేసింది నీరజ.

నిరంజనం మొహంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు!

అతను ఇంకా ఏమీ అడగకముందే కందుకూరు బస్సు వచ్చేసింది.

మర్నాడు లంచ్ అవర్లో "మీతో మాట్లాడాలి సార్" అంటూ గోపాలరావుగారి రూంలోకి వెళ్ళింది నీరజ.

విప్పబోతున్న కారియర్ పక్కకు పెట్టి "కూర్చో అమ్మా" అంటూ కుర్చీ చూపించారు గోపాలరావుగారు.

క్షణంపాటు మౌనంగా వుండిపోయింది నీరజ.

"చెప్పమ్మా, నా దగ్గర మొహమాటం దేనికి!"

"మీ రిలేటివ్ నిరంజనం నాతో పెళ్లి ప్రపోజల్ తీసుకువచ్చారు. ఇష్టం లేదన్నా ఇంకా వెంట తిరుగుతున్నారు. దయచేసి మీరు..."

"అదేం అమ్మా! మా నిరంజనానికేం?"

"నాకిష్టం లేదు" తలదించుకుని చెప్పింది నీరజ.

దీర్ఘంగా నిట్టూర్చారు గోపాలరావుగారు. "సరేనమ్మా! నేను చెబుతాను! మళ్ళీ వాడు నీ దగ్గిర ఈ ప్రసక్తి తీసుకురాడు"

"థాంక్స్ సర్" ఆ గదిలోంచి బయటకు వచ్చేసింది నీరజ. నెల తిరగకుండానే నిరంజనం శింగరాయకొండలో వుండే టొబాకో ట్రేడర్ కూతురిని మూడు లక్షల కట్నంతో పెళ్ళి చేసుకున్నట్లు తెలుసుకుని తేలిగ్గా నిట్టూర్చింది నీరజ.

★ ★ ★

"ఈ కాలంలో అందరూ చదువుకుంటున్నారు. నువ్వు ఇంటర్ ఫస్ట్ ఇయర్‌లో వుండగానే చదువెందుకు మానేశావు?" ఆ రాత్రి తన పక్కనే పడుకుని పైగా చప్పుడు చేస్తూ తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్‌ని చూస్తున్న భార్యను అడిగాడు నిరంజనం.

"ఆ కాలేజీలో అబ్బాయిలతో పాటు, అమ్మాయిలు కూడా నాకు రకరకాల పేర్లు

పెట్టి ఏడిపించేవారు?" అంది అలివేణి తలకింద దిండు సరిచేసుకుంటూ.

"అయితే చదువు మానేస్తావా?"

"మరేం చేయను?"

"మరో కాలేజీలో చేరవలసింది! అయినా నువ్వు ఉడుక్కోవడం మానేస్తే, వాళ్ళు ఏడిపించడమూ మానేసి వుండేవారు!"

"అదేమీ కాదు- వాళ్ళు మంచివాళ్ళు కారు"

"మా చెల్లెలిలా ప్రైవేటుగా చదవవలసింది!"

"నాకు చదువంటే బోర్!" అసలు సంగతి బయట పెట్టింది అలివేణి.

"నువ్వు చదువు మానేస్తానంటే మీ అమ్మా నాన్నలు ఎలా ఊరుకున్నారు? చదువుకునే వయసులో చదువుకోవాలని, ఆడవాళ్ళకైనా, మగవాళ్ళకైనా చదువెంతో ముఖ్యం అనీ చెప్పలేదా! మళ్ళీ నీ చేత చదివించే ప్రయత్నం చేయలేదా?"

లేదన్నట్లు తల వూపింది అలివేణి. "నీకు తోచినట్లు చేయి" అన్నారు. భారంగా నిట్టూర్చాడు నిరంజనం. "చదువు మానేసి ఇంట్లో కూర్చుని ఏం చేశావు?"

"టీవీ వుందిగా" ఠపీమని వచ్చింది జవాబు. అయినా మా అమ్మావాళ్లు నా పెళ్ళి చేసేయాలని ఎనిమిదేళ్ళుగా ప్రయత్నం చేస్తున్నారు. ఇప్పటికి కుదిరింది!"

భార్య ఐక్యూ చాలా తక్కువస్థాయిలో వుందని అర్థం అయిపోయింది నిరంజనానికి. అందుకు ఆమె తల్లిదండ్రులకి కూడా బాధ్యత వుంది! పిల్లలకి సరి అయిన దిశా నిర్దేశం చేయని తల్లిదండ్రులు వుంటే పిల్లల పరిస్థితి ఇలాగే వుంటుంది!

నీరజ నిరాకరించిన బాధలో తల్లిదండ్రులు కుదిర్చిన పెళ్ళి నిరాసక్తంగా చేసేసుకున్నాడు తను! పెళ్ళిచూపుల్లో అమ్మాయి మొహం చూడలేదు- ఒక ప్రశ్న కూడా వేయలేదు! పెద్దవాళ్ళే అన్నీ మాట్లాడుకున్నారు.

"కట్నం కోసం కక్కుర్తిపడి మన వూరి మాస్టారు నల్లభూతాన్ని కట్టుకున్నాడు" బస్సులో తమ వూరి మనిషి, పక్క పాసింజర్‌తో అంటున్న మాటలు తన గురించే అని, వెనక సీట్లో కూర్చుని వున్న నిరంజనం అర్థం చేసుకున్నాడు.

ఆ సాయంత్రం ఇంటికి వచ్చాక అలివేణిని పరిశీలనగా చూశాడు.

సన్నగా, పొడుగ్గా, ఎండిపోయి వున్న చర్మంతో నల్లగా, మొహంమీద చిదిమేసిన మొటిమల గుంటలతో ఎటువంటి ఆకర్షణ లేని పాతికేళ్ళ అలివేణి! నిజంగానే తల్లి మూడు లక్షల కట్నం కోసమే ఈ పిల్లను కోడలుగా తెచ్చుకుంది! లేకపోతే ఈ కరువు ప్రాంతంలో స్కూలు టీచర్‌కి, మూడు లక్షల కట్నం ఇచ్చేదెవరు? ఏమయితే అది అయింది. ఇప్పుడు అలివేణి తన భార్య! జీవితం అంతా తను కలిసి నడవవలసిన అర్ధాంగి!

"ఈ కుక్కి మంచంలో, ఉండలు కట్టిన పరుపు మీద నేను పడుకోలేక పోతున్నాను. కొత్త డబుల్ కాట్ మంచాలు, కర్ల్-ఆన్ పరుపులూ కొనండి!" అసౌకర్యంగా పరుపుమీద అటూ ఇటూ కదులుతూ అంది అలివేణి!

"ముందు చెల్లెలు పెళ్ళి అయిపోతే నెమ్మదిగా ఒక్కొక్కటే కొనుక్కుందాం!" సాధ్యమైనంత సౌమ్యంగా అన్నాడు నిరంజనం.

"మీ చెల్లెలి పెళ్ళికి, మన మంచాలకి లంకె పెడతారేమిటి?" విసురుగా అంది అలివేణి.

"ష్- కాస్త చిన్నగా మాట్లాడు"

"నా గొంతే అంత! నేను నల్లగా వుంటాను. అనాకారిని. పైగా బొంగురు గొంతు. అందుకేగా మూడులక్షల కట్నం

ఇచ్చింది!"

"ఇప్పుడు అనవసర విషయాల చర్చ ఎందుకు? "

"మంచం, పరుపులు అనవసరమా!"

"కొంటానులే- తొందరలోనే!" రాజీకి రాక తప్పలేదు నిరంజనానికి!

"ఒంగోలుకి వెళ్ళి కొనుక్కుందాం" ఉత్సాహంగా అంది అలివేణి.

★ ★ ★

"అమ్మా అలివేణీ, అటువంటి డార్క్ కలర్ చీరలు కాక కొంచెం లైట్ కలర్ చీరలు కట్టుకో అమ్మా!" అప్పుడే స్నానం చేసి డార్క్ వైలట్ కలర్ చీర కట్టుకుని, టీ.వీ. ముందు కూర్చున్న అలివేణినే చూస్తూ అంది శారదమ్మ.

"అదేం? "

"నీకు లైట్ కలర్ చీరలే బావుంటాయి"

"నల్లగా వున్నాననా? "

జవాబు ఏం చెప్పాలో తోచలేదు శారదమ్మకి.

"మా నాన్న అన్నీ నాకు ముదురు రంగు చీరలే కొన్నాడు. మీరు లైట్ కలర్ చీరలు కొనండి. కట్టుకుంటాను" నిర్మొహమాటంగా అంది అలివేణి.

★ ★ ★

"వదినా గుడికి వెళదాం వస్తావా? " ఎప్పుడూ మాట్లాడకుండా టీ.వీ. చూస్తూ కూర్చునే అలివేణిని అలా ఊరిలోకి తీసుకువెళదాం అనుకుంది రాధ.

"ఆటో పిల్చుకురా- వెళదాం!" అంది అలివేణి.

"ఈ ఊళ్ళో ఆటోలు వుండవు. కబుర్లు చెప్పుకుంటూ నడవడమే!"

"నువ్వెళ్ళు- నేను నడవలేను"

"పోనీ బయట చెట్లకింద కుర్చీలు వేసుకుని కబుర్లు చెప్పుకుందామా? "

"నీతోనూ, మీ అమ్మతోనూ నాకు కబుర్లేం వుంటాయి? " విసురుగా అంది అలివేణి.

ఆ మాటలకి జవాబేం చెప్పాలో తెలియక తెల్లముఖం వేసింది రాధ.

★ ★ ★

"నాకీ పల్లెటూళ్ళో ఏమీ తోచడంలేదు!" ఆ రాత్రి బెడ్‌రూం కిటికీ తలుపులు తెరిచి, కర్టెన్ లాగుతూ అంది అలివేణి.

మీ శింగరాయకొండ మహాపట్నమా? " నవ్వుతూ అన్నాడు నిరంజనం.

"మీ ఊరికన్నా పెద్దదే!"

"ఊరు పెద్దదయితేనేం? ఉండేది ఇంట్లోనేగా!"

"అక్కడ అమ్మ వుంది- చెల్లెలు వుంది"

"ఇక్కడ అత్తవుంది- ఆడపడుచువుంది"

"అత్తా ఆడపడుచులు అమ్మా చెల్లెళ్ళతో సమానమా? "

"అత్తవారింటికి వచ్చాక అలాగే అనుకోవాలి"

"ఇంకా నయం- అయినా వాళ్ళతో నాకేం మాటలు వుంటాయి? "

"...నువ్వు అలా అంటున్నావనే వాళ్ళు బాధపడుతున్నారు!" పరోక్షంగా అలివేణికి ప్రవర్తన మార్చుకోమని చెప్పాడు నిరంజనం.

"నా బాధలు నాకున్నాయి!" విసురుగా అంది అలివేణి.

ఆ ప్రసంగం తప్పించడానికి, "పోనీ టీ.వీ.తోనే కాలక్షేపం చేయి!" అన్నాడు నిరంజనం.

"మీ ఊళ్ళో రోజుకి పన్నెండు గంటల కరెంట్ కట్"

"వంట పనిలో అమ్మకి హెల్ప్ చేయి!"

"బోర్- మా ఇంట్లో వంటావిడే వంట చేస్తుంది!"

"అలా అంటే ఎలా? ఆడదానికి వంట రాకపోతే ఎలా? అమ్మ ఎల్లకాలం వుంటుందా? "

"అప్పుడెవరయినా వంట మనిషిని

చూసుకుందాంలెండి!"

"లైబ్రరీ నుంచి పుస్తకం తీసుకురానా? "

"సినిమా పత్రికలు వుంటాయా!"

"వుండవు! సాహిత్య విలువలున్న పత్రికలు, నవలలు వుంటాయి"

"అయితే వద్దు!"

"అన్నింటికీ ఏదో చెబుతావు! చిన్నపిల్లవు కావు- ఎడ్జస్ట్ అవడం నేర్చుకోవాలి!"

"నేను ఎవరితో అడ్జస్ట్ అవడంలేదు? నల్లపిల్లనని మీరే అంటీ ముట్టనట్లుగా వుంటున్నారు!"

"నేనెప్పుడయినా నీ రంగు గురించి మాట్లాడానా? " బాధగా అన్నాడు నిరంజనం.

"నాకు తెలుసు- మీకు నేనంటే ఇష్టం లేదు"

"అలా అని ఎందుకనుకుంటున్నావు? "

"నన్నెప్పుడూ ముద్దు పెట్టుకోలేదు"

క్షణం ఏమీ మాట్లాడలేకపోయాడు నిరంజనం. "అందుకు కొంత కాలం పడుతుంది- పరస్పరం ప్రేమ పుట్టాలి!"

"అంటే నా మీద ప్రేమ లేదా? "

ఆ ప్రశ్నకి చిన్నగా నవ్వాడు నిరంజనం. "ఇది సినిమా కాదు! మన పెళ్ళి అయి ఇంకా రెండు నెలలు కూడా కాలేదు. నన్ను నువ్వు, నిన్ను నేను పూర్తిగా అర్థం చేసుకోవాలి!"

"రేపు ఆదివారం- నన్ను సింగరాయకొండలో దింపండి!"

"ఎందుకు? "

"బెంగగా వుంది. వారం వుండి వస్తాను"

"అలాగే... అమ్మతో చెప్పి..."

"ఆవిడ వద్దంటే పంపించరా? "

"వద్దంటుందని ఎందుకు అనుకుంటున్నావు? "

"నేను కట్టుకునే చీరల దగ్గర నుంచీ, అన్నింటిమీదా ఆవిడ పెత్తనమే కదా!"

"అలా ఎప్పుడూ అనుకోకు! ఇంట్లో

**కొత్తగాలి...**

**చిన్నిమనసు**
**సంద్రమైంది**
**చినుకుల**
**సంగీతం వింటూ**

–ఆత్రం శశికిరణ్, రాజారాంపల్లి

అందరితో మనసు విప్పి మాట్లాడు. అందరితో కలివిడిగా వుండు! అప్పుడు ఈ తోచకపోవడాలు, బెంగలూ వుండవు! అమ్మ దాదాపు ముప్పైఅయిదేళ్ళ క్రితం ఈ ఇంట్లో అడుగు పెట్టింది. ఇప్పుడే ఇలా వున్న ఊరు అప్పట్లో ఎలా వుండివుంటుందో ఊహించుకో! అమ్మ సర్దుకుపోలేదూ!" నచ్చజెప్పే ధోరణిలో అన్నాడు నిరంజనం.

"ఇప్పుడు ఆవిడ సుత్తి అంతా నాకెందుకు! నాకు మాత్రం ఈ పల్లెటూరి కాపురం అంటే అప్పుడే విరక్తి పుట్టింది!" నిర్మోహమాటంగా అంది అలివేణి.

★ ★ ★

కోడలు పుట్టింట్లో వున్న పదిరోజులూ ఇల్లంతా ఎంతో ప్రశాంతంగా వున్నట్లు అనిపించింది శారదమ్మకి!

రాధ మాత్రం "కోడలికోసం అమ్మ బెంగ పెట్టుకుంది- అవును కదూ!" అంటూ తల్లిని ఆట పట్టించేది.

ఆ ఆదివారం కూతురిని కారులో తీసుకువచ్చాడు జనార్ధనం.

తన వెంట బస్తా వేరుసెనగ కాయలు, గంపనిండా జామపళ్ళు తెచ్చుకుంది అలివేణి.

వంటపనిలో వున్న శారదమ్మ గ్లాసుతో మంచినీళ్ల తీసుకువచ్చింది. "భోజనం చేసి

వెళ్ళండి అన్నయ్యగారు. మరో అర గంటలో వంటయి పోతుంది!" అంది నీళ్ళ గ్లాసు జనార్దనంకి ఇవ్వబోతూ.

"మేం మినరల్ వాటర్ క్యాన్లు తెప్పించుకుని తాగుతాం. ఈ నీళ్ళు తాగం!" అన్నాడు జనార్ధనం, డ్రైవర్‌కు కారులో వున్న వాటర్ బాటిల్ తెమ్మని చెబుతూ.

శారదమ్మ చిన్నబుచ్చుకుంది. "భోజనం చేయడానికేమీ అభ్యంతరం లేదుకదా!" అంది మొహంమీద నవ్వు పులుముకుంటూ.

"అవును బావగారూ! భోజనం చేసి, సాయంత్రందాకా విశ్రాంతి తీసుకుని వెళ్ళండి!" కల్పించుకున్నాడు రాజేశం.

"ఇది మరీ బావుంది. ఎ.సి. లేకుండా క్షణం వుండలేను నేను. మీ ఇంట్లో కనీసం ఫ్యాన్ అయినా లేదు. సాయంత్రం ఐదయితేనేగానీ కరెంట్ కూడా రాదటగా!" కర్చీఫ్‌తో మెడ తుడుచుకుంటూ అన్నాడు జనార్ధనం.

బయట పదకొండు గంటలకే ఎండ నిప్పులు చెరుగుతోంది.

"ఏప్రిల్ నెల మొదట్లోనే ఎండలు ఇలా ఉన్నాయి. ఇక మే నెల ఎలా తట్టుకుంటామో!" ఏదో మాట్లాడాలి అన్నట్లుగా అంది శారదమ్మ.

"ఆంధ్ర రాష్ట్రంలో కట్నాలు పెరుగుతున్నట్లుగా, ఎండలు కూడా పెరుగుతున్నాయి? " ఫెళ్ళున నవ్వాడు జనార్ధనం.

ఆ మాటలు శారదమ్మకి ఏమాత్రం రుచించలేదు. అయితే ఏమనాలో తెలియక మౌనంగా వుండిపోయింది!

కుర్చీ గుమ్మంలోకి జరుపుకుని "అన్నట్లు మీకో ముఖ్య విషయం చెప్పివెళ్ళాలని వచ్చాను!" అన్నాడు జనార్ధనం శారదమ్మని, రాజేశంని మార్చి మార్చి చూస్తూ.

"చెప్పండి అన్నయ్యగారు!" స్టౌ కట్టేసి వచ్చింది శారదమ్మ.

"మీరు కట్నం డబ్బు అమ్మాయి పేరునా, అబ్బాయి పేరునా జాయింట్‌గా బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయండి! మీ ఊళ్లో కెనరా బ్యాంకు వుందికదా! మీ వదినగారు మరచిపోకుండా ఈ సంగతే చెప్పి రమ్మన్నారు!" డ్రైవర్ తెచ్చి ఇచ్చిన మినరల్ వాటర్ బాటిల్ అందుకుంటూ అన్నాడు జనార్ధనం.

ఆ మాటలకి కోపం ముంచుకు వచ్చి వెంటనే "మీరిలా మాట్లాడటం ఏమీ బాగా లేదు అన్నయ్యగారు!" అంటూ నిష్కర్షగా చెప్పేసింది శారదమ్మ.

"అదేం, నా మాటలో తప్పేముంది? "

"అవును- నాన్నగారు పొరబాటుగా ఏమీ మాట్లాడలేదు కదా? " కల్పించుకుంది అలివేణి.

"అలివేణీ- నువ్వు మాట్లాడకు!" చిరాకు పడ్డాడు నిరంజనం.

"అలా అంటారేమిటి! కట్నం డబ్బు నాన్న ఇచ్చిందేగా!" మొండిగా అంది అలివేణి.

"... తల్లీ నువ్వు కలుగజేసుకోకు!" కూతుర్ని వారించాడు జనార్ధనం.

"బావగారూ, అసలు ఇటువంటి విషయాలు ఏమయినా వుంటే పెళ్లికి ముందే మాట్లాడాలి!" చిన్నగా అన్నాడు రాజేశం.

"అవును- మీరు అప్పుడే చెప్పివుండవలసింది! అలా అని వుంటే అసలు ఈ పెళ్లికే ఒప్పుకుని వుండేవాళ్ళం కాదు!" ఆవేశంలో మాటలు తడబడుతున్నాయి శారదమ్మకి.

"మా బంధువులంతా ఒక టీచర్‌కి మూడు లక్షల కట్నం అంటే చాలా ఎక్కువ అంటున్నారు. మీరు అమ్మాయికి బంగారం కూడా ఏమీ పెట్టలేదు. దాని భవిష్యత్తును గురించి మేము కూడా ఆలోచించాలి కదా!" స్వరం తగ్గించాడు జనార్ధనం.

రాజేశం ఊరుకోమని సంజ్ఞ చేస్తున్నా

# చిరకాలవాంఛ నెరవేరింది!



మాచిరాజు కామేశ్వరరావు

వివిధపత్రికల్లో అసంఖ్యాక కథలు ప్రచురితమైనా 'చతుర'లో నా నవల చూసుకోవాలన్న చిరకాలవాంఛ ఇన్నాళ్లకు నెరవేరింది. అమ్మ రత్నకుమారి చతుర, విపులలకు వీరాభిమాని. నాన్న సీతారామయ్యగారి దిశానిర్దేశంలో నేను రాసిన తొలికథ 1969 సెప్టెంబర్ 'చందమామ'లో వచ్చింది. దాదాపు 300 కథలు అదేపత్రికలో ప్రచురణయ్యాయి. ఇవి కాక అనేక పత్రికల్లో 100కి పైగా కథలు వచ్చాయి. 'ఆంధ్రభూమి' నిర్వహించిన కథల పోటీలో 'పిచ్చితల్లి' కథకు ద్వితీయ బహుమతి, తెలుగు అకాడమీ పిల్లల నవలలపోటీలో 'అడుగుకో ఆపద' నవలకు ప్రథమ బహుమతి అందుకున్నాను. 'స్వాతి' మాసపత్రికలో నాలుగు నవలలువచ్చాయి. పుట్టింది 21-5-1955లో. నా శ్రీమతి లక్ష్మీకుమారి, అమ్మాయి స్రవంతి, అబ్బాయి కార్తీక్.. ఇదీ మా కుటుంబం! ప్రస్తుతం నారాయణగూడ కెనరాబాంక్ బ్రాంచ్ మేనేజర్‌గా పనిచేస్తున్నాను.

చిరునామా:
**మాచిరాజు కామేశ్వరరావు**, ఫ్లాట్ నెం: 13, కెనరా అపార్ట్‌మెంట్స్, (ఓల్డ్ ఎమ్మెల్యే క్వార్టర్స్ ఎదురు) హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029

పట్టించుకోకుండా రెచ్చిపోయింది శారదమ్మ. "కట్నం డబ్బు ఏం చేసుకుంటామో మా ఇష్టం. అడిగే హక్కు మీకులేదు? అదీ పెళ్ళయిన రెండు నెలల తరువాత ఇలా వచ్చి, ఉచిత సలహాలు ఇవ్వడం ఏమీ బాగాలేదు. మా అబ్బాయికి ఇంత కంటే మంచి సంబంధాలు ఉద్యోగం చేసే అమ్మాయిలవి వచ్చాయి! రెండేళ్ళల్లో మీరిచ్చిన కట్నం డబ్బు జీతం రూపంలో తీసుకురాగలదు. ఉద్యోగం చేసే కోడలు! మీరు మళ్ళీ కట్నం ఊసు ఎత్తితే మన రెండు కుటుంబాల మధ్య సత్సంబంధాలు వుండవు" చెప్పాలనుకున్నది సూటిగా చెప్పేసింది శారదమ్మ.

"మీరంత కఠినంగా మాట్లాడితే నేనేమీ చెప్పలేను. నా మాటలో న్యాయం వుందో లేదో మీరే ఆలోచించుకోండి!" వెళుతున్నానని కూడ చెప్పకుండా వెళ్ళి కారులో కూర్చున్నాడు జనార్ధనం!

చూస్తుండగానే కారు కదిలిపోయింది!

కళ్ళలో నీరు నింపుకుని తమ గదిలోకి వెళ్ళిపోయింది అలివేణి.

"ఆ కట్నం డబ్బు వాళ్ళ మొహానే కొట్టిరా!" ఆవేశంగా అన్నాడు రాజేశం.

"మీరు మాట్లాడకండి. బ్యాంకులో అప్పు తప్ప అర్ధ రూపాయి డిపాజిట్ లేదు. అమ్మాయి పెళ్ళి ఎలా చేద్దాం అనుకుంటున్నారు? " చేతులు తిప్పింది శారదమ్మ.

"తల తాకట్టు పెట్టి చేస్తాను!"

"లేకపోతే రెండెకరాల పొలం అమ్ముతాం! మన చెల్లెలి పెళ్ళి బాధ్యత వాళ్ళదా? " కల్పించుకున్నాడు నిరంజనం.

"నువ్వు నోరుముయ్యరా! ఇక ఈ విషయంలో చర్చ అనవసరం! కట్నం కూడ తీసుకోకుండా ఈ అతిలోకసుందరికి హారతి పట్టి తెచ్చుకోడానికి మన ఖర్మేం

కాలిపోలేదు!" విసురుగా వంటింట్లోకి వెళ్ళి పోయింది శారదమ్మ.

తల్లి డిమాండ్ చేసి అంత కట్నం తీసుకోకుండా వుండవలసింది అనిపించింది నిరంజనానికి. డబ్బు తీసుకువస్తే అవకరాలు సరి అయిపోతాయా? లేకపోతే అసలు వున్నట్లు కనిపించవా?




ఆ రోజు మధ్యాహ్నం ఏదో పనిమీద చినలింగాయపాలెం వెళ్ళాడు నిరంజనం.

అతను వెళ్ళేసరికి గోపాలరావుగారి గదిలో నీరజ కూడా వుంది.

"బావున్నారా? " ముందు తనే పలకరించాడు నిరంజనం. బావున్నట్లు తల ఊపింది నీరజ.

"మీరు? "

"వాడికేం అమ్మా- కొత్త పెళ్ళికొడుకు! అవునూ, అలివేణిని ఒక్కసారి కూడా మా ఇంటికి తీసుకురాలేదేమిట్రా? " అన్నాడు గోపాలరావుగారు నవ్వుతూ.

"ఎక్కడికి బయలుదేరాలన్నా ఎండల భయం!"

"మన ప్రకాశం జిల్లామీద భానుడికి అభిమానం ఎక్కువ. ఏడాదిలో పదినెలలు జిల్లానే అంటిపెట్టుకుని వుంటాడు! ఆయనకి జడుస్తూ కూర్చుంటే మన పనులు అయినట్లే!"

"ఆ మాట నిజం!" తనూ నవ్వింది నీరజ.

"పదిరోజుల్లో సమ్మర్ హాలిడేస్ మొదలవుతాయి. నీడపట్టున నెలా పదిహేను రోజులు ఇంట్లో వుండొచ్చుననే ఆశమీద కరెంట్ వాళ్ళు ఇన్ని నీళ్ళు చిలకరిస్తారు. పగలంతా కరెంట్ వుండదు. హాలీడేస్‌ని తలుచుకుంటేనే భయం వేస్తోంది"

"కందుకూరులో ఫరవాలేదు. మా ఊళ్ళో అయితే పదిహేను గంటలు పవర్ కట్!" అన్నాడు నిరంజనం.

తన క్లాస్‌లోకి వెళ్ళేముందు "ఒకసారి మీ శ్రీమతిని మా ఇంటికి తీసుకురండి!" అంది నీరజ.

ఆ రాత్రి భోజనాల దగ్గిర, "అన్నట్లు మన ఇంటికి వచ్చిన ఆ కుర్రాడికి పెళ్ళి అయిందంటే? " అని, అనుకోకుండా అడిగింది అరుంధతి.

"నిక్షేపంగా రెండు నెలల క్రితమే అయింది. ఈ రోజు స్కూలుకి కూడ వచ్చాడు"

"మామూలుగానే మాట్లాడావా అతనితోటి!"

"పోట్లాడటానికి అతనేం నాకు శత్రువా? "

"ఎలా వున్నాడు? "

"బాగానే వున్నాడు. ఏం? "

"పెళ్ళయిన వాళ్ళందరూ బాగానే వుంటారు! నీ నెత్తిమీద నాలుగు అక్షింతలు ఏనాటికి వేస్తానో... సంబంధాలు వుంటే చెప్పమని నెలక్రితం మీ మామయ్యకి ఉత్తరం వ్రాశాను. జవాబు లేదు" దీర్ఘంగా నిట్టూర్చింది అరుంధతి.

"నీ పిచ్చిగానీ మామయ్యకి పోస్ట్ ఆఫీస్ లోనే పనయినా, ఏనాడయినా ఉత్తరం వ్రాశాడా? నాన్న పోయినప్పటినుంచి మన బాధ్యత నెత్తినపడుతుందేమో అని దూరదూరంగా వుంటున్నాడు! మనది మనం తింటున్నాం! సంబంధాలు వుంటే చెప్పడా

నికేం? తనే ఇంక ఇద్దరు అమ్మాయిల పెళ్ళి చేయాలి! ఏడాదిలో రిటైర్ కాబోతున్నాడు. నువ్వు లేనిపోని ఆశలు పెట్టుకుని అవి తీరక దిగులు పడటం మాను. ఇప్పుడు నాకు పెళ్ళి లేకపోతేనేం? ఇద్దరం ఇలా హాయిగా గడిపేద్దాం!"

"అదిగో, అలా మాట్లాడితేనే నాకు కోపం వస్తుంది. పెళ్ళి వద్దంటావెందుకు? పైన తథాస్తు దేవతలు వుంటారు!"

"నువ్వు- మా అమ్మాయి పెళ్ళి తొందరలో కావాలీ అనుకున్నప్పుడు వాళ్ళు తథాస్తు అనరా" నవ్వింది నీరజ.

"నీకు అన్నీ వేళాకోళాలే!" చిన్నబుచ్చుకుంది అరుంధతి.

వేసవి సెలవులు మొదలు కాగానే ఒంగోలు వెళ్ళి అరడజను కలర్ చీరలు, ఎంబ్రాయిడరీ దారాలు, ఏవో పెయింట్లు తెచ్చుకుంది నీరజ.

"నాలుగు చీరలమీద ఎంబ్రాయిడరీ చేస్తాను. రెండు చీరలమీద పెయింట్లు వేస్తాను. ఈ సమ్మర్‌లో ఇదే కాలక్షేపం. సరదాగా పది రోజుల పాటు ఎక్కడికయినా వెళ్ళివద్దాం అనుకుంటే మనకి అయిన వాళ్ళు ఎవరూ లేరు!" ఆ మాట అంటున్నప్పుడు నీరజ గొంతు జీరబోయింది!

"మీ మామయ్య ఇంటికి కూడా, అత్తయ్య ఒళ్ళు కాలినప్పుడు నాలుగేళ్ళ క్రితం వెళ్ళి, రెండు రోజులు వుండి వచ్చాను. వాడిని చూడాలని వుంది. వాడు రాడు, మనని రమ్మనడు!" నిట్టూర్చింది అరుంధతి.

"మార్పు కోసం, కాలక్షేపం కోసం ఎక్కడికయినా వెళ్ళాలనిపిస్తుంది, నిజంగా మామయ్య పిలిస్తే, వాళ్ళింట్లో పదిరోజులు వుంటే, అంతకు రెండు రెట్లు ఎక్కువ ఖర్చు పెట్టే వస్తాం! అయినా మామయ్య పిలవాలి కదా! మన బాధ్యత నెత్తిన పడుతుందని అత్తయ్య కలవనీయదు!"

"మా మేనమామ బతికి ఉన్నప్పుడు, ప్రతి వేసవికీ వాళ్ళ ఊరు, అమలాపురం వెళ్ళేవాళ్ళం!" తన చిన్నతనం గుర్తుచేసుకుంది అరుంధతి. "అత్తయ్య, మామయ్యా ఎంత ప్రేమగా చూసుకునేవారు! తిరిగి వస్తున్నప్పుడు కళ్ళనీళ్ళు పెట్టుకునేది అత్తయ్య! ఇప్పుడు మనుషుల్లో ఆ ప్రేమలూ ఆప్యాయతలూ కరువయిపోతున్నాయి!" బాధపడింది అరుంధతి.

"పదిహేనేళ్ళ క్రితం మామయ్య గుంటూరు జిల్లా మున్నంగి పోస్ట్ ఆఫీస్‌లో పనిచేస్తున్నప్పుడు నువ్వూ, నేనూ, నాన్నా వాళ్ళ ఊరు వెళ్ళాం! వారం రోజులు కాబోలు వున్నాం! అదే ఆఖరిసారి మామయ్య ఇంటికి వెళ్ళడం! అక్కడి లంకల్లో అరటి తోటలు, పసుపు తోటలూ ఎంత బావుండేవో! కనుచూపు మేరంతా పచ్చగా, ఎంత అందంగా వుండేదో ఆ ఊరు!" మున్నంగి అందాలు గుర్తుచేసుకుంటోంది నీరజ.

"అవును- అక్కడి పాలు, పెరుగూ కూడా చాలా బావుండేవి! మా నాన్నగారు కూడా ఎంతోకాలం మున్నంగి పెరుగు రుచినే తలుచుకునేవారు!"

పెరుగుమాట రాగానే "అన్నట్లు తోడుకున్న పాలు ఫ్రిజ్‌లో పెట్టడం మరచిపోయాను!" అంటూ వంటింట్లోకి నడిచింది నీరజ.

★ ★ ★

రాత్రి పది అయింది!

నిరంజనం కుర్చీలో కూర్చుని ఏదో పుస్తకం చూస్తున్నాడు.

అలివేణి పక్కమీది దుప్పటి దులుపుతోంది! "ఎప్పుడూ చదువూ, చదువూ! అదే పని!" చిన్నగా గొణుగుకుంది అలివేణి.

పుస్తకం పక్కన పడేసి నవ్వాడు నిరంజనం. "చదువు మానేసి ఏం చేయమంటావో చెప్పు!"

"నాతో మాట్లాడండి!"

"నువ్వేమయినా కబుర్లు చెప్పు!"

"మనం పెళ్ళయ్యాక హనీమూన్‌కి వెళ్ళ లేదు- ఈ వేసవి అంతా ఊటీలోనో, కొడై కెనాల్‌లోనో గడిపివద్దాం!"

ఆ మాటలకి అదిరిపడ్డాడు నిరంజనం. "నెలల తరబడి హిల్‌స్టేషన్లలో గడిపి రావడానికి మనం ఏమయినా సినిమా యాక్టర్లమా? "

"నెలలు కాకపోతే కనీసం పదిరోజుల యినా ఊటీలో వుండి వద్దాం!"

"సమ్మర్‌లో ఊటీలో పదిరోజులు గడ పాలంటే ఇరవైవేలు కావాలి!" ఇరవై అనే పదం ఒత్తి పలుకుతూ అన్నాడు నిరం జనం.

"అయితేనేం? మన కట్నం డబ్బులో ఇమ్మని మీ అమ్మను అడగండి!"

నిరంజనం ఏం జవాబు చెప్పాలో తోచ లేదు. "ఆ కట్నం డబ్బుతో నాకెటువంటి సంబంధం లేదు. అందులో పైసా కూడా నేను వాడుకునేది లేదు!" అన్నాడు ఖచ్చి తంగా.

"నా కోసం ఖర్చు పెట్టండి"

"అలివేణీ- నీకు పుణ్యం వుంటుంది- ఆ కట్నం ప్రసక్తి మన మధ్య తీసుకురాకు! అదీగాక ఈ సమ్మర్ అంతా నేను బిజీ! ఎంసెట్ రాసేవాళ్ళు, కొత్తగా టెన్త్‌లోకి వచ్చినవాళ్ళు రోజంతా మేథ్స్ చెప్పించుకో డానికి వస్తూనేవుంటారు! అందుకే మేడమీది గదిని క్లీన్ చేయించాను! ఎల్లుండి నుంచీ స్టూడెంట్స్ రావడం మొద లవుతుంది"

అలివేణి మొహం ముడ్చుకుంది.

"టైం పదిన్నర అయింది, ఇక పడుకుం దామా? " కుర్చీలోంచి లేచాడు నిరంజనం!

మంచంమీద ఆ వైపుకు జరిగింది అలివేణి. "మళ్ళీ ఎల్లుండి నుంచీ మీరు బిజీ అంటున్నారు కదా! రేపు నన్ను ఒంగోలు తీసి కెళ్ళండి!"

"ఎందుకు? "

"మ్యాట్నీ సినిమా చూసి, హోటల్‌లో భోజనం చేసివద్దాం"

"సినిమా చూడడానికి నాలుగు గంటలు ప్రయాణం చేసి ఒంగోలు వెళ్ళాలా? అసలు ఈ ఎండల్లో మ్యాట్నీ చూడగలమా? "

"నేనూ మా చెల్లీ వారానికి ఒక మ్యాట్నీ చూసి వచ్చేవాళ్ళం!"

"ఒంగోలు నుంచి మీ వూరికి గంట ప్రయాణం! భోజనం చేశాక ఈ మారు మూలకి రావడానికి బస్సులు వుండవు"

"టాక్సీలో వచ్చేద్దాం!"

నవ్వాలో ఏడ్వాలో తెలియలేదు నిరంజ నానికి. "సినిమా చూసి రావడానికి వెయ్యి రూపాయల ఖర్చా? "

"పెళ్ళయ్యాక నా కోసం ఎన్నివేలు ఖర్చు

## ఆత్రేయ చతురోక్తులు



**మాటల ఆటలో ఆచార్య ఆత్రేయ దిట్ట. ఆయన నోట్లోంచి ఊడి పడేవన్నీ భాషా చమత్కారాలే. మనసు కవి ఆత్రేయ ఛలో క్తులు కొన్ని..**

### వాక్చాతుర్యం



రాఘవులు సంగీత దర్శకత్వంలో ఆత్రేయ గారు ఓ పాట రాయవలసి వచ్చింది.

"గురూగారు! రెండ్రోజుల్లో పాటరాసి ఇస్తా నని వాగ్దానం చేశారు" అని రాఘవులు గుర్తు చేశారు.

"ఆ మాట మాత్రం అనకు. మాటల మ్ముకు బతికేవాణ్ని. వాక్‌దానం ఎప్పుడూ చేయను" అన్నాడు ఆత్రేయ.

పెట్టారు? " సూటిగా అడిగింది అలివేణి.

ఆ ప్రశ్నకి నిరంజనం దగ్గర సమాధానం లేదు. "అలాగే చూద్దాంలే- పొద్దుపోయింది- పడుకుందాం- కొంచెం ఆ పక్కకి జరుగు" మంచంమీద వాలుతూ అన్నాడు నిరంజనం.

★ ★ ★

అలివేణీ, నిరంజనం కందుకూరులో ఎర్రబస్సు దిగేసరికి పన్నెండయింది. ఒంగోలుకి ఎక్స్‌ప్రెస్ బస్ సిద్ధంగా వుంది.

బస్‌లో విండో పక్కన కూర్చుంటూ "బాగా దాహంగా వుంది. కూల్‌డ్రింక్ తీసుకురండి!" అంది అలివేణి.

కర్చీఫ్‌తో మొహానికి పట్టిన చమటను తుడుచుకుంటూ కిందకు దిగాడు నిరంజనం.

అతను ఫ్రూటీ కొంటూండగానే బస్సు కదిలింది! బస్సు పట్టుకోడానికి మెయిన్ రోడ్డుదాకా పరిగెత్తవలసి వచ్చింది నిరంజనానికి.

"స్ట్రా మరచిపోయారా? " నిరంజనం చేతిలోంచి ఫ్రూటీ అందుకుంటూ అంది అలివేణి.

పై జేబులోని స్ట్రా తీసి ఆమె చేతికిచ్చాడు నిరంజనం.

ఎండలో పరుగెత్తుకు రావడం వల్ల చమటతో ఒళ్ళంతా చిత్తడి చిత్తడిగా వుంది నిరంజనంకి! దాహంతో నోరు ఆర్చుకుపోయినట్టుంది. అలివేణి ఆఫర్ చేస్తే రెండు గుక్కల ఫ్రూటీ తాగాలని వుంది.

అయితే అలివేణికి ఆ ధ్యాసే లేదు! నిముషంలో ఫ్రూటీ తాగేసి, కిటికీలోంచి ఖాళీ ప్యాకెట్ బయటకు విసిరేసింది.

ఇరవై నిముషాల్లో బస్సు సింగరాయకొండ చేరింది.

చటుక్కున అలివేణి సీటులోంచి లేచి, "దిగండి, దిగండి!" అంది కంగారుగా.

"ఎందుకు? " విస్తుపోయాడు నిరంజనం.

"దిగండి చెబుతాను" నిరంజనాన్ని దాటుకుని బస్సు దిగిపోయింది అలివేణి!

కదులుతున్న బస్సులోంచి దిగక తప్పలేదు నిరంజనానికి.

స్టాండులోంచి బయటకు వచ్చి తమ ఇంటికి ఆటో మాట్లాడింది అలివేణి.

"ఇప్పుడు మీ ఇంటికి ఎందుకు? " చిరాకు పడ్డాడు నిరంజనం.

"ఈ ఎండలో మీరు మ్యాట్నీ చూడలేమని అన్నారు. నాకేమో హఠాత్తుగా అమ్మను చూడాలనిపించింది. సాయంత్రం దాకా మా ఇంట్లో చల్లగా ఎ.సి. లో గడుపుదాం!" అంది అలివేణి ఆటో ఎక్కి కూర్చుంటూ.

"మళ్ళీ రేపు సినిమాకి ఒంగోలు వెళదాం అంటే నేను బయలుదేరను" ఆ మండుటెండలో బస్సు ప్రయాణాలు పెద్ద శిక్షలా అనిపిస్తున్నాయి నిరంజనానికి!

పిలవని పేరంటంగా అలా అత్తవారింటికి వెళ్ళడం మొహమాటంగా వుంది నిరంజనానికి. పెళ్ళి సింగరాయకొండలో చేసినా శోభనం ఒంగోలు మౌర్య హోటల్ లో జరిపించాడు జనార్దనం! ఆ మూడు రోజులు హోటల్‌లోనే వున్నారు! పదిహేను రోజుల క్రితం అలివేణిని అత్తవారింట్లో దింపినప్పుడు కూడా నిరంజనం అక్కడ అరగంటకు మించిలేదు! ఆ మధ్య మామగారు అలా మాట్లాడి వెళ్ళాక, ఇలా హఠాత్తుగా వాళ్ళింటికి వెళ్ళడం అదోలా అనిపించింది నిరంజనానికి! అలివేణి మాత్రం నిరంజనం మొహంలోని భావాలేమీ గమనించకుండా, ఉత్సాహంగా కూనిరాగాలు తీసుకుంటూ కూర్చుంది!

కూతురిని చూస్తూనే "రా తల్లీ రా! రోజురోజుకి చిక్కిపోతున్నావు, నల్ల బడుతున్నావు!" అంటూ ఎదురొచ్చింది జాహ్నవి.

"అక్కా బావున్నావా? " అలివేణిని అల్లు

కుపోయింది శ్రీవల్లి.

"లోపలికి రా, అల్లుడూ!" అన్నాడు హాల్లో టీవీ చూస్తున్న జనార్ధనం.

"బావున్నారా? " పలకరింపుగా అని, మామగారి ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు నిరంజనం.

బావున్నట్లుగా తల ఊపి, పది నిముషాలపాటు ఎవరితోనో సెల్‌ఫోన్లో మాట్లాడాడు జనార్ధనం.

"బావా, మంచినీళ్ళు!" గ్లాసులో నీళ్ళు తీసుకుని వచ్చింది శ్రీవల్లి.

నిరంజనం నోరు పిడచకట్టుకుపోయి వుంది. చప్పున గ్లాసు అందుకుని, గడగడ నీళ్ళు తాగేశాడు. మరో గ్లాసు నీళ్ళు కావాలని అడిగే లోపల అక్కా అమ్మా వున్న బెడ్‌రూంలోకి వెళ్ళిపోయింది శ్రీవల్లి.

"సమ్మర్‌కి ఎక్కడికి ప్లాన్ చేశారు? " సెల్‌ఫోన్ పక్కన పెడుతూ అన్నాడు జనార్ధనం

"ఎమ్‌సెట్ వాళ్ళకి కోచింగ్ ఇవ్వాలి! ఎక్కడికి వెళ్ళాలన్నా కుదరదు!" ముక్తసరిగా అన్నాడు నిరంజనం.

"అయినా నువ్వు ఎమ్మెస్సీ, ఎం.ఇడి చేసి ఇలా టీచర్ ఉద్యోగం చేస్తున్నావేమిటి అల్లుడూ? నీలాంటి లెక్కల మాస్టార్లు విజయవాడ, హైదరాబాద్ కార్పొరేట్ కాలేజీల్లో చేస్తూ, నెలకి యాభై వేలపైన సంపాదిస్తున్నారు" లైటర్‌తో సిగరెట్ వెలిగించుకుంటూ అన్నాడు జనార్ధనం.

నవ్వి ఊరుకున్నాడు నిరంజనం.

"నువ్వు కావాలంటే ఒంగోలులో పదిహేనువేల జీతం వచ్చే ఉద్యోగం చూడగలను నేను" రింగు రింగులుగా పొగ వదులుతూ అన్నాడు జనార్ధనం!

ఆయననే పరీక్షగా చూస్తున్నాడు నిరంజనం! జనార్ధనం నల్లగా, పొడుగ్గా, గెడకర్రలా వున్నాడు. మొహంలో ఎటువంటి కళాకాంతీ లేదు. అలివేణికి ఆయన పోలికే వచ్చింది. శ్రీవల్లి తల్లిలా పుష్టిగా, తెల్లగా, చలాకీగా వుంటుంది.

నిరంజనం నుంచి ఎటువంటి జవాబూ రాకపోయేసరికి, "ఆలోచించు అల్లుడూ, ఆ పల్లెటూళ్లో వుండి...? " అన్నాడు జనార్ధనం.

"అమ్మా నాన్న వున్నారు. ఇల్లు వుంది. మా పొలాలు వున్నాయి. నాన్న అష్టకష్టాలుపడి నన్ను చదివించాడు. వాళ్ళ కోసమే చిన్న ఉద్యోగంతో సరిపెట్టుకున్నాను. అయినా నేను అసంతృప్తిగా మాత్రం లేను!" అన్నాడు నిరంజనం.

ఆ మాటలకి పెద్దగా నవ్వాడు జనార్ధనం "అలా చిన్న పిల్లవాడిలా మాట్లాడతావేమిటి? అమ్మానాన్న ఎంత కాలం వుంటారు! అయినా నీ భవిష్యత్తు కోసమేగా వాళ్ళు కష్టపడి నిన్ను చదివించింది! వాళ్ళ కోసం నీ భవిష్యత్తును విస్మరించడం అవివేకం కదా!"

నిరంజనం ఏదో అనబోతుండగా ఆడవాళ్ళు ముగ్గురు ఎ.సి.గదిలోంచి బయటకు వచ్చారు. "పిల్లా, టేబుల్‌మీద కంచాలు సర్దు!" అంటూ పనిపిల్లకి పురమాయించి "ఇద్దరూ లేచిరండి.. భోజనం వడ్డిస్తాను!" అంది జాహ్నవి.

"మేం భోజనం చేసి బయలుదేరాం" మొహమాటంగా అన్నాడు నిరంజనం.

"ఆకుకూర పులుసు, అన్నమే కదా తిని వచ్చాం! రండి, ఇక్కడ ఆలూ ఫ్రై, బెండకాయ కూర, టమాట పప్పు, ఒడియాలు అన్నీ వున్నాయి!" డైనింగ్ టేబుల్ మీద వున్న గిన్నెల మూతలు తీసి చూస్తూ అంది అలివేణి.

"నాకు ఆకలిగా లేదు, నువ్వు తిను" టీవీ ఛానల్ మారుస్తూ అన్నాడు నిరంజనం.

ఆ నలుగురూ అరగంటసేపు ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూ భోజనం ముగించారు.

పనిపిల్ల వచ్చి ఎంగిలి కంచాలు తీసుకుపోయి, డైనింగ్ టేబుల్ సర్దేసింది.

నలుగురూ వచ్చి సోఫాల్లో కూర్చుని కాస్సేపు టీవీ చూశారు.

"అల్లుడుగారూ! మీరు కూడా వేరే ఏదయినా జాబ్ చూసుకుని ఈవైపుకి వచ్చేస్తే అందరం రోజు ఇలా సరదాగా గడప వచ్చు!" హఠాత్తుగా అంది జాహ్నవి, టీవీ ఆఫ్ చేస్తూ.

"ఇప్పుడు అర్జంటుగా ఇక్కడ నాకు ఉద్యోగం ఎలా దొరుకుతుంది? "

"మీ మామయ్యగారు చూస్తారు? "

"వద్దులెండి, నాకు ఇష్టంలేదు"

"పోనీ ఏదయినా బిజినెస్ చూసుకుంటానంటే పెట్టుబడికి సహాయం చేస్తారు. ఎలాగైనా ఈవైపుకి వచ్చేయండి!" రాక తప్పదన్నట్లుగా అంది జాహ్నవి.

నిరంజనానికి సర్రున కోపం వచ్చింది. "మీ అమ్మాయికి ఈ వైపున వుండే అల్లుడిని చూసుకోవలసింది! ఇప్పుడు నా మీద వత్తిడి తీసుకురావడం ఏమీ బాగోలేదు!"

"అంతా మా తలరాత!" నిర్లిప్తంగా అన్నాడు జనార్ధనం.

"అలివేణి అలా వుంది కాబట్టి, అంతా వెతుకుతూ, ఆ మూలకి వెళ్ళాల్సివచ్చింది. మా శ్రీవల్లి కోసం అప్పుడే ఎన్నో ఫోన్‌కాల్స్ వస్తున్నాయి!"

నిరంజనం మౌనంగా వింటున్నాడు.

"నిద్ర వస్తోంది. పదవే పడుకుందాం!" సోఫాలోంచి లేచింది జాహ్నవి.

"మీరు కూడా పడుకుంటారా? " నిరంజనంవైపు చూసింది అలివేణి.

"లేదు ఈ బుక్ చదువుకుంటాను" టీపాయ్‌మీది మేగజైన్ చేతిలోకి తీసుకున్నాడు నిరంజనం.

"నేను కాస్సేపు అమ్మ పక్కన పడుకుంటాను" లేచి నిలబడి, ఒళ్ళు విరుచుకుంటూ అంది అలివేణి.

"మనం నాలుగింటికల్లా బయలుదేరుదాం!"

"అలాగే!" తల్లి వెనకే ఎ.సి. రూంలోకి వెళ్ళిపోయింది అలివేణి.

"నేనూ పడుకుంటాను అల్లుడూ!" సిగరెట్ ప్యాకెట్ తీసుకుని లేచాడు జనార్ధనం.

"పడుకోండి. నాకు మధ్యాహ్నం నిద్ర అలవాటు లేదు" మ్యాగజైన్ పేజీలు తిరగేస్తున్నాడు నిరంజనం.

"...ఎండ మండిపోతుంది. ఆరయ్యాక బయలుదేరండి!" మరో ఎ.సి. రూంలోకి వెళ్ళిపోయాడు జనార్ధనం.

నిశ్శబ్దంగా వున్న ఆ హాల్లో ఒంటరిగా మిగిలిపోయాడు నిరంజనం.




**కం**దుకూరు బస్సు ఫుల్‌గా వుంది!

"మరో బస్సు ఎక్కుదాం!" అన్నాడు నిరంజనం!

"మధ్యలో ఒక ముగ్గురు కూర్చునే సీట్లో ఒకావిడే కూర్చుంది. మీకిద్దరికీ సీట్లు వున్నాయి. ఎక్కండి!" అన్నాడు డ్రైవరు.

ఇద్దరూ బస్సు ఎక్కారు.

అలివేణి ఆవిడ పక్కన కూర్చుంది. నిరంజనం ఈ చివర కూర్చున్నాడు.

అప్పటిదాక కిటీకీలోంచి బయటకు చూస్తున్న నీరజ, పక్కన ఎవరో కూర్చోవడంతో ఈ వైపుకు తిరిగింది.

నీరజను చూస్తూనే, "ఎలా వున్నారు? "



అప్రయత్నంగా పలకరించాడు నిరంజనం.

"బావున్నాను, మీరు..." అంటూ అలివే ణిని చూసి అర్థోక్తిగా ఆగిపోయింది నీరజ.

"మా ఆవిడ అలివేణి" భార్యను నీరజకి పరిచయం చేశాడు నిరంజనం.

"నమస్తే, బావున్నారా? " చేతులు జోడిం చింది నీరజ.

నీరజకి సమాధానం చెప్పకుండా, ఆవిడ ఎవరన్నట్లుగా నిరంజనం మొహంలోకి చూసింది అలివేణి.

"నీరజగారని... చినలింగాయపాలెం స్కూల్లో టీచర్"

"మీకెలా పరిచయం? " మీ స్కూలు అది కాదు కదా అన్నట్లుగా అడిగింది అలివేణి.

"ఆవిడ పనిచేసే స్కూల్ కి మా మామయ్య హెచ్.ఎం ఆయన .కోసం వెళ్ళినప్పుడు పరిచయం"

'అలాగా' అన్నట్లు తల వూపిన అలివేణి "నాకు దాహంగా వుంది" అంది హఠాత్తుగా!

నిరంజనంకి బస్సుదిగక తప్పలేదు.

"కండక్టర్‌గారు వచ్చేస్తున్నాడు. త్వరగా రండి!" అన్నాడు డ్రైవర్.

మూడు ఫ్రూటీలు కొని, బస్సు ఎక్కాడు నిరంజనం?

"నాకు వద్దు" నిరంజనం ఇస్తున్న ఫ్రూటీని తీసుకోడానికి మొహమాట పడింది నీరజ.



"ఫర్వాలేదు. తీసుకోండి! ఎండలు దంచేస్తున్నాయి కదా!" బలవంతంగా ఫ్రూటీ నీరజ చేతిలో పెట్టాడు నిరంజనం.

"మీ అమ్మగారూ వాళ్ళు ఈ ఊళ్ళోనే వుంటారుకదూ" ఫ్రూటీ తాగుతూ అలివేణిని అడిగింది నీరజ.

అవునన్నట్లుగా తల వూపింది అలివేణి.

"నాన్నగారు ఏం చేస్తారు? "

"టొబాకో వ్యాపారం"

బస్సు మెయిన్ రోడ్మీదకు వచ్చింది. కొద్దిగా గాలి తగిలి హాయిగా వుంది.

రైల్వేస్టేషన్ రోడ్డుదాటి, కుడి వైపుకి తిరిగింది బస్సు. అక్కడినుంచి వేగం పుంజుకుంది.

"మీ ఆయన ఏం చేస్తారు? " హఠాత్తుగా అడిగింది అలివేణి.

కాళ్ళకి మట్టెలుగానీ, మెడలో నల్లపూసలు గానీ లేని తనని అలివేణి అలా అడగడం ఆశ్చర్యం అనిపించింది నీరజకు!

"నాకింకా పెళ్లి కాలేదు!"

"అదేం? "

జవాబు ఏం చెప్పాలో తోచలేదు నీరజకి.

నిరంజనం వద్దని కళ్ళతో వారిస్తున్నా పట్టించుకోకుండా "చూడబోతే మీకు ముప్పై ఏళ్ళు వున్నాయనిపిస్తోంది. నాకంటే ఐదేళ్ళు పెద్ద! ఇంకా పెళ్ళి చేసుకోలేదేం!" అని అడిగింది అలివేణి.

"ఇప్పట్లో పెళ్లి చేసుకునే ఆలోచనలేదు" అప్రయత్నంగా నిరంజనం వైపు చూస్తూ అంది నీరజ.

"మంచి ఆలోచన! పెళ్లి చేసుకోకపోతేనే ప్రాణానికి హాయి!" పెద్దగా ఆవులిస్తూ అంది అలివేణి.

బస్సు కందుకూరులో ఆగింది.

అందరూ బస్సు దిగిపోయారు.

"ఒకసారి ఇంటికి వచ్చి వెళ్ళకూడదూ? " మర్యాదకి ఆహ్వానించింది నీరజ.

"మరోసారి వస్తాం! మీ ఆహ్వానానికి థాంక్స్!" అన్నాడు నిరంజనం.

నీరజ వెళ్లిన పావుగంటకి చినలింగాయపాలెం బస్సు దొరికింది. అక్కడ జీపు పట్టుకుని మొగిలిచెర్ల వెళ్ళేసరికి రాత్రి తొమ్మిదయింది.

వాళ్ళు భోజనం చేసి రాలేదన్న విషయం తెలుసుకున్న శారదమ్మ రెండు బంగాళదుంపలు వేయించింది!

నిరంజనం స్నానం చేసి వచ్చాక, అలివేణి స్నానానికి వెళ్లింది.

"హోటల్కి వెళ్ళలేదా? " వంటింట్లో కంచాలు పెడుతూ అడిగింది శారదమ్మ.

పొద్దున్న వెళ్ళేటప్పుడు ఒంగోలులో మ్యాట్నీ చూసి, హోటల్లో భోజనం చేసి

వస్తామని చెప్పాడు నిరంజనం!

"లేదు. అసలు ఒంగోలుకే వెళ్ళలేదు!"

"మరి? " ఆశ్చర్యపోయింది శారదమ్మ.

"ఎక్కడికి వెళ్ళారు? "

"అలివేణి వాళ్ళింటికి!" ఆ మాటలు అంటున్నప్పుడు అపరాధ భావంతో తల దించుకున్నాడు నిరంజనం.

అది వినగానే శారదమ్మ మొహంలో గబగబ రంగులు మారాయి.

"ఇప్పుడు వాళ్ళింటికి ఎందుకు? "

"తనకి వాళ్ళ అమ్మను చూడాలనిపించిందట"

"మొన్ననేగా వెళ్ళి పదిరోజులు వుండివచ్చింది. అయినా నువ్వు వెళ్ళేటప్పుడు అక్కడికని చెప్పకుండా, ఒంగోలుకని చెప్పడం ఎందుకు? " నిష్ఠూరంగా అంది శారదమ్మ.

"లేదు వెళ్ళేటప్పుడు ఒంగోలుకనే బయలుదేరాం"

"అబద్ధాలు ఆడకు! సినిమాకీ, హోటల్‌కి అయితే రాధని పిలవకుండా వెళతారా? పిచ్చిపిల్ల, మీరు వెళ్ళాక గంటసేపు ఏడ్చింది? మీకు సింగరాయకొండ వెళ్ళే ప్లాన్ వుంది కాబట్టే దాన్ని రమ్మనలేదు!"

రాధని తమతో రమ్మని పిలవకుండా వెళ్ళడం తప్పే అనిపించింది నిరంజనంకి.

"నిజం చెబుతున్నాను అమ్మా! సింగరాయకొండలో అలివేణి హఠాత్తుగా ప్రోగ్రాం మార్చింది!" తన మాటలు తల్లి నమ్మడం లేదని నిరంజనానికి తెలుస్తూనేవుంది.

"మళ్ళీ మీ మామగారు కట్నం ఊసు తెచ్చారా? "

"లేదు"

"అందరూ మామూలుగానే మాట్లాడారా? "

"ఆc..."

వాళ్ళు తనని ఊరు వదిలి రమ్మన్నారని నిరంజనం చెప్పలేదు. తను ఎలాగూ వెళ్ళేది లేదు. ఆ సంగతి చెప్పి ఇంట్లో వాళ్ళకి ఆందోళనని, తన అత్తవారిపట్ల కోపాన్ని పెంచడం అనవసరం!

అలివేణి స్నానం చేసి రావడంతో ఇంకా ఏదో అడగబోతున్న శారదమ్మ నోటికి తాళం పడింది.

★ ★ ★

ఆ రాత్రి చాలాసేపటివరకూ నిరంజనానికి నిద్ర పట్టలేదు.

అత్తవారింట్లో తనకి ఊపిరి సలపనట్లుగా అనిపించింది. ఎంతో అసౌకర్యం. నాలుగు గంటలు అక్కడ గడపడమే కష్టం అయింది.

అన్ని సౌకర్యాలు వున్న ఆ ఇంట్లో మహారాణీలా పెరిగింది అలివేణి. అటువంటి తను ఏ సౌకర్యాలు, సౌఖ్యాలు లేని ఈ పల్లెటూళ్ళో ఈ ఇంట్లో సర్దుకోవడం నిజంగా కష్టమే! అందుకు చాలా కాలమే పట్టవచ్చు కూడా! తను అలివేణి కోసం ప్రత్యేకంగా ఏమీ చేయడంలేదు. ఆమెతో రోజులో మూడు నాలుగు గంటలు గడిపి, తన ఆలోచనాధోరణిలో మార్పు తీసుకురావాలి. నలుగురిలో ఎలా మసులుకోవాలో అర్థం అయ్యేలా చెప్పాలి! తనకీ కొన్ని సౌకర్యాలు కల్పించాలి! త్వరలోనే కొత్త మంచాలు, పరుపులు కొనాలి! అలివేణి పట్ల తను కూడా కొంచెం సానుభూతితో, ప్రేమతో మెలగాలి! తనూ మారాలి!

మంచి నిద్రలో వున్న అలివేణి ఆరేళ్ళ పసిపాపలా కనిపించింది నిరంజనం కళ్ళకి!

ప్రేమగా ఆమె నుదురును చుంబించాడు నిరంజనం.

★ ★ ★

ఆ రోజు నిరంజనం తల్లి తీసుకుని రమ్మన్న డబ్బులు డ్రా చేయడానికి కెనరా బ్యాంకుకి వెళితే "ఇలారండి సార్!" అని తనగదిలోంచి పిలిచాడు మేనేజర్ తోఫిక్.

చిన్న వయసులోనే మేనేజర్ అయిన

తోఫిక్‌కు ఇంకా పెళ్లి కాలేదు. చాలా చలాకీగా వుంటాడు. కస్టమర్లనందరినీ పేరు పేరునా పలకరిస్తాడు. అందరితో నవ్వుతూ మాట్లాడతాడు. ఆ బ్రాంచ్‌కి వచ్చిన ఏడాదిలోపే, ఊళ్ళో వాళ్ళందరికీ ఆత్మీయుడైపోయాడు.

"మేడమీదికి చాలామంది కుర్రాళ్ళు వస్తున్నారు. ట్యూషన్లు చెబుతున్నారా? " నిరంజనానికి కుర్చీ చూపిస్తూ అడిగాడు తోఫిక్.

"ఎమ్. సెట్ వాళ్ళకి మేథ్స్ చెబుతున్నాను. కొత్తగా టెన్త్, ఇంటర్ లోకి వచ్చిన వాళ్ళు కూడా మేథ్స్ చెప్పించుకుంటున్నారు'
'

"మీరంత పెద్దక్లాసులకి చెప్పగలరా" ఆశ్చర్యపోయాడు తోఫిక్.

"నేను ఎమ్.ఎస్.సి ఎమ్.ఇడి- సైన్స్ కూడా చెప్పగలను" చెక్కుమీద ఎమౌంట్ రాస్తూ అన్నాడు నిరంజనం.

"అంత చదువుకుని ఆరువేల జీతానికి చేస్తున్నారా? వీల్లేదు!"

"అయితే ఏం చేయమంటారు? మీ బ్యాంకులో ఆఫీసర్ పోస్ట్ ఇస్తారా? " నవ్వాడు నిరంజనం.

"చిన్న లింగాయపాలెంలో మంచి స్కూల్ స్టార్ట్ చేయండి. లోన్ ఇస్తాను" ఉత్సాహంగా అన్నాడు తోఫిక్.

"అదో బృహత్ ప్రణాళిక! నా ఒక్కడి వల్లా ఏం అవుతుంది? మంచి టీచింగ్ స్టాఫ్ దొరకాలి!"

"దొరుకుతారు!" తను పూచీ అన్నట్లుగా అన్నాడు తోఫిక్.

"ఆలోచిస్తాను లెండి. పిలిచి లోన్ ఇస్తానని అన్నందుకు థాంక్స్"

"అదేంమాట? మేం వున్నది అవసరంలో వున్నవారికి ఆర్థిక సహాయం చేయడానికే కదా! మీరు లోన్ తీసుకుని మంచి స్కూల్ స్టార్ట్ చేస్తే, నేనే కాదు ఈ ఊరంతా మీకు థాంక్స్ చెబుతారు!" మాట్లాడుతూనే ప్యూన్‌తో నిరంజనం డ్రా చేసిన, మూడు వేల రూపాయల క్యాష్ తెప్పించాడు తోఫిక్.

నోట్లు లెక్కపెట్టుకుని, పర్స్‌లో పెట్టుకుంటూ "మీ సర్వీస్‌కి థాంక్స్!" అంటూ బయటకు వచ్చాడు నిరంజనం.

నిరంజనం బ్యాంక్‌నుంచి వస్తూండటం, వీధివైపు మల్లెమొగ్గలు తుంచుతున్న అలివేణి చూసింది. "వెళ్ళేటప్పుడు నాకు చెప్పలేదేం? నేనూ వచ్చేదానిని కదా!" అంది నిరంజనం గేటు తీసుకుని, లోపలికి రాక ముందే.

"ఎక్కడకి? "

"బ్యాంక్‌కి!"

"అక్కడికి నువ్వెందుకు? "

"బోర్ కొడుతున్నప్పుడు ఎక్కడికయితేనేం? " నిరంజనం వెనకే ఇంట్లోకినడిచింది అలివేణి.

నిరంజనం డ్రా చేసి తీసుకువచ్చిన మూడువేలు తల్లిచేతికి ఇచ్చి తమ గది లోకి వచ్చాడు.

"మీ ఎకౌంట్‌లో ఎంత డబ్బుంది? " మంచం మీద కూర్చుని కాళ్ళు ఆడిస్తోంది అలివేణి.

నిరంజనం పెద్దగా నవ్వాడు. "ప్రతినెలా జీతం మొత్తం ఇంట్లో ఇచ్చేస్తూవుంటే ఎకౌంట్‌లో ఏం వుంటాయి? "

"నెలకి మూడు నాలుగు వేలయినా బ్యాంకులో దాచుకొమ్మని అమ్మ చెప్పింది"

"నా జీతం అంతా ఇంట్లో ఇవ్వకపోతే ఇల్లు ఎలా గడుస్తుంది? "

"అలా అయితే ఎప్పటికీ మనం ఇలాగే వుండిపోతాం! అందుకే నాన్న ఒంగోలులో ఉద్యోగం చూస్తానన్నాడు. అక్కడ అద్దె లేకుండా లాయర్‌పేటలోని మా ఇంట్లో మనం వుండొచ్చు! బియ్యం, పప్పులు అమ్మ పంపిస్తుంది. మనకి జీతం అంతా మిగులే!"



"ఏమో అనుకున్నాను! నువ్వు కూడా చాలా దూరం ఆలోచిస్తావు!" అలివేణి మాటలు తేలిగ్గా తీసుకుని నవ్వేశాడు నిరంజనం.

"మనం ఒంగోలు వచ్చేస్తున్నట్లు నాన్నకి ఫోన్ చేసి చెప్పనా? " ఆత్రుతగా అడిగింది అలివేణి.

"నీకేమయినా మతిపోయిందా? ఎన్ని సార్లు చెప్పాలి? మనం ఈ ఊరు వదిలి ఎక్కడికీ వెళ్ళం!" సీరియస్ అయిపోయాడు నిరంజనం.

"నాకీ ఊరు నచ్చలేదు"

"నేను నచ్చాను కదా! నాతో ఈ ఊళ్ళో వుండక తప్పదు!"

"అంటే నేను మీకు నచ్చలేదా? "

ఏం జవాబు చెప్పాలో తెలియలేదు నిరంజనంకి.

శారదమ్మ భోజనానికి కేక వేయడంతో, బతుకు జీవుడా అనుకుని, "పద, పద, అమ్మ పిలుస్తోంది!" అన్నాడు నిరంజనం.

★ ★ ★

ఆ రోజు సాయంత్రం శారదమ్మ త్వరగా



"లేదు- అమ్మతో కాసేపు కబుర్లు చెబుదాం అని వచ్చాను. అమ్మ అదృష్టం. నీ దురదృష్టం! నువ్వు దొరికిపోయావు!" నవ్వింది కాత్యాయని!

ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

ఆ కబుర్లన్నీ అలివేణికి వినిపిస్తున్నాయి!

మాటలలో "నీ పెళ్ళెప్పుడు రాధా? " అంటూ నవ్వుతూ అడిగింది కాత్యాయని.

"ఇన్నాళ్ళు బి.ఎ. అయ్యాకే అని భీష్మించాను. ఇప్పుడు ఎంత త్వరగా ఈ ఇంట్లోంచి బయటపడదామా అనిపిస్తోంది!" భారంగా నిట్టూర్చింది రాధ.

"అదేం? ఈ నిర్ణయం తీసుకోవడానికి కారణం ఎవరు? "

"మా వదిన!" గొంతు తగ్గించింది రాధ.

"వివరంగా చెప్పు!" కొత్త ఉత్సాహం వచ్చింది కాత్యాయనిలో.

కాస్సేపటిదాకా రాధ ఏమీ మాట్లాడకపోవడం చూసి "మీ అన్నయ్యా, వదినల అన్యోన్య దాంపత్యం చూసి, త్వరగా ఒక ఇంటిదానివి అయిపోవాలనిపిస్తోందా? " అంది కాత్యాయని. ఎంత దాచాలన్నా ఆ గొంతులో వెటకారం దాగడంలేదు.

"ఇంకా నయం- అన్యోన్య దాంపత్యమా పాడా... మా వదినను చూస్తుంటే జీవితంమీదే విరక్తి పుడుతోంది!"

"అంత కష్టం ఏం వచ్చిందమ్మా? "

"ఆ రూపానికి తగ్గట్టే వుంటాయి ఆవిడగారి బుద్ధులు! రోజూ పోట్లాటే! ఎవరితోనూ కలవదు! ఊళ్ళో అందరూ కూడా వదిన గురించి రకరకాలుగా చెప్పుకుంటున్నారట కదా! ఆవిడని మా వదిన అని చెప్పుకోడానికే అసహ్యం వేస్తోంది. ఆ టీచర్‌తో అన్నయ్య పెళ్ళి జరిగివుంటే ఎంత బావుండేది!" అప్రయత్నంగా అనేసింది రాధ.

వంట ముగించుకుని రచయిత్రి రామేశ్వరి గారింటికి వెళ్ళింది!

అలివేణి తన గదిలో మల్లెల దండ అల్లుకుంటోంది.

రాధ హిస్టరీ పుస్తకం చదువుకుంటోంది.

"అమ్మని పిలు రాధా!" కాత్యాయని గుమ్మందాకా వచ్చాక తల ఎత్తి చూసింది రాధ.

"అమ్మ రామేశ్వరి గారింటికి వెళ్ళింది. కూర్చో అత్తా? " అంది రాధ పుస్తకం పక్కన పెడుతూ.

"ఏమయినా పనిమీద వచ్చావా? "

ఆ మాటలకి మల్లెల దండ తలలో తురుముకుంటున్న అలివేణి ఉలిక్కిపడింది!

"ఎవరా టీచరు?" ఆరాలు ఆరంభించింది కాత్యాయని.

"చినలింగాయపాలెం స్కూల్లో టీచరు-అప్పట్లో ఆవిడ మన ఇంటికి వచ్చినప్పుడు నువ్వు చూశావు కూడానూ!"

"ఎవరూ తెల్లగా పొడుగ్గా, ఉల్లిపాయ రంగు చీర కట్టుకుని పగలు పదకొండు గంటల ప్రాంతంలో వచ్చిందే..." ఆరు నెలల క్రితం సంఘటనను గుర్తుకు తెచ్చుకుంటోంది కాత్యాయని. ఆమె జ్ఞాపకశక్తి చాలా గొప్పది.

"అవును- ఆ అమ్మాయే! అన్నయ్య కట్నం తీసుకోకుండా ఆ అమ్మాయిని చేసుకుంటానన్నాడట! ఆ అమ్మాయి వాళ్ళ అమ్మని తనతోపాటే వుంచుకోవాలనుకుంది! అమ్మ అందుకు ఒప్పుకోలేదు. రెండు లక్షల కట్నం కావాలంది! ఆ టీచర్ని అవమానించి పంపేసింది! ఆ టీచర్ అందంగా, వినయంగా ఎంత బావుందో!"

"అందుకే మీ అన్నయ్య ప్రేమించాడు"

"అవును- ఆ పెళ్ళి జరగనందుకు డిప్రెషన్‌లో పడిపోయాడు. అమ్మ పోరు పడలేక నిరాసక్తంగా ఈ పెళ్ళి చేసుకున్నాడు"

"మొన్న రంగనాయకి చినలింగాయపాలెం బస్సులో మీ అన్నయ్య పక్కన మరో అమ్మాయిని చూశానంది. బహుశా ఆ పిల్లే అయివుంటుంది. ఇంతకీ ఆ టీచర్ పేరేమిటన్నావు?" ఆ రంగనాయకి రాంబాబుని గురించి చెప్పిన విషయం నిరంజనానికి ఆపాదించింది కాత్యాయని. "ఆ టీచర్ పేరు నీరజ!"

ఆ పేరు విని తుళ్ళి పడింది అలివేణి. కందుకూరు బస్సులో తన పక్కన కూర్చున్న అమ్మాయిని నిరంజనంని పలకరించడం, బలవంతంగా ఆ అమ్మాయి చేతిలో ఫ్రూటీ పెట్టడం సినిమా సీన్లలా మళ్ళీ మళ్ళీ కళ్ళముందు కనిపిస్తున్నాయి.

"ఇంతకీ మీ వదిన ఎక్కడ?" గొంతు తగ్గించింది కాత్యాయని.

"తన గదిలోనే వుంది!"

"మన మాటలు వింటోందేమో!" మరింత నెమ్మదిగా అంది కాత్యాయని.

"వింటే విననీ! నాకేం భయమా!" మొండిగా అంది రాధ.

"మీ అన్నయ్య కూడా వున్నాడా?"

"లేదు తిరుపతి వెళ్ళాడు- మరో టీచర్ పెళ్ళికి! స్కూల్ టీచర్లు అందరూ కలిసి వెళ్లారు! తనూ వస్తానని పెద్ద రాద్ధాంతం చేసింది వదిన! అంతా మగవాళ్ళే వున్నారంటే వినదే! త్వరలోనే విడిగా తనని మాత్రం తీసికెళతానని చెప్పాక శాంతించింది- మహాతల్లి!"

"నిజంగా తిరుపతికే వెళ్ళాడో- ఆ నీరజ ఇంటికే వెళ్ళాడో" పెద్దగా నవ్వింది కాత్యాయని!

"మరో నాలుగు రోజుల్లో స్కూళ్ళు తెరిచేస్తారు- ఇద్దరూ బిజీ అవుతారు! ఈ లోగా డ్యూయట్లు పాడుకుంటున్నారేమో!"

శారదమ్మ గేటు తీసుకురావడం చూసి "వెళతాను- అప్పుడే చీకటి పడిపోయింది" అంటూ లేచింది కాత్యాయని. వెళ్ళబోతున్న కాత్యాయనితో కాస్సేపు కూర్చుని వెళ్ళొచ్చుగా అని చెప్పులు విడుస్తూ అంది శారదమ్మ.

"ఇంకా నయం- నేనొచ్చి అప్పుడే గంట దాటింది! అవతల మీ అన్నయ్యగారు వచ్చేసి వుంటారు!" వెళ్ళిపోయింది కాత్యాయని.

ఆ రాత్రంతా అలివేణికి నిద్రలేదు.

ఎన్నో టీవీ సీరియళ్లలో చూసిన రకరకాల సంఘటనలు కళ్లముందు కదులుతున్నాయి. పార్కుల్లోను, మంచుకొండల్లోనూ నిరంజనం, నీరజ ఫ్రూటీ తాగుతూ నవ్వ

కుంటున్నట్లు, ఒకరికి ఒకరు అందకుండా పరుగులు పెడుతున్నట్లు పిచ్చి పిచ్చి కలలు.




సాయంత్రం ఐదు కావొస్తున్నా ఎండ తీక్షణంగా ఉంది.

శారదమ్మ కాఫీ కలుపుతోంది!

"అదిగో అన్నయ్య వచ్చాడు!" చదువుతున్న పుస్తకం పక్కన పెట్టి లేచింది రాధ.

భుజాన ఎయిర్ బాగ్, చేతి సంచిలో రకరకాల గులాబీ మొక్కలతో వచ్చాడు. నిరంజనం!

"ఈ ఎండల్లో అవి బతుకుతాయా? ఒకే సారి అన్ని మొక్కలు తెచ్చావేం? " నిరంజనానికి కాఫీ తీసుకువచ్చింది శారదమ్మ.

"రైల్లో చీప్‌గా అమ్ముతుంటే కొన్నాను. జూన్ వచ్చేసిందిగా! రోజూ నీళ్ళు పోస్తే ఎందుకు నాటుకోవు? " మొక్కలు పక్కన పెట్టి కాఫీ గ్లాసు అందుకున్నాడు నిరంజనం. "రాధకి గులాబీలంటే ప్రాణం కదా! మొత్తం నాలుగు రంగుల పువ్వులు పూసే మొక్కలు కొన్నాను. నాకు కూడా గులాబులంటే ఇష్టం."

కాఫీ తాగగానే ఆ మొక్కలను నాటడానికి, మేడ మెట్ల కింద వున్న స్టోర్ రూంలోంచి పలుగు, పారా తీశాడు నిరంజనం.

"ప్రయాణం చేసి ఇప్పుడే వచ్చావు, రేపు నాటవచ్చు కదరా!" అంది శారదమ్మ వీధి గదిలోంచే!

"ఇప్పటికే మొక్కలు వాడుమొహం పట్టాయి. ఏకంగా వీటిని నాటేసి స్నానం చేద్దామని" ముందు వైపు గోడ వారగా గుంతలు తవ్వుతున్నాడు నిరజనం!

తన గదిలో ఉన్న అలివేణికి వాళ్ళ మాటలు అన్నీ వినిపిస్తున్నాయి! ఊరి నించి రాగానే నిరంజనం తమ గదిలోకి రాలేదు. తనని పలకరించలేదు! అతడే వస్తాడని అరగంటసేపు గదిలోనే ఎదురు చూసింది అలివేణి!

నిరంజనం గుంతలు తవ్వే పనిలో నిమగ్నమైపోయి వున్నాడు! అవమానంతో అలివేణి మనసు కుతకుతలాడిపోతుంది. తనే లేచి చిన్నగా గదిలోంచి బయటకు నడిచింది!

మట్టి సరిచేస్తున్న నిరంజనం అలివేణిని చూసి నవ్వాడు. "ఎలా వున్నావు? పడుకున్నావా? "

"నన్ను చూస్తేనే గానీ ఈ ఇంట్లో నేనంటూ ఒక మనిషిని వున్నట్లు గుర్తుకు రాలేదా? " వ్యంగ్యంగా అంది అలివేణి.

"అదేం మాట? "

"మరి రాగానే మన గదిలోకి ఎందుకు రాలేదు? నన్ను పలకరించనయినా పలకరించకుండా తోటపనిలోకి దిగిపోయారు!"

"ఈ గులాబీ మొక్కలు ఎండిపోతాయని"

"ఆ మొక్కల మీద అంత ప్రేమ ఏమిటో? అవును మరి, వాటిని తెచ్చింది నీరజ ఇంటినుంచి కదా!"

ఆ మాటలకి తుళ్ళి పడ్డాడు నిరంజనం. "ఈ మొక్కలు నీరజ ఇంటి నుంచి తేవడం ఏమిటి? "

"దబాయించకండి- నాకు అంతా తెలుసు!"

"ఏం తెలుసు నీకు? " ఎండలో

## కొత్తగాలి... 

కొండ శిఖరం మీద
కొలువు తీరిందా
ఏకాకి చెట్టు
ఏ 'కాకి' పుణ్యమో!

–అయినాల కనకరత్నాచారి, కొరిశపాడు

ప్రయాణం చేసి వచ్చిన నిరంజనం చిరాకు పడ్డాడు.

"ఇప్పుడు నన్ను విసిగించకు!"

"అలా చిరాకు పడతారేం? మీ గుట్టు తెలిసిపోయిందనా? "

"గుట్టా! ఏం గుట్టు? ఎవరి గుట్టు? " అయోమయంగా అడిగాడు నిరంజనం.

"ఎవరి గుట్టో అయితే నాకెందుకు? మీ గుట్టు! మీ ప్రేమ గుట్టు!"

"నా ప్రేమా? "

"అంత అమాయకంగా మొహం పెట్టకండి! నీరజను మీరు ప్రేమించలేదూ? కట్నం లేకుండా తనని పెళ్లి చేసుకుంటానని అనలేదూ? "

నిరంజనం నిర్ఘాంతపోయాడు! తనకీ, నీరజకి మధ్య జరిగిన సంగతి అలివేణికి ఎలా తెలిసింది? ఎవరు చెప్పి వుంటారు?

"అలా నీళ్లు నములుతారేంటి, చెప్పండి! తననయితే కట్నం లేకుండా చేసుకుంటారా? నన్ను చేసుకోవడానికి మూడు లక్షల కట్నం కావాలా? ఎంత ధర్మాత్ములు మీరు? "

అలివేణి అలా వెటకారంగా మాట్లాడటం నచ్చని 'నిరంజనం' "ఈ విషయాలన్నీ మన గదిలో మాట్లాడుకుందాం- వీధిలో కాదు!" అన్నాడు సాధ్యమైనంత సౌమ్యంగా.

"మీరేమీ తప్పు చేయకపోతే రహస్యంగా ఎందుకు మాట్లాడుకోవాలి? నాకు ఈ విషయం చెప్పండి, మీరు కట్నం తీసుకోకుండా నీరజని పెళ్లి చేసుకుంటానని అన్నారా, లేదా? "

క్షణం మౌనంగా వున్నాడు నిరంజనం, "నీరజను పెళ్లి చేసుకోవాలని అనుకున్నాను, కానీ... "

"మీ అమ్మగారు ఇంటికి వచ్చిన నీరజను నాలుగు దులిపి పంపింది. ఇక నీరజతో పెళ్లి జరగదని, మూడులక్షల కట్నం తీసుకుని నాతో సెటిల్ అయిపోయారు! చాటు మాటుగా నీరజతో ప్రేమాయణం సాగిస్తున్నారు..." ఒంట్లో రక్తం అంతా మొహంలోకి పొంగి వచ్చింది అలివేణికి!

"షటప్! నీరజగారి మీద నిందలు వేయకు! నీరజ మా ఇంటికి వస్తే, అమ్మ అవమానించి పంపిందా? నీకెలా తెలుసు!'

'నీరజ తమ ఇంటికి వచ్చి వెళ్లిందనే నిజం నిరంజనాన్ని ఆశ్చర్యంతో ముంచేసింది.

"ముందీ సంగతి చెప్పండి! నిజంగా మీరు నీరజను కట్నం లేకుండా చేసుకుంటానని అన్నారా! ఇప్పటికీ ఆవిడను కలుస్తున్నారా? అందుకే కాబోలు ఆ రోజు కందుకూరులో బస్సు దిగాక ఇంటికి రమ్మని ఆహ్వానించింది!"

నిరంజనం పలుగు, పారా పక్కన పడేశాడు, "పద లోపలికి వెళ్లి ప్రశాంతంగా మాట్లాడుకుందాం!"

"ఇక ఈ ఇంట్లో నేను ప్రశాంతంగా వుండలేను. ఇప్పుడే మా ఇంటికి వెళ్లిపోదాం! నాన్న మీకు ఒంగోలులో ఏదయినా ఉద్యోగం చూస్తాడు. బయలుదేరండి!" మొండిగా అంది అలివేణి.

"నీకేమయినా మతిపోయిందా? నేనీ ఊరు వదలిరానని ఎన్నిసార్లు చెప్పాలి? " అసహనంగా అన్నాడు నిరంజనం.

"ఈ ఊరు వదిలి రాలేరా, నీరజను వదిలి రాలేరా? ఎందుకు రారు? మీరు ఈ క్షణంలో నాతో బయలుదేరి వస్తు

న్నారు, అంతే!" పంతంగా అంది అలివేణి.

"నేను రాను... రాను... రాను"

"రాకపోతే నేను ఊరుకోను"

"ముందు నువ్వు ఇంట్లోకి వెళతావా, లేదా?" కసిరినట్లుగా అన్నాడు నిరంజనం.

అలివేణి మొండిగా అక్కడే నిలబడింది!

పార, పలుగు స్టోర్ రూంలో పడేసి, స్నానం చేయడానికి బాత్‌రూంలోకి వెళ్లిన నిరంజనం మరుక్షణం బయటకు వచ్చి, "బాప్‌రే! బాత్‌రూంలో తాచుపాముంది!" అంటూ బయట నుంచి, బాత్‌రూం తలుపు గడియ పెట్టేశాడు!

అలివేణి నిలబడిన చోటునుంచి కదల లేదు.

నిరంజనం ఆమెను పట్టించుకోకుండా వంటింట్లోకి వెళ్లి అమ్మా, బాత్‌రూంలో తాచుపాము వుంది. నేనిప్పుడే వెళ్లి పాములు పట్టే మాల్యాద్రిని తీసు కువస్తాను!" అంటూ చెప్పులు వేసుకుని బయటకు వచ్చాడు.

బయట అలివేణి లేదు!

తమ గదిలోకి వెళ్లి వుంటే కనిపించేదే!

నిరంజనం ఉలిక్కిపడి బాత్‌రూంకేసి చూశాడు!

తను బయటనుంచి వేసిన గడియతీసి ఉంది. తలుపు మాత్రం దగ్గరగా పెట్టి వుంది!

అలివేణి బాత్‌రూంలోకి వెళ్లిపోలేదు కదా!

ఆ ఆలోచన రాగానే ఒక్క ఉదుటున బాత్‌రూం దగ్గరికి పరుగెత్తి, తలుపుతీసి చూశాడు నిరంజనం!

సందేహం లేదు, లోపల నుంచి గడియ పెట్టి ఉంది!

నిరంజనంకి ముచ్చెమటలు పోశాయి. ఎలాగో నోరు పెగుల్చుకుని "అలివేణీ... అలివేణీ...లోపల పాముంది. ప్రమాదం! వెంటనే బయటకు వచ్చేయి..." అన్నాడు తలుపు దబదబ బాదుతూ.

"మీరీ ఊరు నుంచి రారు. నేనీ గది లోంచి రాను..." లోపల నుంచి మొండిగా అంది అలివేణి.

"ఈ ఇంట్లో వున్న మనుషుల విషం కన్నా, పాము విషం ప్రమాదం కాదు"

"ఫూలిష్‌గా మాట్లాడకు. బకెట్ల వెనక చాలా పెద్ద నల్లత్రాచు వుంది! ఆలస్యం చేయకుండా బయటకు వచ్చేయి, ప్లీజ్!" నిరంజనానికి ఆందోళనతో గొంతు పెగ లడం కష్టంగా ఉంది.

"నా మాట విను! తలుపు తెరు!"

తలుపులు బాదుతున్న శబ్దానికి లోపలి నుంచి శారదమ్మ, రాధ పరుగెత్తుకువ చ్చారు.

"ఏమయిందిరా!" ఆందోళనగా అడిగింది శారదమ్మ.

"అలివేణి లోపల నుంచి గడియ పెట్టే సుకుంది. బయటకు రమ్మని నువ్వయినా చెప్పమ్మ" నిరంజనం కళ్లల్లోంచి ధారాపా తంగా కారిపోతున్న నీళ్లను చూసి తల్లడిల్లి పోయింది శారదమ్మ.

"అలివేణి- లోపల పాము వుందట- ముందు తలుపు తీయి!" తలుపు బాదు తుంటే శారదమ్మ చేతులు వణుకుతు న్నాయి.

"బయటకు వచ్చేయి వదినా!" గట్టిగా అరిచింది రాధ.

అలివేణి సమాధానం చెప్పలేదు.!

అయితే లోపల నుంచి బకెట్లు కదుపు తున్న శబ్దం అయింది!

బయట వున్న ముగ్గురిలోనూ నరాలు తెగే ఉత్కంఠ! రెండు నిముషాల తర్వాత లోపలి నుంచి అలివేణి కేక భయంకరంగా వినిపించింది!

ఆ కేక వింటూనే కుప్పకూలిపోయాడు నిరంజనం. "అలివేణీ... అలివేణీ..." అప్ర యత్నంగా అతని పెదవులు కదులుతు

న్నాయి.

రాధ క్షణం ఆలస్యం చేయకుండా, రోడ్డు మీదకు వెళ్లి, నలుగురిని వెంటబెట్టుకొని వచ్చింది.

పెద్ద బండరాయితో కొట్టాక, లోపల గడియ ఊడింది!

తలుపు తోయగానే బుస్సుమంటూ త్రాచుపాము బయటకు వచ్చి పడగ విప్పింది!

అందరూ తలోదిక్కుకు పారిపోయారు!

నిరంజనం కూర్చున్న చోటునుంచి లేవ లేదు.

త్రాచుపాము నాలుగు దిక్కులా పరికించి ఆ పక్కనే వున్న కాలువలోంచి, వెనక వైపువున్న పొలాలలోకి జరజర పాకుకుంటూ పోయింది!

లోపల అడ్డంగా పడివున్న, అలివేణిని ఇద్దరు మనుషులు ఎత్తుకు వచ్చి బయట అరుగుమీద పడుకోబెట్టారు.

అలివేణి స్పృహలో లేదు. నోటి వెంట తెల్లని నురుగు వస్తోంది!

"పామును పట్టేసుకున్నారేమో! చేతిమీదే మూడుచోట్ల పాము కాట్లు కనిపిస్తు న్నాయి!" తన పైమీది గుడ్డను, అలివేణి జబ్బకు గట్టిగా కడుతూ అన్నాడు వచ్చిన వాళ్ళల్లో ఒక ముసలివాడు.

అలివేణి మెడ పక్కకు వాల్చేసింది.

ఉచ్ఛ్వాస నిశ్వాసలు లేవు!

"అలివేణీ, అలివేణీ... కళ్ళుతెరు!" ఆమె ను కుదుపుతున్నాడు నిరంజనం.

"రామేశ్వరిగారింట్లో ఇందాక ఒంగోలు డాక్టరుగారిని చూశాను!" గుంపులో ఎవరో అన్నారు.

"వెంటనే వెళ్ళి ఆయన్ని తీసుకురండి! మీకు పుణ్యం వుంటుంది!" శారదమ్మకి కాలూ చెయ్యి ఆడటం లేదు!

ఎవరో బైక్‌మీద వెళ్ళి, ఐదు నిముషాల్లో డాక్టర్‌ని వెంటబెట్టుకుని వచ్చాడు!

అలివేణిని చూస్తూనే "ఇట్స్ టూ లేట్" అన్నాడు డాక్టరు. నాడి పట్టుకుని చూసి, పెదవి విరిచి "అయామ్ సారీ!" అని వెళ్ళిపోయాడు.

శారదమ్మ ఘొల్లుమంది.

తల్లి దుఃఖం చూసి తనూ బావురు మంది రాధ.

కళ్ళు తెరిచి వున్న, నిరంజనానికి చుట్టూ జరుగుతున్నది అర్థం కావడం లేదు! మెద డంతా మొద్దుబారిపోయింది. ఒంట్లో ఏ కోశానా చలనం లేదు!

అప్పుడే పొలం నుంచి వచ్చిన రాజేశం, సంగతి తెలుసుకుని, అరుగుమీదే చతికిల పడిపోయాడు!

రాత్రి పన్నెండు కావొస్తుండగా జనా ర్ధనం, జాహ్నవి, శ్రీవల్లి కారు దిగారు!

వస్తూనే ముగ్గురూ పెద్దగా రోదిస్తూ, అలివేణి శవంమీద వాలిపోయారు. వాళ్ళను ఓదార్చడం ఎవరి తరం కాలేదు.

"బంగారం లాంటి పిల్లను ఈ అడవి లోకి పంపించి, చేజేతులా చంపుకున్నాం!" తెల్లవారే లోపల కొన్ని వందలసార్లు అలా అంటూ, వెక్కివెక్కి ఏడుస్తూనే వుంది జాహ్నవి!

పొద్దున్న పదకొండు గంటలకల్లా అన్ని ఏర్పాట్లూ పూర్తి అయ్యాయి.

తనకి ఏమాత్రం నచ్చని ఆ ఊరి చితి మంటల్లో కాలి బూడిద అయిపోయింది అలివేణి

★ ★ ★

స్కూళ్ళు తెరిచి నెల కావొస్తున్నా, నిరం జనం ఇంట్లోంచి బయటకు రావడం లేదు!

పెరిగిపోయిన గడ్డంతో, మాసిన బట్టల్లో మంచంమీద పడుకునే వుంటున్నాడు!

శారదమ్మ అతిబలవంతమీద ఇంత తిని పిస్తోంది.

"అలివేణీ నీకు అన్యాయం చేశాను. నా వల్లే నువ్వు చచ్చిపోయావు" కళ్ళనీళ్ళతో

గొణుక్కుంటూ వుండేవాడు.

"ఈ లోకానికి తెలియకపోయినా నేను ముద్దాయినని నా అంతరాత్మకు తెలుసు! నాకు శిక్ష పడవలసిందే!" నిద్రలో కలవరింతలు!

ఎవరు పరామర్శకు వచ్చినా "దయచేసి నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళండి, ప్లీజ్!" అంటూ చేతులు జోడించేవాడు.

ఆరోజు సాయంత్రం గోపాలరావుగారు వచ్చారు!

"పదిమందికి మంచీ చెడూ చెప్పవలసిన వాడివి! నువ్వే ఇలా అయిపోతే ఎలా? అమ్మ ఎంత బాధపడుతోందో చూడు!" అనునయంగా నిరంజనం భుజంమీద చేయివేశాడు.

ఆయన ఆప్యాయతకి నిరంజనం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "అలివేణిని నేనే చంపేశాను మామయ్యా! నేను నేరస్తుడిని!"

"నీ పిచ్చిగానీ నువ్వేం చేశావు? నీకూ అలివేణికి ఋణం తీరిపోయింది. తను వెళ్ళిపోయింది. అంతే! ఇలా ఎంత కాలం బాధపడుతూ ఇల్లు కదలకుండా కూర్చుంటావు?"

"నీకు తెలియదు మామయ్యా, నావల్లే అలివేణి చచ్చిపోయింది!"

"కాదు- ఆయుష్షు తీరింది- వెళ్ళిపోయింది! దానికి నువ్వేం చేస్తావు?"

"నాకు పిచ్చెక్కిపోయేలా వుంది. నన్ను నేను క్షమించుకోలేకపోతున్నాను" జుట్టు పీక్కున్నాడు నిరంజనం.

"అందుకే నిన్ను నలుగురిలోకి వచ్చి నీ పనులు నువ్వు చేసుకోమంటున్నాను. పోయిన వాళ్ళకోసం, బాధ్యతలు మరచి ఎన్నాళ్ళిలా బాధపడుతూ కూర్చుంటావు?"

"అనుక్షణం దుఃఖం వస్తోంది. బయటకు రావడానికి ధైర్యం చాలడం లేదు"

"దుఃఖాన్ని దిగమింగు... మనసుని నీ ఆధీనంలోకి తెచ్చుకో! ఈ రోజుల్లో ఆడవాళ్ళే ఎంతో ధైర్యంగా వుంటున్నారు. ఆ నీరజను చూడు..."

నీరజ పేరు వినగానే తుళ్ళిపడ్డాడు నిరంజనం. "ఏమయింది నీరజకు?"

"పదిహేను రోజుల క్రితం అనుకుంటాను. నీరజ స్కూలు నుంచి వెళ్ళగానే తల్లి బంగాళ దుంపల వేపుడు చేయమందట, టమాట పెరుగు పచ్చడి చేయమందట, మిరియాల చారు పెట్టమందట. రాత్రి ఎనిమిదింటికి తల్లీ కూతుళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేశారట. వాష్‌బేసిన్‌లో చేయి కడుక్కుంటూ పక్కకి ఒరిగిపోయిందంట తల్లి! చప్పున వెళ్ళి తల్లిని పట్టుకుందట నీరజ. అప్పటికే గుడ్లు తేలవేసిందట తల్లి- క్షణాల్లో ప్రాణం

## అన్న టైముకి రాడు, రాయడు



**ఒ**కరోజు ఆత్రేయ, దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు కలుసుకుని కబుర్లు చెప్పుకుంటున్నారు. మాటల సందర్భంలో ఆత్రేయ 'ఇక నేను అట్టేకాలం బతకను శ్రీనివాసరావ్! నాకు టైమయింది' అన్నారు.

దానికి సింగీతం వెంటనే 'పొండి సార్! మీరు నిక్షేపంగా నూరేళ్ళు బ్రతుకుతారు' అన్నారు.

'యమధర్మరాజుకీ తెలుసంటావా... ఆత్రేయ అన్నటైముకి రాయడు, అన్నటైముకి రాడు అని' అన్నారు ఆత్రేయ ఛలోక్తిగా.

పోయింది. నీరజకి ఎవరూ లేరు. వాళ్ళ మామయ్య వచ్చి తంతు పూర్తిచేసి వెళ్ళా డట. తను మళ్ళీ నిన్నటినుంచీ స్కూలుకి వస్తోంది! తప్పదు కదా! నీకు అమ్మా నాన్నా, చెల్లీ అందరూ ఉన్నారు. అయినా ఇలా అధైర్యపడితే ఎలా? కన్నవాళ్ళకోసం అయినా నువ్వు దుఃఖం దిగమింగక తప్పదు!" నిరంజనం భుజం నిమురుతూ అన్నారు గోపాలరావుగారు.

"ప్రయత్నిస్తాను మామయ్యా"

"ఆ మాట చాలు! నేను మళ్ళీ నాలుగు రోజుల్లో వస్తాను. ఈ ఇంట్లో మళ్ళీ మున పటి నిరంజనం కనిపించాలి నాకు" కాస్సేపు శారదమ్మతో మాట్లాడి వెళ్ళిపో యారు గోపాలరావుగారు!

నిరంజనం కళ్ళకి ఒంటరిగా నిలబడి వున్న నీరజ కనిపించింది.

"మీ అమ్మగారు ఇంటికి వచ్చిన నీరజను నాలుగు దులిపి పంపించింది!" చచ్చిపోయే రోజు సాయంత్రం అలివేణి అన్న మాటలు గుర్తుకు వచ్చాయి నిరంజనానికి.

"అమ్మా... అమ్మా... ఇలారా!" గది పైకప్పు ఎగిరిపోయేలా అరిచాడు నిరం జనం.

వంటింట్లో వున్న శారదమ్మ హడలి పోయి, కొడుకు గదిలోకి పరిగెత్తుకు వచ్చింది.

"ఎందుకంత గట్టిగా పిలిచావు? "

"ఒక మాట అడుగుతాను! నిజం చెప్పాలి!" సూటిగా అన్నాడు నిరంజనం.

"ఏ విషయం? అయినా ఏనాడయినా నీకు అబద్ధాలు చెప్పానా? "

"అలివేణితో పెళ్ళి జరగకముందు నీరజ మన ఇంటికి వచ్చిందా? "

"ఏ నీరజా? " శారదమ్మ మొహంలో గబగబ రంగులు మారాయి.

"తెలియనట్లు మొహం పెట్టకు- చినలిం గాయపాలెంలో టీచర్‌గా పనిచేసే నీరజ"

"వచ్చింది అన్నయ్యా!" ఆ మాటలు వింటున్న రాధ ముందు గదిలోంచి అంది.

"నువ్విలా రా!" కసిరినట్లుగా అన్నాడు నిరంజనం.

భయం భయంగా అన్నయ్య గదిలోకి వచ్చింది రాధ.

"ఎప్పుడు వచ్చిందీ? "

"ఈ సంవత్సరం మొదట్లోనే అనుకుం టాను. పగలు పదకొండు గంటల ప్రాంతంలో వచ్చింది" తల్లి మొహంలో చూస్తూ అంది రాధ.

"వచ్చి ఏమని చెప్పింది? "

శారదమ్మ, రాధ ఇద్దరూ నోరు తెరవ లేదు.

"చెప్పండి- జరిగిందేమిటో నాకు తెలి యాలి! ఇప్పటికయినా నిజం చెప్పండి" కోపంతో నిరంజనం మొహం జేవురిం చింది.

రాధ నేల చూపులు చూస్తూ "నువ్వు తనని కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటా నని అన్నావని చెప్పింది!"

"అవును- అన్నాను. దానికి మీరేం అన్నారు? "

రాధ భయంగా తల్లి మొహంలోకి చూస్తోంది. "అమ్మకేసి ఎంతసేపు చూస్తావు? జరిగింది చెప్పు" రాధ చేయి విసురుగా లాగాడు నిరంజనం.

"అమ్మ రెండు లక్షల కట్నం కావా లంది!"

"అలా అన్నావా, అమ్మా!" నమ్మలేన ట్లుగా అడిగాడు నిరంజనం.

"ఆ పిల్ల పెళ్ళయ్యాక వాళ్ళ అమ్మ తన తోపాటే వుంటుందని చెప్పింది. అలా కుద రదు అన్నాను! అంతే!" తన తప్పేమీ లేద న్నట్లుగా అంది శారదమ్మ.

"నీకు మొగుడూ కొడుకూ వున్నారు కాబట్టి ధీమాగా వున్నావు! నీరజ తల్లికి ఎవరూ లేరు! అందుకే నీరజ పెళ్ళయ్యాక

తల్లిని తనతోపాటే వుంచుకోవాలనుకుంది! అందులో తప్పేం వుంది? తనూ నెలనెలా సంపాదిస్తుందిగా! అయినా ఒక ముసలావిడకి గుప్పెడు అన్నం పెట్టలేని దుస్థితిలో వున్నామా మనం? పాపం ఆ ముసలావిడ రెండు వారాల క్రితమే పోయిందట! నీరజ మన ఇంట్లో గొడవలు జరగకూడదని ఈ విషయాలేమీ నాకు చెప్పకుండా, 'ఇప్పుడే పెళ్ళి చేసుకునే ఆలోచన లేదు' అని చెప్పి తప్పించుకుంది. తను ఎంత ఉత్తమురాలో అర్థం చేసుకోండి!" ఆవేశంగా అన్నాడు నిరంజనం.

శారదమ్మ తల దించుకుంది. "నీకు, ఆ అమ్మాయికీ రాసిపెట్టిలేదు, అంతే!"

"నాకూ నీరజకూ రాసిపెట్టిలేదు- నాకూ అలివేణికీ రుణం తీరిపోయింది! ఇక కన్నవాళ్ళ రుణం తీర్చుకోడానికే నేను బతికి వుండేది" విరక్తిగా నవ్వాడు నిరంజనం.

"అవేం మాటలురా? " కళ్ళనీళ్ళు నింపుకుంది శారదమ్మ.

★ ★ ★

ఇంటి ముందు జీపు ఆగిన శబ్దానికి ఇవతలకి వచ్చిన జాహ్నవి, మరుక్షణం లోపలికి వెళ్ళి, "ఎందుకో అల్లుడు వచ్చాడు" అంది ఫోన్ మాట్లాడుతున్న జనార్ధనంతో.

"రా, బావా!" అంది శ్రీవల్లి గుమ్మంలో నిలబడిపోయిన నిరంజనాన్ని చూస్తూ.

నిరంజనం నిశ్శబ్దంగా లోపలికి వచ్చి సోఫాలో కూర్చున్నాడు. చేతిలో వున్న లెదర్ బ్యాగ్ పక్కన పెడుతూ, "ఎలా వున్నారు? " అన్నాడు ఎవరినీ ఉద్దేశించకుండా.

ఇంతలో జీపు డ్రైవరు నాలుగు సూట్ కేస్‌లు తెచ్చి హాల్లో పెట్టి వెళ్ళాడు.

"మళ్ళీ అరగంటలో మాట్లాడతాను!" ఫోన్ డిస్‌కనెక్ట్ చేశాడు జనార్ధనం.

"ఇవన్నీ ఏమిటి అల్లుడూ? ".

"అలివేణి చీరలు" అన్నాడు సూట్ కేస్‌ల వైపు చూపిస్తూ.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

నిరంజనం లెదర్ బ్యాగ్ జనార్ధనం చేతికి ఇస్తూ, "ఇందులో మీరిచ్చిన కట్నం సొమ్ము మూడు లక్షలుంది! పదివేల వడ్డీతో మూడు లక్షల పదివేలు! లెక్క చూసుకోండి!" అన్నాడు.

"ఇదేమిటి అల్లుడూ? " జనార్ధనంకి అంతా అయోమయంగా వుంది.

"నాకూ అలివేణికీ రుణం తీరిపోయింది! మీ సొమ్ము మీకు తిరిగి ఇచ్చేయడం ధర్మం!"

"అది కాదు, అల్లుడూ! ఆ డబ్బుతో మీ చెల్లెలి పెళ్ళి..." అంటూ ఏదో అనబోయింది జాహ్నవి.

"మా చెల్లెలు పెళ్ళి సంగతి మేం చూసుకుంటాం! ఆ డబ్బు మీది"

"దానిని అలివేణికని ఇచ్చేసాం! ఇప్పుడు దాన్ని వెనక్కి తీసుకుని..." చీర కొంగుతో మొహం కప్పుకుంది జాహ్నవి.

"బాధపడకండి! ఆ డబ్బును అలివేణి పేరుమీద ఏదయినా మంచి పనికి ఖర్చు పెట్టండి. అలివేణికి మిమ్మల్ని దూరం చేసినందుకు నన్ను క్షమించండి!" రెండు చేతులూ జోడించాడు నిరంజనం.

"పాము కరిచి అక్క పోయింది. ఇందులో నీ తప్పేం వుంది బావా? " నిరంజనం కోసం మంచినీళ్ళు తీసుకువచ్చింది శ్రీవల్లి.

"లేదు- నా మీద కోపంతో బలవంతంగా పాముచేత కాటు వేయించుకుని చచ్చిపోయింది అలివేణి" గట్టిగా అరవాలనిపించింది నిరంజనానికి!

అయితే నిజం తెలిస్తే ఆ ఇంట్లో వాళ్ళ బాధ రెట్టింపు అవుతుంది! బతికినంత కాలం దుఃఖం వెంటాడుతూ వుంటుంది!

తను చేసిన పాపానికి ఏనాటికైనా శిక్ష తప్పదు. వాళ్ళని ఇంకా బాధించడం

అన్యాయం?

"వెళ్ళొస్తాను!" లేచాడు నిరంజనం.

అప్రయత్నంగా ముగ్గురూ వీధి గేటు దాకా వచ్చారు.

ఒంటరిగా జీపులో వెళుతున్న నిరంజనాన్ని చూస్తూ "అల్లుడు మంచివాడే! అలివేణికే అదృష్టం లేకపోయింది" గొణుక్కుంది జాహ్నవి.




తెల్లవారితే సెకండ్ సాటర్‌డే సెలవు! ఆ తరువాత ఆదివారం వుండనేవుంది. రెండు రోజులు ఇంట్లో ఒంటరిగా బోర్ కొట్టేస్తుంది!

ఆ శనివారం మాలకొండకి వెళదాం అనుకుంది నీరజ.

కందుకూరుకి యాభై కిలోమీటర్ల దూరంలో వున్న మాలకొండని మాల్యాద్రి అని కూడా అంటారు. అదొక నరసింహస్వామి క్షేత్రం! కేవలం శనివారాలు మాత్రమే తెరిచివుంటుంది. మిగతా రోజుల్లో దేవతలూ, ఋషులూ అదృశ్య రూపంలో స్వామిని సేవించుకుంటూ వుంటారని ప్రజల నమ్మకం! ప్రతీది 'కమర్షియల్' అయిపోయిన ఈ రోజుల్లో ఇంకా పురాతన నమ్మకాలకీ, విశ్వాసాలకి విలువ ఇస్తూ, దేవస్థానాన్ని కేవలం శనివారం మాత్రమే తెరచి వుంచటం అబ్బురం అనిపించింది నీరజకి! ఆరేళ్ళ క్రితం తల్లితో వెళ్ళింది. మళ్ళీ వెళ్ళలేదు!

చుట్టూ పచ్చటి అడవి, భూదేవి అలంకరించుకున్న మాలలా కొండల వరుస! అందులో ఒక కొండమీద వుంది నరసింహస్వామి గుడి! ఏదో విషయంలో స్వామి మీద అలిగి అమ్మవారు పెద్ద కొండలాంటి బండను చీల్చుకుని పైకివెళ్ళి అక్కడ వెలిశారట! నిజంగా ఆ పెద్ద బండరాయి నిట్ట నిలువుగా చీల్చినట్లుంటుంది! ఆ సందులో ఒక మనిషి మాత్రం పట్టే వీలు! పైకి మెట్లు! అక్కడి కొండలు, పచ్చటి ప్రకృతి నీరజను ఎంతగానో ఆకర్షించాయి.

అయితే తల్లి ఆరోగ్యం బాగులేక ఇన్నాళ్ళూ మరోసారి వెళ్ళడం కుదరలేదు.

శనివారం లేస్తూనే తలంటుస్నానం చేసింది నీరజ.

పులిహోర చేసి క్యారేజీలో సర్దింది! చిన్న బుట్టలో ఆ క్యారేజీతోపాటు మంచి నీళ్ళ బాటిల్ కూడా పెట్టింది. ఫ్రిజ్‌లో కనబడిన క్రీమ్ బిస్కట్ ప్యాకెట్ బుట్టలో వేసింది!

సాయంత్రందాకా ప్రశాంతంగా మాల్యాద్రిమీద గడిపి రావాలి. బస్సు మాలకొండను చేరేసరికి పదకొండు కావస్తోంది. ఆకాశం అంతటా నల్లని మేఘాలు కమ్ముకున్నాయి. గాలి చల్లగా వీస్తోంది! ఆ ఆహ్లాదకర వాతావరణంలో నరసింహస్వామి దర్శనం చేసుకుంది నీరజ.

తరువాత చీలినకొండ మధ్యగా పైకి వెళ్ళి అమ్మవారికి దండం పెట్టుకుంది.

పైనుంచి చూస్తుంటే కనుచూపు మేరంతా ఆకుపచ్చ జంబుఖానా పరచినట్లుంది! దాని మధ్యలో గీత గీసినట్లు కనిపిస్తున్న కంకరరోడ్డు అడపాదడపా ఆ రోడ్డుమీద మొగిలిచెర్లకేసి వెళుతున్న మోటారు సైకిళ్ళు జీపులు! ప్రకృతి అందాలను చూస్తూ అక్కడే ఒక బండరాయి మీద కూర్చుంది నీరజ.

"పాతికేళ్ళ నీ కోరిక తీరింది కదా! ఇక వెళదాం, పద నాన్నా!" వెనకవైపు నుంచి మాటలు వినిపించి, ఆసక్తిగా తిరిగిచూసింది నీరజ.

కొద్దిదూరంలో మరో బండరాయిమీద ఒక డెబ్బై ఏళ్ళ ముసలాయన కూర్చుని వున్నాడు. ఒక ముప్పయ్యేళ్ల యువకుడు ఆయనకు చేయి ఆసరా ఇచ్చి, తీసుకు వెళ్ళాలని చూస్తున్నాడు.

"లేవలేనురా, శ్రీధర్!" ముసలాయన గొంతు నీరసంగా వినిపిస్తోంది.

"అదేం, ఇప్పటిదాకా బాగానే వున్నావుగా!" ఆందోళనగా అన్నాడు శ్రీధర్.

"ఒళ్ళంతా చమటలు పడుతున్నాయి. గుండె దడగా వుంది. కళ్ళు తిరుగుతున్నట్లు అనిపిస్తోంది.

"బాప్‌రే! షుగర్ డౌన్ అయినట్లుంది. ఇప్పుడెలా? దర్శనం అయితేనే గానీ ఏమీ తిననంటూ ఖాళీ కడుపుతో బయలుదేరావు! షుగర్ ఉన్నవాళ్ళు ఎవరి ఆరోగ్యం వాళ్లు చూసుకోకపోతే ఎలా? ఇంకా చిన్నపిల్లవాడిలా ప్రవర్తిస్తావు! జాగ్రత్తగా కూర్చునివుండు! కింద ఏదయినా స్వీట్ దొరుకుతుందేమో చూసివస్తాను" హడావిడిగా వెళ్లిపోతున్న శ్రీధర్‌ని ఆపింది నీరజ.

"నా దగ్గిర క్రీమ్ బిస్కెట్ ప్యాకెట్ వుంది, పనికి వస్తుందా?"

"అది మీ కోసం తెచ్చుకున్నారు!" మొహమాటంగా అన్నాడు శ్రీధర్.

"ఫరవాలేదు. షుగర్ మరీ డౌన్ అయిపోతే ప్రమాదం కదా! ముందు ఆయనకి బిస్కెట్లు పెట్టండి!" స్కూల్లో ఒకసారి రంగరాజు సార్ షుగర్ డౌన్ అయి పడిపోవడం, నాలుగు రోజులు ఒంగోలు హాస్పిటల్‌లో కోమాలో వుండటం గుర్తుకు వచ్చింది నీరజకి!

శ్రీధర్ తటపటాయిస్తూవుంటే తనే చొరవగా బిస్కెట్ ప్యాకెట్ ఓపెన్ చేసి, నాలుగు బిస్కెట్లు శ్రీధర్ తండ్రిచేత తినిపించి, బాటిల్‌లో వాటర్ తాగించింది!

"మా నాన్న రంగనాథం. ఆరోగ్యం గురించి అస్సలు పట్టించుకోడు" ఫిర్యాదు చేస్తున్నట్లుగా అన్నాడు శ్రీధర్.

"ఇలా దూరంగా వస్తున్నప్పుడు చాక్లెట్లో, స్వీట్లో వెంట తెచ్చుకోవాలి కదా!"

నీరజ నవ్వి వూరుకుంది.

పది నిముషాల్లో రంగనాథం తేరుకున్నాడు. "సమయానికి దేవతలా ఆదుకున్నావు. నీ పేరేమిటమ్మా!" నీరజనే పరికించి చూస్తూ అన్నాడు రంగనాథం.

"నీరజ"

"ఒక్కదానివే వచ్చావా?"

"అవును"

"ఈ వూరేనా?"

"కాదు కందుకూరు"

"మీ వాళ్ళు..."

"నాకెవరూ లేరు. టీచర్‌గా పనిచేస్తున్నాను!" ఆ మాటలు అంటున్నప్పుడు గొంతు రుద్ధం అయింది నీరజకి! నెల క్రితం వరకూ 'నేనూ అమ్మా వుంటున్నాం' అని చెప్పిన తను ఇప్పుడు అందరికీ ఒంటరినని చెప్పుకోవలసి వస్తోంది! శ్రీధర్ దేవస్థానం ఆఫీసులో పూజలకి డబ్బు కట్టడానికి వెళ్లాడు.

రంగనాథం పిచ్చాపాటీ మాట్లాడుతూనే తమ గురించి చెప్పాడు! తండ్రికి ఒంగోల్‌లో చిన్న హోటల్ వుండేదిట! అది

## కొత్తగాలి...

**తల్లికి దినోత్సవం**
**తల్లి పాలకు వారోత్సవం**
**ఆమెకు కరువైంది**
**పుత్రోత్సాహం**

*–లలితా మానస, బెంగుళూరు*

దివాలా తీయడంతో యాభైయ్యవ ఏట ఆ బెంగతో ఆయన పోయాడట! చాలామంది చుట్టాలు రాజమండ్రిలో వున్నారుట! ఒక ఫ్రెండ్‌తో కలిసి రాజమండ్రిలో క్లాత్ బిజినెస్ చేస్తూ, మెల్లిమెల్లిగా కుటుంబాన్ని పైకి తీసుకువచ్చాడట! భార్య పదిహేనేళ్ళ క్రితమే పోయిందట! శ్రీధర్ ఒక్కడే కొడుకు! శ్రీధర్‌కి ఇప్పుడు రాజమండ్రిలో ఎ.సి.క్లాత్ షాప్‌తో పాటు చిట్‌ఫండ్ కంపెనీ కూడా వుందట. లంకంత కొంపలో తండ్రీ కొడుకులిద్దరు, పనివాళ్ళు నలుగురు వుంటారట! ఎంత చెప్పినా శ్రీధర్ పెళ్ళికి ఒప్పుకోవడం లేదట! ఆయన పెళ్లయిన కొత్తలో భార్యను తీసుకుని ఒంగోలు నుంచి మాలకొండకే వచ్చాడట! చచ్చిపోయే లోపల మళ్ళీ మాలకొండ చూడాలని కోరికట! కొడుకుకి బిజినెస్ పనిలో తీరదట! ఎన్నేళ్ళుగానో పోరు పెడుతూవుంటే ఇప్పుడు కందుకూరు తీసుకువచ్చాడట! రంగనాథం అక్క మనమరాలి పెళ్ళట! తండ్రీకొడుకులు కందుకూరు నుంచి టాక్సీ చేసుకుని వచ్చారట!

"నలభై ఏళ్ళ క్రితం నువ్వు కూర్చున్న బండరాయి మీదనే కూర్చుని, నా భార్య పులిహోర పెట్టింది నాకు!" గతాన్ని గుర్తు చేసుకున్నాడు రంగనాథం.

"ఇక వెళదామా" ఆఫీసులో డబ్బు కట్టి శ్రీధర్ వచ్చాడు.

"వెళుదురుగానీ! ముందు కొద్దిగా పులిహోర తినండి! ఆ పక్కనే వున్న మూడు అరటి ఆకులు తుంచుకు వచ్చింది నీరజ.

"వద్దండీ... మీరు తెచ్చుకున్నవి అన్నీ..." ఇబ్బందిగా వుంది శ్రీధర్‌కి.

"చాలానే తెచ్చాను. మీరు మొహమాట పడవద్దు!" పులిహోర మూడు ఆకుల్లో సర్దింది నీరజ.

ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ పులిహోర తిన్నారు.

"పులిహోర అద్భుతంగా వుంది" మెచ్చుకున్నాడు రంగనాథం.

"అదేం లేదు! మీరు మంచి ఆకలిమీద వున్నారు!" నవ్వింది నీరజ.

"నువ్వు కందుకూరుకే వెళ్ళాలి కదా! మాతో టాక్సీలో వచ్చేయి!" అన్నాడు రంగనాథం, శ్రీధర్ చేయి పట్టుకుని లేస్తూ.

"లేదండీ- నేను సాయంత్రందాకా ఇక్కడే గడపాలని వచ్చాను. మీరు వెళ్ళండి" ఈ మధ్య ఇంటికి ఎంత ఆలస్యంగా వెళితే అంత మంచిదని అనిపిస్తోంది నీరజకి.

"మీ టైమ్‌లీ హెల్ప్‌కి థాంక్స్!" వెళ్ళిపోయేముందు చిన్నగా అన్నాడు శ్రీధర్.

"వెళ్ళొస్తాను నీరజా! నీ బిస్కట్లూ, పులిహోర జన్మలో మరచిపోలేను!" చేయి ఊపుతూ, కొడుకు వెనకే చిన్నగా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు రంగనాథం.

చుట్టూ కిచకిచలాడుతూ కోతులు, గుంపులుగా ఎగిరే చిలుకలు, పిచ్చుకలు! సాయంత్రం దాకా అక్కడే కూర్చున్న నీరజకు తను ఒంటరిదన్న ఆలోచనే రాలేదు!

★ ★ ★

ఆదివారం మధ్యాహ్నం భోజనం చేసి పడుకుంది నీరజ!

నిద్ర లేచేసరికి ఐదయింది!

టీ పెట్టుకుని తాగి, ముందు గదిలో పేపర్లు సర్దుతూ వుంటే ఆ వెడ్డింగ్ కార్డు కనిపించింది! క్లాస్‌లో ఫస్ట్ వచ్చే సందీప్ అన్నయ్య వెడ్డింగ్ కార్డ్ అది! సందీప్ తల్లిదండ్రులు స్కూలుకు వచ్చి స్టాఫ్‌నందరినీ పిలిచారు! పెళ్ళి కందుకూరులో.

ఆ పెళ్ళిని నీరజ లైట్‌గా తీసుకుందామనుకుంది!

అయితే సుగుణ ఊరుకోలేదు. "ఈ పల్లెల్లో మనకి ఇంతకి మించి కాలక్షేపాలు ఏమున్నాయి? ముహూర్తం ఎనిమిదిన్నరకి! భోజనాలు చేశాక వెనక్కి రావడానికి బస్సులు దొరకవు! రాత్రికి మీ ఇంట్లో

వుండిపోతాను! తెల్లవారి ఇద్దరం తిన్నగా స్కూలుకి వచ్చేద్దాం!" అంది.

మొహమాటానికి సరే అనక తప్పలేదు నీరజకి!

ఇప్పుడు కార్డు కనిపించకపోయివుంటే తనకి పెళ్ళి సంగతే గుర్తుకొచ్చేది కాదు!

టైమ్‌చూస్తే ఆరున్నర- సుగుణ ఏడున్న రకల్లా కళ్యాణ మండపం దగ్గిర వుంటా నంది!

పేపర్లు పక్కకు పెట్టి వెంటనే వెళ్ళి స్నానంచేసి వచ్చింది. వైలెట్ కలర్ పోచెం పల్లి సారీ మీద సింపుల్‌గా వుండే ముత్యా లదండ వేసుకుని బయటకు వచ్చి ఇంటికి తాళం పెట్టింది నీరజ.

"నీరజా ఎక్కడికి వెళుతున్నావ్? టమాటా పచ్చడి చేసాను!" బాల్కనీలోంచి కేక పెట్టింది రత్నం.

"ఒక విద్యార్థిఅన్న పెళ్ళికి! పచ్చడి రేపు తీసుకుంటాను!" అంది కిందనుంచే నీరజ.

"వెళ్ళమ్మా, ఎంతసేపని ఇంట్లో కూర్చుని టీవీ చూస్తావ్? "

బయట ఆకాశం మబ్బు పట్టి వుంది! దగ్గరలోనే వర్షం కురుస్తున్నట్లుగా మట్టి వాసనతో చల్లటి గాలి!

కనిపించిన ఆటో ఎక్కేసింది నీరజ!

కళ్యాణ మండపం చేరుకునేసరికి ఏడు న్నర!

నీరజ ఆటో దిగేసరికి హోరుమంటూ గాలి.

రంగురంగుల లైట్లతో మెరిసిపోతోంది కళ్యాణ మండపం! లోపల జనం హడావి డిగా తిరుగుతున్నారు. విశాలమైన ఆవర ణకి రెండు గేట్లు!

ఆటోవాడి చేతిలో ఇరవై రూపాయల నోటు పెట్టి కళ్యాణ మండపం ఆవరణ లోకి అడుగుపెట్టింది నీరజ, సుగుణ కోసం చుట్టూ చూస్తూ!

రివ్వున వీస్తున్న గాలికి తలలో గులాబీ ఎటో ఎగిరిపోయింది. చప్పున రెపరెపలా డుతున్న పమిట కొంగును భుజం చుట్టూ కప్పుకుంది నీరజ!

నాలుగు అడుగులు వేయగానే, పైనుంచి కరెంట్ తీగ గాలికి తెగి, కళ్యాణ మండపం ఆవరణలో పడింది!

ఉలిక్కిపడి నాలుగు అడుగులు వెనక్కి వేసింది నీరజ!

రెండో గేటులోంచి ఒకాయన ఆ విషయం గమనించకుండా మంటపంలోకి వెళుతున్నాడు.

"ఏమండీ, ఆగండి! కరెంట్ తీగ తెగి పడి ఉంది. ప్రమాదం" గట్టిగా అరిచింది నీరజ.

గాలిహోరులో ఆ మాటలు ఆయనకి వినిపించినట్టు లేదు!

నీరజ పరిగెత్తుకు వెళ్ళి ఆయన చేయి పట్టుకుంది- లేకపోతే ఆయన అడుగు కరెంట్ తీగమీద పడి వుండేదే!

"కరెంట్ తీగ ఇప్పుడే తెగిపడింది" చూడండి అన్నట్లుగా వేలితో నేల వైపు చూపించింది నీరజ.

"ఏమయింది!" వెనకే వచ్చిన శ్రీధర్‌ను చూసి తను పట్టుకున్నది రంగనాథాన్ని అని అర్థం అయిపోయింది నీరజకి!

"మీరా? మీరు ఈ పెళ్ళికి వచ్చారా? " ఆశ్చర్యపోయింది నీరజ.

"మేం రాజమండ్రి నుంచి ఈ పెళ్ళికనే వచ్చాం!"

శ్రీధర్ ఆ మాట అంటూండగానే కళ్యాణ మండపంలో కరెంట్ పోయింది. చుట్టూ చీకటి, పిల్లల కేకలు, ఈలలూ!

"థ్యాంక్ గాడ్- ఈ ప్రమాదం తప్పింది. ముందీ తెగిన తీగ పక్కకు తప్పించాలి" అంది నీరజ.

శ్రీధర్ లోపలికి వెళ్ళి ఎవరినో పిలుచు కుని వచ్చాడు. అతను వెళ్ళి పదినిము షాల్లో ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్ వాళ్ళను

తీసుకువచ్చాడు! వాళ్ళు ఆ తీగను పక్కకి లాగేసిన పావుగంటకి కరెంట్ వచ్చింది.

అప్పటిదాకా అక్కడే నిలబడి వున్నారు ముగ్గురూ.

"నీరజా నీ రుణం తీర్చుకోలేను. మాల కొండ మీద ఒకసారి, ఇక్కడ ఒకసారి..." రంగనాథంకి నోరు పెగలడం లేదు.

"అంతా కాకతాళీయం" నవ్వింది నీరజ.

ఇంతలో వర్షం మొదలయింది!

"లోపలికి వెళదాం పదండి!" రంగనాథం వెనకే శ్రీధర్, నీరజ కదిలారు!

నీరజ కళ్ళు సుగుణ కోసం ఆవరణ అంతా వెతికాయి!

ఎక్కడా సుగుణ కనిపించలేదు.

గోపాలరావుగారు, రంగరాజు దూరంగా మగవాళ్ళ మధ్య కూర్చుని వున్నారు.

సుగుణ వస్తే తేలికగా కనిపిస్తుందని వెనక వైపు ఖాళీగా వున్న కుర్చీల్లో కూర్చుంది నీరజ!

తండ్రిని చుట్టాల మధ్య కూర్చోబెట్టి, నీర జను వెతుక్కుంటూ వచ్చాడు శ్రీధర్!

నీరజ పక్క కుర్చీ కొంచెం దూరంగా జరుపుకుని కూర్చున్నాడు.

"మీ వాళ్ళందరూ మీ కోసం చూస్తూ వుంటారు" మొహమాటంగా అంది నీరజ.

"నేను జ్ఞానం వచ్చాక కందుకూరు రాలేదు. మా అత్తయ్య, మధు బావ ఇద్దరే తెలుసు నాకు! పెళ్ళికూతురిని కూడా ఇదే చూడటం!" నవ్వాడు శ్రీధర్.

"ఇంత దూరం వచ్చారు- ఇప్పుడయినా అందరినీ పరిచయం చేసుకోండి"

"అత్తయ్య అందరినీ పరిచయం చేసింది. అయినా ఎందుకో ఎవరూ చను వుగా పక్కన కూర్చుని మాట్లాడటంలేదు. నాన్న మాత్రం యమబిజీ!"

"నా అన్న మనుషులు వుండటం ఎంత అదృష్టం!" చిన్నగా అంది నీరజ.

"అదేం, అలా అన్నారు?"

"నాకెవరూ లేరు. పేరుకి మామయ్య

## కొత్తగాలి...

**నేలను రాలిన ఆకులు**
**వృద్ధులూ ఒకటేనా?**
**మది తొలిచే ప్రశ్న**
**???**

-యలమర్తి అనూరాధ, పెనుగొండ

వున్నాడు. క్రితంనెల అమ్మ పోయినప్పుడు వచ్చాడు, అంతే!" నీరజ కంఠం రుద్ధం అయింది.

"అయాంసారీ- మిమ్మల్ని బాధపెట్టినట్లు న్నాను!"

"అదేంలేదు!" కర్చీఫ్‌తో కళ్ళు తుడుచు కుంది నీరజ.

"నేను మాత్రం చుట్టాలకి చాలా దూరం! నాకు నాన్న, నాన్నకి నేను, అంతే!'
'

అతని పర్సనల్ విషయాల పట్ల ఆసక్తి లేని నీరజ, సుగుణ వస్తుందేమో అని మాటిమాటికి గుమ్మంకేసి చూస్తోంది!

ఎనిమిదిన్నర కావొస్తోంది.

మాంగల్యధారణ జరుగుతున్నట్లుగా భజంత్రీలు మోగాయి.

"పెళ్ళిళ్ళల్లో పెళ్లితంతు చూసేవారే కరు వయ్యారు. ఏదో మొక్కుబడిగా రావడం, పక్కవాళ్ళతో కబుర్లు చెబుతూ కూర్చోడం, అక్షింతలు చల్లడం, విందు ఆరగించి వెళ్ళడం!" అప్పటిదాకా కబుర్లు చెప్పు కుంటూ, అక్షింతలు వేయడానికి గుంపులు గుంపులుగా మండపంకేసి వెళుతున్న జనా లను చూస్తూ అంది నీరజ. "అఫ్‌కోర్స్- మనం చేస్తున్న పనికూడా అదే!" నవ్వింది పల్చగా.

"మేడం, మీరొక్కరే ఇక్కడ వున్నారా?

గోపాల్‌రావు సార్ మిమ్మల్ని, సుగుణ మేడమ్‌ని తీసుకుని రమ్మన్నారు!" సందీప్ మరో ఇద్దరు ఫ్రెండ్స్‌తో నీరజ దగ్గరికి వచ్చాడు.

"సుగుణా మేడమ్ వచ్చినట్లు లేదు" మరోసారి చుట్టూ చూస్తూ అంది సరోజ.

"మీరు రండి మేడమ్" నీరజకి అడ్డంగా వున్న కుర్చీ జరుపుతూ అన్నాడు సందీప్.

"వెళ్ళొస్తాను శ్రీధర్‌గారూ! మా హెచ్.ఎమ్.గారు రమ్మంటున్నారట!" లేచింది నీరజ.

తల ఊపాడు శ్రీధర్!

జనం మధ్యలోంచి నీరజని ఇంచుమించు స్టేజీదాకా తీసుకువెళ్ళాడు సందీప్.

"రా, అమ్మా! నీ కోసమే చూస్తున్నా!" చేతిలో గిఫ్ట్‌ప్యాక్‌తో ఒక పక్కగా నిలబడి వున్నారు గోపాలరావుగారు. ఆయన పక్కనే రంగరాజు.

"వర్షం కదా! సుగుణా మేడమ్ రాలేదనుకుంటాను!" అన్నాడు రంగరాజు!

ముగ్గురూ వెళ్ళి పెళ్ళికొడుకుని విష్‌చేసి, గిఫ్ట్ చేతిలో పెట్టారు.

సందీప్ తల్లిదండ్రులు మరోసారి వాళ్ళ దగ్గరకు వచ్చి "డిన్నర్ రెడీ! భోజనం చేసి వెళ్ళండి!" అన్నారు నవ్వుతూ.

సందీప్ డైనింగ్‌హాలుకు దారి చూపించాడు.

"ఇప్పుడు చినలింగాయపాలెం వెళ్ళడానికి బస్సులు లేవేమో!" డిన్నర్ అయి బయటకు వస్తున్నప్పుడు అంది నీరజ.

"ఇద్దరం రంగరాజు స్కూటర్‌మీద వచ్చేశాం! వర్షం తగ్గిందిగా! నెమ్మదిగా వెళ్ళిపోతాం!" ఆవరణలో నిలిచిన వాననీటిని చూస్తూ అన్నారు గోపాలరావుగారు "మీరెలా వెళతారు? "

"ఆటోలో వెళ్ళిపోతాను"

"ఇంటిదాక రమ్మంటారా? " స్కూటర్ స్టార్ట్ చేస్తూ అన్నాడు రంగరాజు.

"మా ఊళ్ళో నాకు భయం ఏమిటి? " నవ్వింది నీరజ.

వాళ్ళు వెళ్ళగానే ఆవైపు వచ్చిన రిక్షా ఎక్కేసింది నీరజ.

★ ★ ★

సంక్రాంతి సెలవులు అయిపోయాయి!

మళ్ళీ స్కూళ్ళు తెరిచారు!

ఆ సాయంత్రం స్కూల్ నుంచి రోడ్డు మీదకు వచ్చి బస్టాండులో నిలబడింది నీరజ!

క్రితం రాత్రి వర్షానికి రోడ్డంతా రొచ్చు రొచ్చుగా వుంది. మళ్ళీ ఆకాశంలో మేఘాలు కమ్ముకుంటున్నాయి. వర్షం వచ్చేలా ఉంది. బంగాళాఖాతంలో వాయుగుండమట!

బస్సుస్టాండ్‌లో జనం పల్చగా ఉన్నారు. ఎదురుగా ఉండే పాకహోటల్‌లో బజ్జీల బిజినెస్ మంచి ఊపులో ఉంది.

ఆ వైపుకే చూస్తున్న నీరజ, తన పక్కనే టాటా ఇండికా కారు వచ్చి ఆగడంతో ఉలిక్కిపడింది.

కారు విండోగ్లాస్ దింపుతూ... "ఎలా ఉన్నారు? నన్ను గుర్తుపట్టారా? " అన్నాడు శ్రీధర్.

"మీరా? ఇలా వచ్చారేమిటి? నాన్నగారెలా వున్నారు? " రెండు అడుగులు కారు వైపు వేసింది నీరజ.

"అన్ని సంగతులూ చెబుతాను. ముందు కారెక్కండి. మీ కోసం స్కూలుకెళ్ళి వస్తున్నాను" డోర్ తీస్తూ అన్నాడు శ్రీధర్.

"నా కోసమా? " ఆశ్చర్యపోయింది నీరజ.

"ఎందుకూ? ? "

ఇంతలో చిన్నగా వర్షం ఆరంభమయింది.

"ప్రశ్నలు తరువాత. తడిసిపోకుండా కారెక్కండి" కంగారు పెట్టాడు శ్రీధర్.

"నేను వెళుతున్నదీ కందుకూరుకే!"

నీరజ ఇబ్బందిగా ఫీల్ అవుతూనే కారెక్కింది.

ఆ బురద రోడ్డుమీద చిన్నగా కదిలింది కారు. విండోస్ క్లోజ్ చేసి ఏ.సి. వేశాడు శ్రీధర్.

కారు ఊరు వదిలి మూడు కిలోమీటర్లు వచ్చింది.

"నాన్నగారు ఎలా వున్నారు? " ముందు తనే నోరు విప్పింది నీరజ.

"ఏమీ బాగాలేరు"

"అరే, ఏమయింది? " కంగారుగా అడిగింది నీరజ.

"ఆ పెళ్ళి నుంచి వెళ్ళిన రెండు నెలలకే పెరాలిసిస్ వచ్చింది. మాట కూడా పడిపోయింది. మనిషి దక్కడమే అనుమానం అన్నారు. ఇప్పుడు కాస్త నయం! మాట వచ్చింది. కుడి కాలూ, చేయీ స్వాధీనంలోకి వచ్చాయి. ఇంకా ఒక మనిషి వచ్చి అన్నీ చేయిస్తాడు. అప్పటి మొక్కు తీర్చుకోడానికే తిరుపతి వెళ్ళి, తిరుగు ప్రయాణంలో ఇలా వచ్చాను. రోడ్డుకి అడ్డంగా నాలుగు గేదెలు పరిగెత్తుకుని రావడంతో సడెన్ బ్రేక్ వేశాడు శ్రీధర్.

నీరజ ఆలోచనలో పడింది. ఇంత వర్షంలో శ్రీధర్ పనిగట్టుకుని తన కోసం ఎందుకు వచ్చాడు? తను ముందూ వెనక ఆలోచించకుండా కారు ఎక్కేసింది. రోడ్డు మీద జనసంచారం కూడా లేదు. రాజారావు అనుభవంతో మగాళ్ళతో ఒంటరిగా మాట్లాడటానికే భయం వేస్తోంది!

ఆరోజు సడన్‌గా గుర్తొచ్చింది నీరజకి.

టీవీలో ఏదో గేమ్‌షో చూస్తుండగా కాలింగ్‌బెల్ మోగింది. రత్నం ఆంటీ వచ్చి ఉంటుందని తలుపు తీసింది తను.

గుమ్మంలో నలభైఏళ్ల వ్యక్తి.

"ఎవరు కావాలి? " వెంటనే గుర్తుపట్టలేకపోయింది నీరజ.

అతను లైటు వెలుగులోకి వచ్చాక, వీధి చివర ఉండే రాజారావుగా గుర్తించిందామె. రాజారావు ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌లో పని చేస్తుంటా డు. అతని భార్య నళిని రోజులో ఎక్కువసేపు గేటుదగ్గరే నిలబడి ఉంటుంది. నీరజ స్కూలుకు వెళ్లేటపుడు, వచ్చేటపుడు పలకరిస్తుంటుంది. వాళ్లకి ఇద్దరూ ఆడపిల్లలే. తను రోడ్డుమీద ఎక్కడ కనబడినా నమస్తే చెబుతుంటారు ఆ పిల్లలు.

"మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తే సారీ మేడమ్" అన్నాడు రాజారావు చొరవగా లోనికి వచ్చి కుర్చీలో కూర్చుంటూ.

"అదేం లేదు. సెలవలు కదా బోర్ కొట్టేస్తోంది. అమ్మ వున్నపుడు నాన్‌స్టాప్‌గా కబుర్లు చెబుతూ ఉండేది" తల్లి పోయినపుడు రాజారావూ, నళిని వచ్చి తనని పరామర్శించి వెళ్లడాన్ని దృష్టిలో పెట్టుకుని అంది నీరజ.

"అందుకే ఫైనల్ ఎగ్జామ్స్ వచ్చేదాకా మా పిల్లలకి ట్యూషన్ చెబుతారేమోనని..."అన్నాడు రాజారావు.

ఆ ఆలోచన బావున్నట్లేననిపించింది నీరజకి.

"అలాగే..."అంది నీరజ. వచ్చిన విషయం అయిపోయినా ఇంకా కదలకుండా రాజారావు కూర్చోవడం ఇబ్బందిగా అనిపించిందామెకు.

"కొంచెం కాఫీ తీసుకుంటారా? " మర్యాదకోసం అడిగింది.

"మంచినీళ్లు ఇవ్వండి చాలు..."

మంచినీళ్ల గ్లాసు అందిస్తుంటే రాజారావు కావాలనే తనకి వేళ్లు తాకించినట్లు అనిపించింది నీరజకి.

"మీచేతితో అందించిననీళ్లు కొబ్బరినీళ్లలా తీయగా ఉన్నాయి..."తాగిన గ్లాసు చేతికందిస్తూ మళ్లీ వేళ్లు తాకించాడు రాజారావు.

ఆ నవ్వులోని వెకిలితనం నీరజకు కోపం

తెప్పించింది.

"నేను చదువుకోవాలి!" ఇక మీరు వెళ్లండన్నట్లుగా చెప్పింది నీరజ.

"జీవితం అంతా చదువుకోవడం లేదా చదువు చెప్పడం... అంతేనా? జీవిత మధురిమలు రుచి చూడాలని ఆశగా లేదా మీకు? మా ఆవిడ నాలుగు రోజులు పుట్టింటికి వెళితేనే తట్టుకోలేకపోతుంటాను నేను. ఇన్నేళ్లూ పెళ్లిలేకుండా...ఎటువంటి ఆనందం లేకుండా..."

రాజారావు తన ఇంటికి వచ్చి అంత అసభ్యకరంగా మాట్లాడతాడని ఉహించని నీరజ నిర్ఘాంతపోయింది. తక్షణం తేరుకుని-"షటప్! నా పర్సనల్ విషయాలు మీకు అనవసరం. ఇక మీరు దయచేయండి. మీ పిల్లలకి ట్యూషన్ కూడా చెప్పేది లేదు. గెటౌట్" గుమ్మంవేపు వేలు చూపిస్తూ అరిచింది నీరజ.

"ఒంటరిగా ఉన్న ఆడవాళ్లని చూస్తే ఈ మగాళ్ల కెంత తేలికో? " అనుకుంటూ తలుపు వేసేసింది నీరజ.

"ఏమిటాలోచిస్తున్నా రు? " శ్రీధర్ పిలుపు తో ఈ లోకంలోకి వచ్చి పడి ంది నీరజ.

"ఏమీ లేదు. ఏమీ లేదు" కంగారుగా అంది నీరజ.

"నేనేం చెప్పాలనుకుంటున్నానో ఊహించారా? "

"లేదు"

"ఊహించండి. చూ ద్దాం"

"అంత ఓపిక లేదు"

"ఓపికంతా పొద్దున్న నుంచీ పిల్లలతో వేగడంతో కరిగిపోయిందా? "

"అదేం లేదు. పిల్లలతో గడపడంలో నాకు లేని ఓపిక వస్తుంది. ఉత్సాహం పుడుతుంది. పిల్లలకి చదువు చెప్పడం ఎంజాయ్ చేస్తాను నేను. కేవలం టీచర్ వృత్తిలో ఉన్నవాళ్ళకే కొన్ని వందల మంది స్టూడెంట్స్‌కి దిశానిర్దేశం చేసిన తృప్తి ఉంటుంది. ఐ లవ్ మై ప్రొఫెషన్"

"మీ వృత్తి పట్ల మీకున్న అంకిత భావానికి హేట్సాఫ్. మిమ్మల్ని చూడగానే మీరు సిన్సియర్ వ్యక్తులని గ్రహించవచ్చు"

"మీ అభినందనలకి థాంక్స్"

ఎవరో వచ్చి గేదెలను పక్కకు తరిమారు. బయట వర్షం కుండపోతగా కురుస్తోంది. సన్నటి గతుకుల రోడ్డు మీద నిదానంగా పోతోంది కారు.

"నా మీద మీ అభిప్రాయం ఏమిటి? " హఠాత్తుగా అడిగాడు శ్రీధర్.

తుళ్ళిపడింది నీరజ! జవాబు ఏం చెప్పాలో తోచలేదు. కారులో గాలి ఆడనట్లుగా ఉక్కిరి బిక్కిరి అనిపిస్తోంది.

"చెప్పండి. మొహమాటం వద్దు!"

## "ప్రౌఢ్ కవి"

ప్రముఖ నటులు జగ్గయ్య అనువదించిన 'రవీంద్రగీతం' చదివి 'జగ్గయ్యగారికి భాష మీద మంచి అధికారముంది. ఆయన ప్రౌఢకవి' అన్నారు రచయిత పైడిపాల.



వెంటనే ఆత్రేయ అందుకొని-

'అవునవును. జగ్గయ్య మనకు ప్రౌడ్(గర్వకారణమైన) కవి' అన్నారట చమత్కారంగా.

"మీరు... మీరు... మితభాషి... ఎవరి విషయంలోనూ కల్పించుకోరు..."

శ్రీధర్ కాస్సేపు ఏమీ మాట్లాడలేదు.

"నాన్న తన ఆఖరి కోరిక తీర్చమంటూ గొడవ చేస్తున్నాడు" తను చెప్పాలనుకున్న దానికి ఉపోద్ఘాతంగా అన్నాడు శ్రీధర్.

"ఏమిటి ఆయన కోరిక! అయినా ఆరోగ్యం కుదుటపడుతోంది కదా! ఆఖరి కోరికంటూ అపశకునం మాటలు ఎందుకు?" తల్లి అనుక్షణం తలుచుకునే తథాస్తు దేవతలు గుర్తుకు వచ్చారు నీరజకి.

"నేను తొందరలోనే పెళ్ళి చేసుకోవాలిట!"

నిశ్శబ్దంగా వింటోంది నీరజ.

"ఈ ఫిబ్రవరిలో నా పెళ్ళి జరిగిపోవాలట"

"ఒంట్లో బాగోలేని ఆయనను నిరాశకు గురి చేయకండి!" అప్రయత్నంగా అంది నీరజ.

"నాకు ఆడవాళ్ళ మీద సదభిప్రాయం లేదు"

శ్రీధర్ నోటివెంట అటువంటి మాటలు ఊహించని నీరజ నిర్ఘాంతపోయింది.

"ఆడవాళ్ళు నమ్మదగినవారుగా నాకు కనిపించరు!"

ఛర్రున కోపం వచ్చింది నీరజకి. "మీరు అందరి ఆడవాళ్ళనూ ఒకే గాటికి కట్టి అవమానిస్తున్నారు"

"సారీ, నాకు పరిచయం అయిన ఆడవాళ్లు అందరూ అటువంటివాళ్ళే!"

నీరజ మౌనంగా వింటోంది.

శ్రీధర్ రోడ్డు మీదకు చూస్తూ, తన అనుభవాలు వివరిస్తున్నాడు.

"బి.కాం. ఫైనల్ ఇయర్‌లో ఉండగా నేను కావ్యను ప్రేమించాను. తను కూడా నేనంటే ప్రాణం అంది. జీవితంలో స్థిరపడగానే పెళ్ళి చేసుకుందాం అంది. నాన్నకి తెలియకుండా పాకెట్ మనీతో తనకి చిన్న చిన్న గిఫ్ట్‌లు కొని ఇచ్చేవాడిని. తన కాలేజీ ఫీజు కట్టేవాడిని. ఒకరోజు మా కాలేజీలోనే మరో సెక్షన్‌లో చదివే జగన్‌తో పడవలో గోదావరి లంకల్లోకి వెళుతున్న కావ్యను చూశాను. నా హృదయం ముక్కలయింది. మర్నాడు ఏమీ జరగనట్లే నాతో మాట్లాడాలని చూసింది. అయితే మళ్ళీ తనతో ఈనాటిదాకా మాట్లాడలేదు నేను" ఊపిరి తీసుకోడానికన్నట్లుగా ఆగాడు శ్రీధర్.

చిన్న చిన్న ఊళ్ళని, మినుకు మినుకు మంటున్న దీపాలను దాటుకుంటూ వెళుతోంది కారు!

"ఫస్ట్ ఇయర్ ఎం.బి.ఎ.లో వినయతో పరిచయం అయింది నాకు! కావ్య చేసిన గాయానికి వినయ తీయని మాటలు మందులా పనిచేశాయి. రోజంతా తన మాటలే వింటూ వుండాలనిపించేది! అప్పటికే నాన్న కారు కొన్నాడు. కారులో మేం వెళ్ళని రెస్టారెంట్ లేదు, తిరగని పిక్‌నిక్ స్పాట్ లేదు! చీరలే కాదు, పెర్‌ఫ్యూమ్‌లు, గోల్డ్ చైన్లూ- ఎన్నో కానుకలు ఆనందంగా వినయకి సమర్పించుకున్నాను నేను. అయితే అనుకోకుండ ఒక సినిమా హాలులో నా ముందు వరుసలో, తన స్నేహితురాలితో కూర్చుని వున్న వినయ కనబడింది నాకు. ఇద్దరూ పరిసరాలు గమనించకుండా నవ్వుతూ ఏవేవో కబుర్లు చెప్పుకుంటున్నారు. "ఈ ఆగస్టులో అమెరికాలో వుండే మీ బావతో పెళ్ళి అని చెప్పారు. మరి ఆ శ్రీధర్‌ని ఎప్పుడు నీ వెనకే తిరగనిస్తావు దేనికీ?" అని అమాయకంగా అడుగుతున్న ఆ స్నేహితురాలికి, బిగ్గరగా నవ్వుతూ వినయ ఇచ్చిన జవాబు ఏమిటో తెలుసా? "అందమైన మగవాళ్ళు కుక్కలా నా వెనక తిరుగుతూ వుంటే నాలో ఆత్మవిశ్వాసం పెరుగుతుంది? అదో

ఆనందం నాకు! వాళ్ళిచ్చే గిఫ్ట్స్ తీసుకోవడం ఎంతో థ్రిల్లింగ్‌గా అనిపిస్తుంది. బావ వచ్చేవరకూ శ్రీధర్‌తో జస్ట్ టైంపాస్ అంతే!" వినయ మాటలతో అప్పుడే అతుక్కుంటున్న హృదయానికి మళ్ళీ తూట్లు పడ్డాయి. మరోసారి ఆడదంటే అసహ్యపడే పరిస్థితిని కల్పించింది వినయ, ఏదో ఊరి మొదట్లో వున్న చిన్న హోటల్ ముందు కారాపాడు శ్రీధర్.

"కాఫీ గానీ, టీ గానీ తాగుతారా? "

"నాకు వద్దు, మీకు కావాలంటే తాగండి!'

కారులోకి టీ తెప్పించుకుని తాగాడు శ్రీధర్

"జనవరి మూడో వారంలో వర్షాలు- విచిత్రంగా వుంది కదూ!" మళ్ళీ కారు స్టార్ట్ చేస్తూ అన్నాడు శ్రీధర్.

"మాకూ, నెల్లూరుకీ ఈశాన్య రుతుపవనాల్లోనే వర్షాలు ఎక్కువ! మీకందరికీ నైరుతి రుతుపవనాల్లో వర్షాలు కురుస్తాయి!"

"టీచరమ్మ అనిపించుకున్నారు!" నవ్వాడు శ్రీధర్.

రోడ్డుమీద అడపాదడపా ఎదురువస్తున్న లారీలు, బస్సులు! ట్రాఫిక్ చాలా తక్కువగా వుంది.

"ఎం. బి. ఎ. పూర్తిచేసి చిట్ ఫండ్ కంపెనీ పెట్టిన ఐదేళ్ళకి నాన్న పోరు పడ



లేక సరళతో పెళ్ళికి అంగీకరించాను నేను! పెళ్ళిచూపులు కాకినాడలో జరిగాయి. 'సాంప్రదాయకమైన కుటుంబం. లక్ష్మీకళ వున్న పిల్ల! ఆ పిల్ల మొహంలో అమాయకత్వం కొట్టవచ్చినట్లుగా కనిపిస్తోంది!' అంటూ పెళ్ళిచూపుల తరువాత ఇంటికి వస్తున్నప్పుడే సరళను ఆకాశానికి ఎత్తేశాడు నాన్న! ముందునుంచీ కట్నం వద్దనే చెబుతున్నాను నేను! నాన్న సరళకోసం రెండు లక్షలు ఖర్చుపెట్టి చీరలు, నగలు కొన్నాడు. పెళ్ళి కాకినాడలో! తెల్లవారు జాము ముహూర్తం. ముందురోజే కాకినాడ వెళ్ళి పగలు స్నాతకం చేసుకున్నాం! తెల్లవారుజాము ముహూర్తం కాబట్టి ముందురోజు సాయంత్రమే రిసెప్షన్ పెట్టారు. సింహాసనాల్లాంటి కుర్చీల్లో పక్కపక్కనే కూర్చున్న మమ్మల్నిద్దరినీ చూసి 'రతీమన్మధులు' అన్నారు కొందరు. 'మేడ్ ఫర్ ఈచ్ అదర్ జంట' అన్నారు మరికొందరు. నాకన్నా సరళకే గిఫ్టులు ఎక్కువ వచ్చాయి. నవ్వుతూ వాటిని రిసీవ్ చేసుకుంటూ, వచ్చిన వాళ్ళను నాకు పరిచయం చేస్తూ ఎంతో సరదాగా వుంది సరళ! పెళ్ళి డిన్నర్ చాలా గ్రాండ్‌గా వుంది! అర్ధరాత్రి నా ఫ్రెండ్స్‌తో కార్డ్స్ ఆడుతున్న నా దగ్గరికి ఒక కుర్రవాడు వచ్చి ఏదో చీటీ ఇచ్చాడు.

అది సరళ వ్రాసిన ఉత్తరం!



అందులో రెండే వాక్యాలు వున్నాయి.

'సారీ శ్రీధర్‌గారూ! నేను ప్రేమించిన జగదీష్‌తో వెళ్ళిపోతున్నాను నేను!'

నా నవనాడులూ కృంగిపోయాయి. అవమానంతో తల బాదుకుని చావాలనిపించింది. ఎవరినో ప్రేమించి వున్న సరళ ఆ పెళ్ళి అంటే ఇష్టం వున్నట్లు, నేనంటే అభిమానం వున్నట్లు ఎంతో బాగా నటించింది! కాదు... కాదు... జీవించింది! ఆడవాళ్ళు పైకి కనిపించేలా అమాయకులు, మృదుస్వభావులు, నిజాయితీపరులు కారు! ఆడదాన్ని నమ్మడమే మహాపాపం! ఆ రోజు రాత్రే నాన్నకు గట్టిగా చెప్పేశాను. మళ్ళీ నా ముందు పెళ్ళి ప్రసక్తి తీసుకువస్తే మర్యాద దక్కదు అని! ఈ ఐదారేళ్ళుగా నాన్న చిన్నగా గొణగడం తప్పించి, పెద్దగా నా మీద ఒత్తిడి తీసుకురాలేదు. బంధువులందరికీ నేను పెళ్ళిచేసుకోనని తెలిసిపోయింది! నా ముందు ఆ విషయం మాట్లాడే దమ్ము ఎవరికీ లేదు!" వర్షం ఆగిపోవడంతో, ఎ.సి. ఆపుచేసి, విండోస్ ఓపెన్ చేశాడు శ్రీధర్.

చల్లటి గాలి, రివ్వున కారులోకి దూసుకు వచ్చింది!

"ఇప్పుడు నాకు ముప్పైఐదేళ్ళు!" క్షణం ఆగాడు శ్రీధర్. "నాన్న చచ్చి బతికాడు. ఆయనకి ఎందుకో మీమీద చెప్పలేని అభిమానం! బహుశా మీరు ఆయన ప్రాణదాతని కాబోలు! మళ్ళీ మాటలు వచ్చినప్పటి నుంచీ 'నీరజను నువ్వు పెళ్ళి చేసుకుని తీరవలిసిందే' అంటూ కొత్తపాట మొదలు పెట్టాడు ఆయన!"

నీరజకి ఉక్కిరి బిక్కిరిగా వుంది. నోరు తడారిపోతోంది! అంత చలిగాలిలోనూ ఒళ్ళంతా స్వేదం.

"నేను చెప్పింది విన్నారా? " సూటిగా అడిగాడు శ్రీధర్.

విన్నానన్నట్లుగా తల వూపింది నీరజ.

"నేనడిగే ప్రశ్నలకి జవాబు చెబుతారా? నాకు నిజాలు కావాలి!"

ఏమనాలో తోచక, గబగబ తల ఊపింది నీరజ.

"మీరెవరినయినా ప్రేమించారా? "

శ్రీధర్ అలా సూటిగా అడగడం, ఇబ్బందిగా అనిపించింది నీరజకి.

"లేదు"

"నిజం చెప్పండి. కావాలంటే సమయం తీసుకోండి- బాగా ఆలోచించుకోండి"

నీరజ మొహం ఎర్రబడింది. "ఏదయినా నిర్ణయం తీసుకోడానికి ఆలోచించాలి. అంతేగానీ నిజం చెప్పడానికి ఆలోచన దేనికి? నేనెవరినీ ప్రేమించలేదు!" విసురుగా అంది నీరజ.

"మిమ్మల్నీ ఎవరూ ప్రేమించలేదా? "

ఆ ప్రశ్నకి జవాబు చెప్పడానికి కొద్దిగా తడుముకుంది నీరజ.

"నిరంజనం అనే మరో టీచర్ కట్నం లేకుండా నన్ను చేసుకుంటానన్నాడు. అయితే వాళ్ళ ఇంట్లో వాళ్ళు అందుకు ఒప్పుకోలేదు. పైగా అప్పట్లో నేను పెళ్ళి అయ్యాక మా అమ్మ నాతోపాటే వుంటుందని కండిషన్ పెట్టాను. అందుకు కూడా వాళ్ళు ఒప్పుకోలేదు. అతను మరో పెళ్ళి చేసుకున్నాడు..." క్షణం ఆగింది నీరజ.

"ఇటువంటి సాదాసీదా కథలు కాదు- ఇద్దరూ కలిసి క్లోజ్‌గా మూవ్ అవడం, సినిమా హీరోహీరోయిన్లలా తిరగడం... వగైరా కథలుంటే..."

"అటువంటి ప్రేమ పురాణాలు ఏమీ లేవు!" నీరజ ఆ మాట అంటూండగా కారు కందుకూరులో ప్రవేశించింది.

"అయితే మిమ్మల్ని పెళ్ళి చేసుకోడానికి, నాకేమీ అభ్యంతరం లేదని నాన్నకి చెబుతాను" ఆగి ఉన్న ఏదో బస్సు వెనక కారు ఆపుతూ అన్నాడు శ్రీధర్.

నీరజకి వెంటనే ఏం జవాబు చెప్పాలో

తోచలేదు.

"నేను ఆలోచించుకోవాలి"

"ఆల్‌రైట్- మీ ఇల్లు చూపించండి! మిమ్మల్ని ఇంటిదగ్గర డ్రాప్ చేస్తాను. రాత్రంతా ఆలోచించుకోండి. రేపు స్కూల్‌కి వెళ్ళకండి. సరిగ్గా పదకొండు గంటలకి నేను వస్తాను. మీ నిర్ణయం చెప్పండి" నీరజ దారి చూపిస్తూ ఉంటే, రెండు నిముషాల్లో ఆమె ఇంటిముందు కారు ఆపాడు శ్రీధర్.

నీరజ కారు దిగింది.

"వెళ్ళొస్తాను. గుడ్‌నైట్" కారు రివర్స్ చేసుకుని వెళ్ళిపోయాడు శ్రీధర్.

తాళం తీసుకుని ఇంట్లోకి వచ్చింది నీరజ.

టైమ్ ఏడవుతోంది!

నిస్సత్తువగా కుర్చీలో కూలబడిపోయింది. మనసులో ఏదో ఆందోళన. అస్తవ్యస్తమైన ఆలోచనలు! తన నిర్ణయం ఏమిటి? రేపు శ్రీధర్‌కి ఏం సమాధానం చెప్పాలి! ఎంతోమందికి దారి చూపించే తనకి, ఎటువెళ్ళాలో తోచని అగమ్యగోచర పరిస్థితి! శ్రీధర్ మంచివాడిలాగానే కనిపిస్తున్నాడు. అతనికి ఎదురయిన అనుభవాల రీత్యా ఆడదానిమీద అపనమ్మకం పెంచుకున్నాడు. రంగనాథం ఉత్తముడు. అయితే ఆ లక్షాధికారుల ఇంట్లో తను ఇమడగలదా? ఇటువంటి గొప్ప సంబంధం రావడం అదృష్టం అనుకోవాలా? మనసులో ఏదో మూల చిన్న అసంతృప్తి. శ్రీధర్ మాటవరసకైనా, "నన్ను చేసుకోవడం మీ కిష్టమేనా?" అని అడగలేదు. ఎంతసేపూ తన అభిప్రాయాలూ, ఉద్దేశాలే చెబుతాడు. తను కోరితే ఏ ఆడదీ కాదనదనే ధీమానా? లేకపోతే అతని స్వభావమే అంతా? ఏ విషయమైనా తన కోణంలోంచే ఆలోచిస్తాడా? అయితే ఒక మధ్యతరగతి ఆడపిల్ల కలలో కూడా ఊహించలేని అదృష్టం తన తలుపు తడు తో[redacted] వేళాకోళంగా [redacted] అందగాడినే తనకోసం చూడమంది. అమ్మ పైనుంచి తనని కనిపెట్టుకుని వుండటంవల్లే ఈ సంబంధం వచ్చిందేమో! ఇక తను నెగటివ్‌గా ఆలోచించడం అనవసరం.

నీరజ స్నానం చేసి మేడమీదికి వెళ్ళింది.

రత్నం, రమాపతులను మించి తనకి ఆత్మీయులు లేరు. రమాపతి ఇంకా రాలేదు.

రత్నంకి మాలకొండ మీద రంగనాథం, శ్రీధర్ పరిచయం అయినప్పటినుంచీ, గంటక్రితం శ్రీధర్ తనని ఇంటిముందు దిగబెట్టిన దాకా జరిగిన సంగతులన్నీ వివరంగా చెప్పి, "ఇప్పుడు నేను రేపు శ్రీధర్ గారికి ఏం సమాధానం చెప్పాలి? మీ సలహా చెప్పండి" అంది.

"కృతజ్ఞతలు చెప్పు" ఠక్కున అంది రత్నం.

"అవును ఎవరూ పూనుకోకుండా అంత మంచి సంబంధం రావడం నీ అదృష్టం"

"నాకెందుకో మనసంతా అల్లకల్లోలంగా వుంది" బెంగగా అంది నీరజ.

నీరజ పక్కన సోఫాలో కూర్చుని, నీరజ తలమీద ఆప్యాయంగా చేయి వేసింది రత్నం. "స్వయంగా నిర్ణయం తీసుకోవలసి వచ్చినప్పుడు ఇటువంటి భయాలే కలుగుతాయి. అదీ 'పెళ్ళి'వంటి ముఖ్యమైన విషయాల్లో. నువ్వేమీ భయపడకు. రేపు నేనూ, మీ అంకుల్ నీ తరపున అతనితో మాట్లాడతాం నీకేమయినా అనుమానాలు వుంటే చెప్పు! అడిగేద్దాం!"

"నాకు ప్రత్యేకంగా అనుమానాలంటూ ఏమీలేవు! అయితే ముప్ఫై ఏళ్ళుగా పుట్టి పెరిగిన ఊరిని, ఈ మనుషుల్ని శాశ్వతంగా వదిలి వెళ్ళిపోవాలంటే బెంగగా

అనిపిస్తోంది"

నీరజ మాటలకి పెద్దగా నవ్వింది రత్నం. "పెళ్ళికి ముందు ప్రతి ఆడపిల్లకీ వుండే భయాలే ఇవి!"

"అంకుల్‌కి కూడా అన్ని విషయాలూ చెప్పండి" లేచింది నీరజ.

అయితే ఎంత ప్రయత్నించినా ఆ రాత్రి నీరజ కంటిమీద కునుకు లేదు.




**ప**దింటికల్లా, రత్నం, రమాపతి మేడ దిగి వచ్చేశారు.

బజారునుంచి తెచ్చిన కలాకండ్, జీడి పప్పు పకోడి డైనింగ్ టేబుల్ మీద పెడుతూ "ఆ అబ్బాయి వచ్చాక పెడదాం-ప్లేట్లు సిద్ధం చేసుకో" అన్నాడు రమాపతి.

"అలాగే" అంది రత్నం వంటింట్లోకి వెళుతూ.

సరిగ్గా పదకొండు గంటలకు కారు హారన్ వినిపించి అదురుతున్న గుండెలతో తలుపు తీసింది నీరజ.

గుమ్మంలో వైట్ డ్రెస్‌లో శ్రీధర్. మొదటిసారి శ్రీధర్‌ని పరిశీలనగా చూసింది నీరజ. ఆరడుగుల పొడవుతో, పొడవుకు తగిన లావుతో నుదుటిమీద పడుతున్న ఉంగరాల జుట్టును పైకి తోసుకుంటూ, నీట్‌గా షేవ్ చేసుకుని, ఒకవిధమైన రాజసంతో లోపలికి నడిచివచ్చాడు శ్రీధర్.

"అందగాడే!" అలా అనుకోకుండా వుండలేకపోయింది నీరజ.

రత్నాన్ని, రమాపతిని శ్రీధర్‌కి పరిచయం చేసింది నీరజ.

రత్నం గ్లాసులో మంచినీళ్ళు తీసుకువచ్చింది.

"నో, థ్యాంక్స్" అన్నాడు శ్రీధర్.

పదినిముషాలు రమాపతి శ్రీధర్‌తో పిచ్చాపాటీ మాట్లాడారు.

మూడు ప్లేట్లలో స్వీటూ, హాటూ సర్దుకువచ్చింది రత్నం.

"ప్లీజ్- ఇప్పుడేమీ వద్దు. కప్పు కాఫీ ఇస్తే చాలు. అదీ పావుగంట తరువాత" అన్నాడు శ్రీధర్.

ప్లేట్లు వంటింట్లో పెట్టేసి వచ్చింది రత్నం.

శ్రీధర్ నీరజనే చూస్తున్నాడు.

నీరజ తన కాలివేళ్లను చూసుకుంటోంది.

"మా నీరజ చాలా మంచిది శ్రీధర్ గారూ, ఈ కాలంలో వుండవలసిన పిల్ల కాదు" ముందు తనే నోరు విప్పింది రత్నం.

"తనూ తన ఉద్యోగం అంతే! మంచి ఉపకార గుణం ఉంది" అన్నాడు రమాపతి.

ఆ మాటలకి చిన్నగా నవ్వాడు శ్రీధర్. "నీరజగారిలోని సుగుణాలన్నీ నచ్చాయి కాబట్టే నా అభిప్రాయం చెప్పాను. తను నిర్ణయం తీసుకోవడానికి కొంచెం టైం అడిగితే, మళ్ళీ రావలసి వచ్చింది"

"మీలాంటి గొప్ప సంబంధం రావడం మా నీరజ అదృష్టం" నీరజ చేయి నొక్కుతూ అంది రత్నం.

"వాళ్ళ అమ్మగారు వుండి వుంటే ఎంత సంతోషపడేవారో" అరుంధతిని తలుచుకున్నాడు రమాపతి.

"టీచర్‌గారు పెదవి విప్పడం లేదు. మౌనవ్రతమా? " శ్రీధర్ మాటలకి కంగా

రుపడింది నీరజ.

"అదేంలేదు"

"మరి మీ నిర్ణయం చెప్పలేదు"

"నాకు ఇష్టమే" తలదించుకుంది సిగ్గుతో.

★ ★ ★

మర్నాడు లంచ్ టైంలో గోపాలరావుగారికి తన పెళ్ళి విషయం అంతా చెప్పింది నీరజ.

"జాబ్‌కి రిజైన్ చేయవలసి రావడమే బాధగా ఉంది!"

"మంచి సంబంధం వచ్చినందుకు కంగ్రాట్స్" మనస్ఫూర్తిగా అన్నారు గోపాలరావుగారు. "నువ్వు మా నిరంజనాన్ని తిరస్కరించడం మంచిదే అయింది!" అన్నారు మళ్ళీ.

ఆ మాటలకి ఇబ్బందిగా తల దించుకుంది నీరజ.

"వాడి జాతకంలో అల్పాయుష్కురాలే భార్యగా రావాలని రాసి పెట్టుంది!" గొణిగినట్లుగా అన్నారు గోపాలరావు గారు

ఉలిక్కిపడింది నీరజ "ఏం అంటున్నారు మీరు? "

"అన్నట్లు నీకు చెప్పలేదు కదూ! మీ అమ్మ పోయిన సమయంలోనే పాము కరిచి అలివేణి చచ్చిపోయింది!"

"నిజంగానా? " నమ్మలేకపోయింది నీరజ! తను బస్సులో చూసిన అలివేణి అమాయక రూపం కళ్ళముందు కదిలింది! అలివేణి మాటలు గుర్తుకు వచ్చాయి. "ఇట్స్ రియల్లీ వెరీ సాడ్!"

"నిరంజనం మళ్ళీ మనుషుల్లో పడడానికి రెండు నెలలు పట్టింది! ఇప్పటికీ తీవ్రంగా ఏదో ఆలోచిస్తూనే వుంటాడు!"

"అలాగా" లంచ్ బెల్ అయిపోవడంతో, తన క్లాస్‌కి వెళ్ళడానికి లేచింది నీరజ.

★ ★ ★

అనుకున్న ప్రకారం ఫిబ్రవరి 27న రిజిస్ట్రార్ ఆఫీస్‌లో నీరజ పెళ్ళి, శ్రీధర్‌తో జరిగిపోయింది!

శ్రీధర్ కోటీశ్వరుడని, కట్నం లేకుండా నీరజను పెళ్ళి చేసుకుంటున్నాడని తెలిసి ఆ టైమ్‌కి వచ్చాడు నరసింహం.

"మా మేనమామ! ఇప్పుడు వినుకొండలో పోస్ట్‌మాస్టర్‌గా చేస్తున్నాడు. పేరు నరసింహం!" శ్రీధర్‌కి మేనమామను పరిచయం చేసింది నీరజ.

"నాకు ఇద్దరు అమ్మాయిలు బాబూ! ఇంకా పెళ్ళి కాలేదు. నీ ఎరికెలో ఏమయినా సంబంధాలు వుంటే చెప్పు!"

నరసింహం మాటలకి నవ్వి ఊరుకున్నాడు శ్రీధర్! నీరజ తరఫున గోపాలరావుగారు, సుగుణ, రత్నం, రమాపతి వచ్చారు.

కందుకూరు నుంచి శ్రీధర్ అత్త, బావ వచ్చారు. వాళ్ళు కాక ఒంగోలులోనే ఉన్న మరో పదిమంది దూరపు చుట్టాలు వచ్చారు.

పన్నెండు అవకముందే అందరికీ మౌర్య హోటల్‌లో స్పెషల్ లంచ్ ఏర్పాటు చేశాడు శ్రీధర్!

ఒంగోలు నుంచి కారులో రాత్రికి రాజమండ్రి వెళ్ళిపోవడమే అని ముందే చెప్పి వుండటంతో నీరజ తనతోపాటు రెండు సూట్‌కేసులు తెచ్చుకుంది!

వాటిని ఇండికా కారు డిక్కీలో సర్దేశాడు డ్రైవర్ రవి. "అమ్మగారూ, ఇంక ఏమీలేవు

## కొత్తగాలి... 

**పాతబస్తీలో ప్రేమకల్లోలం**
**సాఫ్ట్'వేరు'ల చెట్టయినా**
**అభి'మతాల' ఊడలు**
**ఛాందసపు మట్టిలోకే**

–కె. ఆంజనేయకుమార్, విజయవాడ

కదండీ!"

లేవన్నట్లుగా తల వూపింది నీరజ. 'అమ్మగారూ' అనే పిలుపు కొత్తగా అనిపించింది.

"మమ్మల్ని మరచిపోకు నీరజా! ఆరేళ్లుగా కలిసి ఉన్నవాళ్ళం! నాకయితే స్వంత కూతురిని పంపిస్తున్నంత బాధగా ఉంది!" కళ్లనీళ్ళు పెట్టుకుంది రత్నం.

రత్నం కళ్ళల్లో నీళ్ళు చూసి, నీరజకి దుఃఖం ఆగలేదు, "సరిపోయింది! ఎందుకా ఏడుపు! సామాన్లు తీసికెళ్ళడానికి మరో పది రోజుల్లో నీరజ రాకుండా వుంటుందా? " భార్యను సముదాయించాడు రమాపతి!

శ్రీధర్ కరచాలనం చేస్తూ, అందరి దగ్గర వీడ్కోలు తీసుకున్నాడు!

"ముందు మీరు కారెక్కండి మేడమ్!" తనే డోర్ ఓపెన్ చేస్తూ నవ్వాడు శ్రీధర్.

నీరజ అందరికీ నమస్కరించి కారు ఎక్కింది. శ్రీధర్ ఆమె ప్రక్కన కూర్చుని డోర్ లాక్ చేశాడు!

కారు కదిలింది!

వాళ్ళు కనిపించే వరకూ, చేయి ఊపుతూనేవుంది నీరజ!

కారు హైవేమీద రాకెట్‌లా దూసుకుపోతోంది. నీరజకి జరుగుతున్నదంతా కలలా తోస్తోంది! జీవితం అంటేనే అనూహ్యం అనిపిస్తోంది. ఎనిమిది నెలల క్రితం మాలకొండ మీద పరిచయం అయిన శ్రీధర్‌కి తను భార్య! అలా అనుకోవడమే కొత్తగా వుందా! నిజంగా తన పెళ్లి అయిపోయిందా! తను గృహిణిగా మారిపోయిందా! ఈరోజు కోసమేనా అమ్మ బతికున్నంత కాలం కలలు కన్నది! ఇక తన జీవితం శ్రీధర్‌తో ముడిపడిపోయినట్లేనా? శ్రీధర్ తీసుకువచ్చిన మెరూన్ కలర్ పట్టు చీర మీద, పసిడి కాంతులు విరజిమ్ముతున్న మంగళ సూత్రాలు.

'అవును... అవును' అన్నట్లుగా కదులుతున్నాయి.

"ఏమిటి, దీర్ఘాలోచనలో ఉన్నావు? " నీరజ భుజం మీద చేయివేస్తూ అన్నాడు శ్రీధర్.

"ఏమీ లేదు" భుజం మీద కొత్తగా మగ స్పర్శ- అదోలా వుంది!

"నాతో చెప్పకూడదా? "

"చెప్పడానికి ఏమీలేదు"

"ముందే చెప్పాను- నా నుంచి దాచే రహస్యాలు ఉండకూడదు. నీ దగ్గర!" నీరజ చెక్కిలి మీద చిటికె వేస్తూ నవ్వాడు శ్రీధర్!

అంత దగ్గరగా శ్రీధర్ ఉచ్ఛ్వాస నిశ్వాసలు నీరజలో తెలియని మత్తును కలగజేశాయి! ఆమె అలిసిన దానిలా బలంగా ఉన్న శ్రీధర్ భుజం మీద తలవాల్చి కళ్ళు మూసుకుంది.

★ ★ ★

సాయంత్రం ఏడింటికల్లా, చుట్టూ విశాలమైన ఆవరణ ఉన్న పెద్ద భవంతి ముందు పోర్టికోలో ఆగింది కారు!

"ఇక ఇదే నీ ఇల్లు! దిగు" నీరజ భుజం తడుతూ అన్నాడు శ్రీధర్.

నీరజ ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది.

గబగబ టవల్‌తో మొహం తుడుచుకుని, చీర సర్దుకుంటూ కారు దిగింది నీరజ!

ఇంట్లో అట్టేమంది లేరు.

ఇద్దరు ముత్తయిదువులు నీరజకి హారతి ఇచ్చి, "కుడికాలు ముందు పెట్టమ్మా!" అంటూ నీరజను చేతులు పట్టుకుని లోపలికి తీసికెళ్లారు.

"మా బంగారమ్మ పిన్నీ, పాపాయమ్మ పిన్నీ" వాళ్లిద్దరినీ నీరజకి పరిచయం చేశాడు శ్రీధర్. "నాన్నకి కజిన్స్" అన్నాడు మళ్లీ.

"మామయ్యగారు ఎక్కడ ఉన్నారు? "

రంగనాథం కోసం నీరజ కళ్లు విశాలంగా ఉన్న హాలుని పరికిస్తున్నాయి.

"ఆ పక్కన ఉన్నదే నాన్నగారి గది!" నీరజ చేయిపట్టుకుని తండ్రి గదిలోకి తీసుకువెళ్లాడు శ్రీధర్.

రంగనాథం చూపులన్నీ గుమ్మం వైపే వున్నాయి. నీరజను చూడగానే ఆయన మొహంలో మతాబులు పూశాయి!

"మామయ్యగారూ, మమ్మల్ని ఆశీర్వదించండి" నీరజతో పాటు తనూ తండ్రి పాదాలకు నమస్కారం చేశాడు శ్రీధర్.

"కూర్చో తల్లీ!"

రంగనాథం మంచానికి దగ్గరగా కుర్చీ జరుపుకుని కూర్చుంది నీరజ!

"నువ్వూ కూర్చోరా!!"

శ్రీధర్ తండ్రి మంచం మీదే కూర్చున్నాడు.

"అలిసిపోయావు! దాదాపు ఏడు గంటల ప్రయాణం కదా!" వాడినట్లున్న నీరజ మొహాన్ని చూస్తూ అన్నాడు రంగనాథం.

"అదేం లేదు!"

"కందుకూరును వదిలివచ్చినందుకు బెంగలా వుంది" నవ్వాడు శ్రీధర్.

"పుట్టిన ఊరిపట్ల ప్రతివాళ్లకీ ప్రేమ వుంటుందిరా! నీకే ఎటువంటి ప్రేమలూ లేవు!" నీరజను సమర్థించాడు రంగనాథం.

పాపాయమ్మ, బంగారమ్మ ఒక ప్లేట్‌తో ఏవో స్వీట్లు మిక్చరూ తీసుకువచ్చారు. "ఇద్దరూ కలిసి తింటే చూస్తాం!"

"ఇవన్నీ కిందపడి ముందు నాన్నగదిలో చీమలు వస్తాయి. ఇప్పుడేమీ వద్దు, కాఫీ తీసుకురండి చాలు!" అన్నాడు శ్రీధర్.

"నీరజకి ఆకలిగా ఉందేమోరా!"

"లేదండీ, విజయవాడలో టిఫిన్ తిన్నాం" మొహమాటంగా అంది నీరజ!

కాఫీలు వచ్చాయి.

"త్వరగా కాఫీ తాగు తల్లీ! నీకు స్నానం చేయించి అలంకరణ చేయాలి!" నీరజ బుగ్గలు పుణుకుతూ అంది బంగారమ్మ, సిగ్గుతో నీరజ తల వాలిపోయింది!

రాత్రి పదింటికల్లా అందరి భోజనాలు అయిపోయాయి!

మేడమీది శ్రీధర్ గదిలోనే శోభనానికి అన్ని ఏర్పాట్లు జరిగిపోయాయి!

భోజనం అవగానే శ్రీధర్ మేడమీదికి వెళ్లిపోయాడు. నీరజ చేతికి పాలగ్లాసు ఇచ్చి, మేడమీది దాకా వచ్చారు బంగారమ్మ, పాపాయమ్మలు.

"అసలు పెళ్లే వద్దన్న శ్రీధర్, నీలో ఏం చూశాడో నిన్ను చేసుకున్నాడు! మంచివాడే కాని కొంచెం కోపిష్టి! మొండి పట్టుదల ఎక్కువ! వాడినీ, దివాణంలాంటి ఈ ఇంటినీ, ఇక నువ్వే చక్కదిద్దుకోవాలి!" ఆ రెండు మాటలూ చెప్పి నీరజను గదిలోకి పంపించి వెళ్లిపోయారు వాళ్లు.

గది అలంకరణ సినిమా అలంకరణను తలపించేలా ఉంది!

తెల్ల పైజమా, లాల్చీలో మంచం మీద కూర్చుని ఉన్న శ్రీధర్ మన్మధుడిలా కనిపించాడు నీరజ కళ్లకి.

"అక్కడే నిలబడిపోయావేం, రా!" నీరజ వైపే చూస్తున్నాడు శ్రీధర్.

తల దించుకునే మంచందాకా వచ్చింది నీరజ.

"టీచరమ్మ ఇంతలా సిగ్గుపడటం ఏ స్కూల్లో నేర్చుకుంది?" నీరజను పక్కన కూర్చోబెట్టుకుంటూ నవ్వాడు శ్రీధర్.

"పాలు తాగండి!" చేతిలో పాలగ్లాసు శ్రీధర్ చేతికిచ్చింది నీరజ.

"సగం నీకు" పాలు పంచుకోవడం అయింది.

నీరజకి భయంగా ఉంది! గుండెల్లో దడగా ఉంది! గదిలో ఏవో స్ప్రేలు, గులాబీలు, లిల్లీలు అన్నీ కలసిన కలగలుపు మత్తు వాసన!

"నేను బాగా అలిసిపోయాను!" నేలవైపు



చూస్తూ అంది నీరజ.

"హాయిగా నిద్రపో! ఏమీ ఫరవాలేదు. ముందు నా దగ్గిర భయం, బిడియం అన్నీ పోవాలి నీకు!"

నీరజ అలాగే కూర్చుంది.

"మొహమాటపడకు- ఫ్రీగా పడుకో!" కొంచెం పక్కకు జరుగుతూ అన్నాడు శ్రీధర్.

గులాబీలు పరిచిన ఆ పక్కమీద, అలాగే వాలింది నీరజ!

శ్రీధర్ రిమోట్‌తో టి.వి. ఆన్ చేసాడు.

"ఈ రేయి తీయనిది" చిట్టిచెల్లెలు సినిమాలో పాట వస్తోంది.

ఆ పాట వింటూ అలాగే నిద్రలోకి జారుకుంది నీరజ! అరగంట తర్వాత టి.వి. ఆఫ్‌చేసి బాత్‌రూంకి వెళ్లి వచ్చాడు శ్రీధర్. నీరజ పక్కన పడుకోవడం కొత్తగా ఉంది- జీవితంలో మొదటిసారి ఆడదాని పక్కన పడుకోవడం- మనసు ఏదో కావాలంటోంది. నీరజ నడుం ఒంపులో చేయి వేశాడు! గులాబీల కన్నా మృదువుగా అనిపించింది. నిద్రలో నీరజ కదిలింది! శ్రీధర్ ఆ చేతిని వెనక్కి తీసుకోలేదు! అతనికి



సహకరిస్తున్నట్లుగా అతని వైపుకి తిరిగింది నీరజ. బలంగా ఆమెను తన బాహువుల్లో బంధించాడు శ్రీధర్. గువ్వలా ఆ కౌగిలిలో ఒదిగిపోయింది నీరజ.

★ ★ ★

మర్నాడు రాత్రి 'ఆనంద్ రిజియన్సీ' హోటల్‌లో గ్రాండ్‌గా రిసెప్షన్ పార్టీ ఇచ్చాడు శ్రీధర్!

వందమందికి పైగా వచ్చారు.

అందరూ ఖరీదైన మనుషులే!

రిసెప్షన్‌లో కట్టుకోవడానికి నీరజ కోసం పాతికవేల రూపాయల పట్టుచీర కొన్నాడు రంగనాథం!

నీరజ ఆ చీర కట్టుకుంటుండగా "ఇవి మీ మామగారు నీకు అలంకరించమన్నారు!" అంటూ పొడవైన నెక్లెస్‌ను నీరజ మెడలో వేసి, రెండు చేతులకీ ఆరు జతల బంగారు గాజులు తొడిగింది బంగారమ్మ.

రిసెప్షన్‌లో మ్యూజిక్ పార్టీ కూడా వుంది!

ఇంటికి వచ్చేసరికి రాత్రి పదకొండున్నర! ఖరీదైన పట్టుచీరలో, ఒంటినిండ నగలతో అద్దంలో తన రూపం తనకే వింతగా కనిపించింది నీరజకి!

"అమ్మా, నిజంగా నేను అదృష్టవంతురాలినే- అందుకే ఇంత మంచి సంబంధం వచ్చింది!" తమ గదిలో పెట్టుకున్న తల్లి ఫొటోకి వేసిన గులాబీ దండను సవరిస్తూ అనుకుంది నీరజ.

★ ★ ★

రెండు రోజుల్లో చుట్టాలందరూ వెళ్ళిపోయారు!

లంకంత ఇంట్లో వాళ్ళు ముగ్గురే!

వంటావిడ రెండుపూటలా వచ్చి, వంట చేసి వెళుతుంది.

విధవరాలు రాజమ్మ ఇంటిపని అంతా చూస్తుంది! ఆమె ముసలి తండ్రి రంగయ్య రంగనాథం మొహం కడగడం, స్నానం చేయించడం వంటి పనులు చేస్తాడు. తండ్రీ కూతుళ్ళిద్దరూ వెనకవైపు ఔట్ హౌస్‌లో వుంటారు! వీరాస్వామి బయట పనులన్నీ చూస్తాడు. రఫీ రోజూ పొద్దున్న ఏడింటికి వచ్చి, రంగనాథంతో ఫిజియోథెరఫీ చేయించి వెళతాడు. కారు డ్రైవరు రవి, శ్రీధర్‌ని తీసికెళ్ళి, తీసుకువస్తూ వుంటాడు!

పదిహేను రోజుల్లో ఆ ఇంటి వాతావరణానికి అలవాటు పడింది నీరజ!

ఆ ఇంట్లో నీరజకి పని అంటూ ఏమీ లేదు!

## కొత్తగాలి... 

**కోడిపుంజు**
**బతికుంటే అలారం**
**బలైపోతే**
**ఆహారం**

-వై.కె. మూర్తి, విజయవాడ

రోజులో ఎక్కువ భాగం రంగనాథం గదిలో కూర్చుని కబుర్లు చెప్పడమే!

ఎన్నో ఆధ్యాత్మిక పుస్తకాలు చదివిన అనుభవం రంగనాథానిది! ఆయన చెప్పే పురాణ కథలు, రుషుల జీవిత విశేషాలూ ఆసక్తిగా వినేది నీరజ!

ఆయన పడుకున్నప్పుడు ఎం.ఎ. పుస్తకాలు చదువుకునేది!

పొద్దున్న తొమ్మిది గంటలకు వెళ్ళే శ్రీధర్ మళ్ళీ తిరిగి రావడం రాత్రి తొమ్మిది దాటాకే! మధ్యాహ్నం డ్రైవర్ రవి వచ్చి క్యారేజి తీసుకువెళతాడు. శ్రీధర్ రాత్రి భోజనం చేశాకే, ఒక గంట టీవీ చూసి అప్పుడు పడుకునేవాడు! ఆసరికి మధ్యాహ్నం నిద్ర అలవాటులేని నీరజకి నిద్ర ముంచుకువస్తూ వుండేది! ఏడింటికి నిద్రలేచే శ్రీధర్ గంటసేపు పేపరు చదివి స్నానం చేసి వెళ్ళిపోయేవాడు.

రోజులో గంటసేపయినా శ్రీధర్‌తో మాట్లాడే టైమ్ దొరకక అసంతృప్తిగా వుండేది నీరజకి!

"క్యారేజీ కోసం డ్రైవర్‌ని పంపించే బదులు ఆ కారులో మీరే రావచ్చు కదా! ఇద్దరం కలిసి భోజనం చేయవచ్చు" అంది ఒకసారి శ్రీధర్‌తో.

"అది నా పాలసీకి విరుద్ధం" అన్నాడు శ్రీధర్.

అతని ఉద్దేశం సరిగా బోధపడలేదు నీరజకి!

"ఈ ఆదివారం నన్ను గోదావరి ఒడ్డుకు తీసకెళ్ళండి! పుస్తకాల్లో చదవడం, సినిమాల్లో చూడటమే. ఆ మహానదిని ప్రత్యక్షంగా చూడలేదు" అంది శనివారం రాత్రి శ్రీధర్‌తో.

"నది ఏదయినా అక్కడుండేది నీళ్ళే!" తేలిగ్గా అన్నాడు శ్రీధర్.

"అలా అనకండి- గోదావరి నదికి ఎంతో చరిత్ర వుంది. ఆ నది ఒడ్డున పాతకాలం గుళ్ళు వున్నాయట! రైల్ కమ్ రోడ్డు బ్రిడ్జ్ చూడటం థ్రిల్లింగ్‌గా అనిపిస్తుందట! అది కాక మరో రెండు వంతెనలు వున్నాయట!

"అన్నీ చూసినట్టే చెబుతున్నావు? ఇంకెందుకు వెళ్ళడం?"

శ్రీధర్ మాటలకి తెల్లబోయింది నీరజ!

"ఈ చుట్టుపక్కల కూడా ఎన్నో పుణ్యక్షేత్రాలు ఉన్నాయట! కోనసీమ అందాలు నేను చూడనేలేదు. ప్రతి ఆదివారం ఒక చోటుకి వెళ్ళివద్దాం!" అంది శ్రీధర్‌కేసే ఆశగా చూస్తూ.

"చూడు నీరజా! చిట్‌ఫండ్ వేలం పాటలు, రికవరీలు ఆదివారమే వుంటాయి. కొత్తగా అమలాపురం బ్రాంచ్ పెట్టాం! ఆదివారం ఆ బ్రాంచ్ విజిట్‌కి వెళ్ళాల్సి వుంటుంది! నేను ఆదివారాలు చాలా బిజీ- తీర్థయాత్రలు చేయడానికి ఇంకా చాలా టైం వుందిలే!" అన్నాడు శ్రీధర్.

నీరజకి చెప్పలేనంత ఆశాభంగం అయింది!

నెల తిరిగేసరికి రంగనాథం దగ్గర చనువు ఏర్పడింది గానీ ఎందుకో శ్రీధర్‌కి చేరువ కాలేపోయింది! శ్రీధర్ ఇంట్లో వున్నప్పుడు కూడా మితంగానే మాట్లాడతాడు! అందుకే భర్తతో చనువు పెంచుకోలేకపోయింది నీరజ.

"ఏ వయసుకి ఆ ముచ్చట అన్నారు. ముప్ఫై ఏళ్ళు దాటాక పెళ్ళి అంటే మనుషులు సర్దుకోవడం, ఒకరి అభిరుచులు

ఒకరు అర్థం చేసుకోవడం, ఎదుటి వారికి అనుకూలంగా మారటం కష్టం! అప్పటికే స్థిరమైన వ్యక్తిత్వాలు, అభిప్రాయాలు ఏర్ప డిపోతాయి! అందుకే నా మాట విని, తొందరలో పెళ్ళి చేసుకో!" బతికివున్నంత కాలం రోజూ ఏదో ఒక సమయంలో తల్లి తనతో అంటుండే మాటలు గుర్తుకు వచ్చాయి నీరజకి.

"అనుభవంతో చెప్పిన అమ్మ మాటల్లో నిజం వుంది! ఎందుకో శ్రీధర్‌కి మరీ చేరువుగా వెళ్ళడానికి తనకీ మొహమాటంగానే వుంటోంది! శ్రీధర్ కూడా కొత్త పెళ్ళికొడుకులా చిలిపిగా కాకుండా ఎప్పుడూ ఏవో లెక్కలు చూసుకుంటూ సీరియస్‌గా వుంటాడు. ఇదంతా వయసు ప్రభావం కాబోలు!" అనుకునేది నీరజ, మరో నాలుగు నెలల్లో తన వయసు ముప్ఫై ఒకటి కాబోతోందని గుర్తు చేసుకుంటూ!

ఆ రాత్రి టి.వీ. చూస్తున్న శ్రీధర్‌తో "నేను సామాను తెచ్చుకోడానికి కందుకూరు వెళ్ళాలనుకుంటున్నాను. ఎప్పుడు వెళ్ళమంటారు? " అని అడిగింది నీరజ, తనూ మంచం మీద కుర్చుంటూ.

శ్రీధర్ నవ్వాడు "నీ సామాను ఈ ఇంట్లో ఎక్కడ పెడతావు!"

ఆ మాటలకి నీరజ మనసు చివుక్కుమంది. ఖరీదయిన ఈ ఇంట్లో తన సామానుకి స్థానం లేకపోవచ్చు అయితే మాత్రం తను పైసా పైసా కూడబెట్టి కొనుక్కున్న సామాను! అమ్మకోసం కొన్న ఊగే కుర్చీ అమ్మ క్రితం పుట్టినరోజు నాడు తన కోసం కొన్న కృష్ణుడి బొమ్మ, అవన్నీ తనకి అపురూపమే కదా!

"అలా అని అంత సామానూ అలా వదిలేస్తామా? ఇప్పటికే అనవసరంగా ఒక నెల అద్దె ఇచ్చుకోవలసి వస్తుంది!"

శ్రీధర్ మళ్ళీ నవ్వాడు "బెంగ పడకు! మా మధుబావ మన పెళ్ళయిన రెండు రోజుల్లోనే ఆ ఇల్లు ఖాళీ చేసి, నీ సామాను వాళ్ళింట్లో ఒక గదిలో పెట్టించాడు. మనం ఆ వైపుకి వెళ్ళినప్పుడు కావలసిన సామాను తెచ్చుకోవచ్చు"

"నాకొక్కమాట చెప్పివుండవలసింది!" నొచ్చుకుంది నీరజ. శ్రీధర్ జవాబు చెప్పలేదు. ఆసక్తిగా టీవీ చూస్తున్నాడు.

★ ★ ★

నీరజ వచ్చాక వంటావిడ కాకుండా, నీరజే చెంచాతో రంగనాథంకి భోజనం తినిపిస్తోంది.

"నువ్వు వచ్చాక నేను నాలుగు కిలోల బరువు పెరిగివుంటాను. కుక్కికుక్కి తినిపిస్తావు" అలిగినట్లుగా అన్నాడు రంగనాథం.

నీరజ నవ్వింది. "మీరు తొందరలో బలం తెచ్చుకుని, మళ్ళీ మునుపటిలా తిరగాలి? అదే జరిగితే మిమ్మల్ని తిరుపతికి, మాలకొండకీ తీసుకువస్తానని మొక్కుకున్నాను!"

ఆ మాటలకి రంగనాథం కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"క్రితం జన్మలో మనం తండ్రీ కూతుళ్ళం అయివుంటాం"

"నేను తండ్రీ- మీరు కూతురు- ఈ కూరా అన్నం పూర్తిగా తినేయాలి! అలా నోరు బిగించుకుంటే నేను ఊరుకోను!" రంగనాథం భోజనం పూర్తయ్యాక, నీళ్ళతో పెదవులు తుడిచి, నాప్కిన్‌తో అద్దింది నీరజ.

"ఈ ఇంట్లో నీకు బోర్ కదూ!" హఠాత్తుగా అడిగాడు రంగనాథం.

"మీతో బోలెడు కాలక్షేపం!" నవ్వింది నీరజ.

"నేనెంతకాలం వుంటాను? "

"అలా మాట్లాడితే నాకు కోపం వస్తుంది!"

"నా బలవంతం మీద ఈ పెళ్ళి చేసు

కున్న శ్రీధర్, నిన్ను ప్రేమగా చూడటం లేదేమో అని నా భయం!"

"అదేం లేదు. నాతో బాగా వుంటారు! ఆయన ఎప్పుడూ బిజీ కదా! బయటకు వెళ్ళడానికి కుదరడం లేదు!"

"మా వాడితో అటువంటి ఆశలు పెట్టుకోకు తల్లీ! ఆడవాళ్ళను వెంటబెట్టుకుని వెళ్ళడం వాడికి నచ్చదు! ఆడది ఇల్లే స్వర్గం అనుకోవాలనేటైప్ వాడు! వాడు నీతో ప్రేమగా వుంటే అంతేచాలు నాకు!"

ఆ మాటలు విని తెల్లబోయింది నీరజ. "మరి... మరి... చదువుకునే రోజుల్లో కావ్య, వినయ వాళ్ళతో ఎక్కడెక్కడో తిరిగానని చెప్పాడు!"

"పెళ్ళికిముందే అన్ని విషయాలూ నీకు చెప్పేయమని సలహా ఇచ్చాను. వీడి పీటల మీద పెళ్ళి కూడా చెడింది"

"చెప్పారు"

"బహుశా ఆ అనుభవాల వల్లే కాబోలు ఆడది అంటే ద్వేషం! అపనమ్మకం! అప్పట్లో బంగారమ్మ కూతురు వీడికి చెల్లెలే కదా.. సినిమాకు రమ్మన్నా, స్పోర్ట్స్ డేకి రమ్మన్నా ఏదో సాకు చెప్పి వెళ్లేవాడు కాదు! పైగా, బాబాయ్‌కు బుద్ధిలేదు. వయసులో వున్న పిల్లను రోడ్డుమీదికి పంపించడం ఏమిటి? " అంటూ సణుక్కునేవాడు.

"ఈ ఇంటికి చుట్టాలు ఎక్కువగా రారనుకుంటాను"

"వాడు సరిగ్గా మాట్లాడడు- ఎవరొస్తారు? ఏ మధ్యాహ్నమో వచ్చి నన్ను చూసి వెళతారు కొందరు! ఇదివరలో ఫ్రెండ్స్ బాగా వచ్చేవాళ్ళు! పెళ్ళయ్యాక వాళ్ళూ రావడం మానేసారు!"

"ఈయనే పిలవడం మానేసివుంటారు" అనుకుంది నీరజ.

"మగసిరి వుట్టిపడే ఆ విశాలమైన ఛాతీ క్రిందవున్న మనసులో ఎన్ని సంకుచిత భావాలు!" ఫొటోలో ఠీవీగా నిలబడివున్న శ్రీధర్‌ని చూస్తూ అనుకుంది నీరజ.

★ ★ ★

ఆ రాత్రి భోజనం చేస్తూ, "కూరలో కారం ఎక్కువ, పచ్చడిలో ఉప్పులేదు" అంటూ కంచంలోని పదార్థాలు పక్కకు తోసేశాడు శ్రీధర్.

"అందుకే ఈ నెలాఖరుకి వంటావిడను మాన్పించి ఫస్టునుంచి నేనే వంట చేద్దాం అనుకుంటున్నాను! నాకు టైంపాస్ అవడం లేదు" అంది నీరజ శ్రీధర్ కంచంలో పెరుగు వడ్డిస్తూ.

"నువ్వు వంట బాగా చేస్తావా? "

"ఇంతకంటే బాగానే చేస్తాను? " శ్రీధర్ పక్కకు తోసేసిన పదార్థాలు చూపించి నవ్వింది నీరజ.

"అయితే ఫస్టుదాకా ఆగడం ఎందుకు? రేపే మొదలుపెట్టు!" వాష్ బేసిన్‌లో చేయి కడుక్కుని వచ్చాడు శ్రీధర్.

"వంటావిడకు ముందు చెప్పకపోతే గోల చేస్తుందేమో!"

"రేపే ఒకనెల జీతం ఇచ్చి పంపించు!" మేడమీదికి వెళ్ళిపోతూ అన్నాడు శ్రీధర్.

నీరజలో కొత్త ఉత్సాహం వచ్చింది!

పొద్దున్నే వచ్చిన వంటావిడకి డబ్బిచ్చి పంపించేసింది! టమాటో పప్పు చేసింది. కొబ్బరికాయ పచ్చడి చేసింది. కొత్తిమీర, కారం పెట్టి వంకాయ కూర చేసింది. బంగాళదుంపలు దోరగా వేయించింది. కమ్మటి సాంబారు కాచింది!

"మీ అత్తయ్యగారు పోయాక ఇంత కమ్మటి భోజనం ఈ ఇంట్లో ఇదేతినడం!" మనస్ఫూర్తిగా నీరజ వంటను మెచ్చుకున్నాడు రంగనాథం!

రాత్రి మళ్ళీ నాలుగు రకాలు చేసింది.

శ్రీధర్ భోజనం చేస్తూ ఎటువంటి కామెంట్లూ చేయలేదు.

"వంటావిడను మాన్పించేశాను. పొద్దున వంట, ఇప్పటి వంట నేనే చేశాను! మీకు

నచ్చిందా?" వుండబట్టలేక అడిగేసింది నీరజ.

"బాగుగాలేకపోతేనే నా అభిప్రాయం చెబుతాను?" చేయి కడుక్కోడానికి లేస్తూ అన్నాడు శ్రీధర్.

నీరజ ఉత్సాహం మీద నీళ్ళు చిలకరించి నట్లయింది.

నీరజ ఆరింటికల్లా నిద్రలేచి, స్నానం చేసి కిందకు వస్తుంది!

నీరజ కాఫీ కలిపే లోపల రంగయ్య, రంగనాథం మొహం కడిగిస్తాడు.

ముందుగా మామగారికి కాఫీ కలిపి తీసి కెళు తుంది.

ఏడు గంటలకి ఫిజియో థెరపిస్ట్ రఫీ వస్తాడు.

రంగనాథం ఎక్సర్ సైజులు సరిగ్గా చేయడని, అక్కడే కూర్చుంటుంది నీరజ!

ఇదివరలో ఆ టైంలో శ్రీధర్ వచ్చి కూర్చునేవా డట!

ఎనిమిది గంటలకి శ్రీధర్ కిందకు వస్తాడు. అప్పుడు ఇద్దరికీ కాఫీ కలుపుతుంది!

పేపర్ చూస్తూ కాఫీ తాగుతాడు శ్రీధర్!

తను రెడీ అవడానికి మేడమీదకు వెళ్ళగానే వంటపనికోసం వంటింట్లోకి అడుగు పెడుతుంది నీరజ!

పెళ్ళయిన కొత్తల్లో అతడిని సాగనంపడానికి వీధి గేటుదాకా వచ్చి "బై" అన్నట్లుగా చేయి వూపేది నీరజ.

అయితే "నువ్వు వీధిదాక రావడం ఎందుకు? నేనేమయిన ఆమెరికా వెళుతున్నానా? ఇటువంటివి నాకు ఇష్టం వుండవు?" అంటూ చిరాకు పడ్డాడు శ్రీధర్.

అప్పటి నుంచీ వీధిలోకి వెళ్ళడం మానేసింది నీరజ.

వెళ్ళేముందు వంటింటి గుమ్మందాకా వచ్చి "వెళుతున్నాను" అని తనే చెప్పి వెళతాడు శ్రీధర్.

ఆరోజు వంట సగంలో వుండగా గ్యాస్ అయిపోయింది.

బెండకాయలు కట్ చేస్తున్న నీరజ "రాజమ్మ, రాజమ్మ! ఇలా రా!" అంటూ పనిమనిషి కోసం పిలిచింది!

"రాజమ్మ టెర్రస్ మీద చెత్త తుడుస్తుంది. ఏం కావాలమ్మా!" అంటూ వచ్చాడు వీరాస్వామి.

"గ్యాస్ అయిపోయింది. మరో సిలిండర్ పట్టుకురా!" అంది నీరజ.

వీరాస్వామి ఖాళీ అయిన సిలిండర్ స్టోర్‌రూంలో పెట్టి, ఫుల్ సిలిండర్ తెచ్చి పెట్టాడు.

"స్టౌ వెలిగించు" అంది నీరజ బెండకాయలు తరుగుతూనే!"

లైటర్‌తో కాసేపు, అగ్గిపుల్లలతో మరికాసేపు ప్రయత్నించినా స్టౌ వెలగలేదు.

ఆత్రేయని ఓ అందమైన యువతి కలిసినప్పుడు తనను చూసి తన వయసు ఎంతో చెప్పమని అడిగిందట.

'పలువరుస చూస్తే పద్దెనిమిదేళ్ళు ఉన్నాయనిపిస్తోంది. ఉంగరాల జుత్తు చూస్తుంటే పందొమ్మిది దాటాయనిపిస్తోంది. అసలు మొత్తంమీద నీ తీరు చూస్తుంటే పద్నాలుగేళ్లేనేమో అన్పిస్తోంది' అని చెప్పారట ఆత్రేయ.



'మీరు చెప్పిందేమీ నాకు అర్థంకాలేదండి. అసలు నా వయసుసెంతో ఒక్కముక్కలో చెప్పండి' అందామె మళ్లీ.

ఆత్రేయ నవ్వి 'చెప్పడానికేముందమ్మా! నే పైన చెప్పిన అంకెలన్నీ కూడుకుంటే నీ వయసు తెలుస్తుందేమో!' అని వేళాకోళం చేసారుట.

## కొత్తగాలి...

**ఎండాకాలంలో**
**వసంత శోభ**
**శీతాకాలంలో**
**ఆకులు రాల్చు క్షోభ**

*-సంగంబండ జగన్నాథరెడ్డి, మక్తల్*

"వెలగడం లేదమ్మా, మరో సిలిండర్ తెచ్చి పెట్టనా? " అని అడిగాడు వీరాస్వామి.

"క్రింద రెగ్యులేటర్ సరిగ్గా టచ్ అయి వుండదు చూడు" అంది నీరజ.

వీరాస్వామి రెగ్యులేటర్ కిందకి నొక్కి, మళ్ళీ స్టౌ వెలిగించే ప్రయత్నం చేశాడు. అయినా స్టౌ వెలగలేదు.

"ఉండు, నేను వచ్చి చూస్తాను!" బెండ కాయలు, కటర్ పక్కన పెట్టి వచ్చింది నీరజ.

నీరజ రెగ్యులేటర్ తీసి, మరోసారి నొక్కి పెట్టి, స్టౌ వెలిగించింది.

స్టౌ వెలిగింది "మీ చేయి పడితేగానీ వెలగలేదమ్మా!" నవ్వాడు వీరాస్వామి.

"ఏమిటీ ఇద్దరూ కలసి కుస్తీపడుతున్నారు? " గుమ్మంలో నిలబడి వున్నాడు శ్రీధర్.

"సిలిండర్ అయిపోతే కొత్తది తెచ్చి పెట్టమన్నాను" మళ్ళీ కటర్ చేతిలోకి తీసుకుంటూ అంది నీరజ.

శ్రీధర్‌ని చూస్తేనే వీరాస్వామికి వణుకు. "నమస్కారం, బాబూగారు!" అంటూ వాడు చిన్నగా పెరట్లోకి వెళ్ళిపోయాడు.

"వంటింటి పనులు రాజమ్మకు చెప్పవచ్చుగా!" ఇంకా గుమ్మం దగ్గిరే వున్నాడు శ్రీధర్.

"తను పైన తుడుస్తోందట"

"అది వచ్చేదాక ఆగలేకపోయావా? "

"ఇప్పుడేమయింది? " వేలు తెగడంతో సింకులో కుళాయి క్రింద వేలు పెట్టింది నీరజ! గాయం లోతుగా అయినట్లుంది. భగభగ మండుతోంది వేలు!

ఆ దృశ్యం చూసినా శ్రీధర్‌లో ఎటువంటి చలనం లేదు!

వేలికి చుట్టడానికి గుడ్డకోసం చూస్తోంది నీరజ.

"నా పెళ్ళాం మగ పనివాళ్ళతో రాసుకు పూసుకు తిరగడం నాకు నచ్చదు!"

రక్తం కారకుండా వేలు నొక్కి పెట్టి, బాధ సహిస్తున్న నీరజ "మీ మాటలు నాకు అర్థం కావడంలేదు!" అంది చిరాకు పడుతూ.

"నేను తెలుగులోనే మాట్లాడుతున్నాను. నీ పమిట వాడి భుజం మీద పడుతున్నా గుర్తించలేనంత మైకంలోవున్నావు నువ్వు" కోపంతో శ్రీధర్ దవడ ఎముకలు బిగుసుకున్నాయి.

అతని కళ్ళు అంతలా ఎర్రబడటం ఇదివరలో చూసి వుండని నీరజ నోటి వెంట మాట పెగలలేదు!

భయంతో బిగుసుపోయినట్లుగా, ఫ్రిజ్ కి ఆనుకుని నిలబడిపోయింది.

శ్రీధర్ హాల్లోకి వెళుతూనే వీరాస్వామిని కేక వేశాడు.

"ఇదిగో రెండు నెలల జీతం! ఈ రోజు నుంచే పని మానేసి వెళ్ళిపో"

"బాబుగారూ!" నోరు వెళ్ళబెట్టాడు వీరాస్వామి.

"ఎనిమిదేళ్ళుగా ఈ ఇంట్లో చేస్తున్నాను!"

"అందుకే రెండు నెలల జీతం ఇస్తున్నాను. వెళ్ళిపో" విసురుగా అని, వెళ్ళిపోయాడు శ్రీధర్.

ఆరోజు నీరజ రంగనాథంతో కాఫీ తాగిస్తుండగా ఫిజియోథెరపిస్ట్ రఫీ వచ్చాడు.

రఫీకి కూడా కాఫీ కలిపి తెచ్చింది నీరజ.

# బెట్ రాయుళ్లు




సప్తవ్యసనాలలో ఒకటైన జూదం ఓ మానసిక వ్యాధి అని అమెరికన్ శాస్త్రజ్ఞులు అంటున్నారు. అమెరికా, యూరప్‌లో జూదం కేవలం పేకాటకి, గుర్రపు పందాలకే పరిమితంకాక అనేక ఇతర అంశాలకూ పాకింది. కంపల్సివ్‌గాంబ్లర్స్ అనే వీరు పందెం కట్టడానికి దేన్నయినా ఎన్నుకుంటారు. వాటివల్ల అసౌకర్యం, ప్రమాదం లేదా అవహేళన కలిగినా సరే! డబ్బుకోసం, సరదా కోసం వీరు పందేలు కాస్తుంటారు.

లెనిన్‌గ్రాడ్ జూలో అలెగ్జాండర్ సొగ్లనోవ్ ఓ బాటిల్ వోడ్కాను పందెం కట్టి, ఎలుగు బంట్లు తిరుగుతున్న చిన్న సరస్సులో ఈదుతానని దూకాడు. అయితే ఓ ఎలుగుబంటి అతని మీదకి దూకి గాయపరిచింది. ఫలితంగా 39 కుట్లు పడ్డాయి. వోడ్కా బాటిల్‌ను ఓడిపోయాడు.




ఒకతను బంగారు నాణాలని ఒక్కోటి పెన్నీ చొప్పున తను అమ్మినా ఎవరూ కొనరని 50 పౌండ్లకు బెట్ కట్టాడు. లండన్ బ్రిడ్జిమీద వాటిని అమ్మేందుకు వెళ్లగా తనే ఆ పందెంలో గెలిచాడు. ఇలాగే 1998లో అమెరికాలోని ఓ గ్రామంలో మరొకతను 5 డాలర్ల నోట్లను ఒక్కోటి డాలర్‌కే అమ్మినా ఎవరూ కొనరని పందెం కాసి గెలిచాడు.

1948లో 80 పౌండ్లకు ఓ బెట్ కాగితాన్ని ఒకరు కొన్నారు. దాని విశిష్టత ఏమంటే 1901లో అమెరికాని సందర్శించినప్పుడు విన్‌స్టన్ చర్చిల్ సంతకం చేసిన గుర్రపు రేసుల బెట్ కాగితమది.

అమెరికాకు చెందిన జేమ్స్ సి.యంగ్ 1942లో బ్రిటన్‌లోని ఓ మిత్రుడితో వంద పౌండ్లకు, 'వచ్చే పదేళ్లలో బ్రిటిష్ సామ్రాజ్యాధిపత్యం ఇండియా లేదా ఆస్ట్రేలియాలోని మూడోవంతు భూభాగం కోల్పోతుంది' అని పందెంకాసి గెలిచాడు.

జులై 1943లో జనరల్ ఐసెన్ హోవర్ ఫీల్డ్ మార్షల్ మోంటొగొమరీతో యూరప్‌లో రెండో ప్రపంచ యుద్ధం 1944 క్రిస్మస్‌కల్లా తగ్గిపోతుందని 10 డాలర్లకు బెట్‌కట్టాడు. దానికి ప్రతిగా మోంటొగొమరీ యుద్ధం 1945ని కూడా చూస్తుందని బెట్ కట్టాడు. ఐసెన్‌హోవర్ డిసెంబర్ 26న మోంటొగొమరీకి పది డాలర్లను పంపించాడు.

ఏప్రిల్ 10, 1964న ఓ లండన్ నివాసి, మనిషి చంద్రుడి మీద జనవరి1, 1971నాటికల్లా కాలుపెడతాడని 10 పౌండ్లను 1000 : 1 నిష్పత్తిలో బెట్ కట్టాడు. ఆ లండన్ నివాసి పదివేల పౌండ్లను గెలుచుకున్నాడు.

జేమ్స్ ఈటన్ అనే బ్రిటిష్ వ్యక్తి ఒంటికాలిమీద 12 గంటలు నుంచుని 50 పౌండ్ల పందేన్ని గెలుచుకున్నాడు.

అన్నిటికన్నా కఠినమైన బెట్‌ని ఇంగ్లండ్‌లో 1860లో లార్డ్ సిసిల్‌తో, హేస్టింగ్స్ అనే అమెరికన్ 1000 పౌండ్లకి కట్టాడు. పదేళ్లపాటు మనిషి ఒంటరిగా బందిఖానాలో ఉండగలడని పందెంకాసి, హేస్టింగ్స్ పదేళ్లపాటు తన ఇంట్లో కట్టుకున్న జైల్లో తనే స్వయంగా ఒంటరిగా గడిపాడు. పుస్తకాలు చదువుతూ, రాస్తూ, మరెవరినీ చూడకుండా పదేళ్లపాటు అలా గడిపాడు. జైలునుంచి బయటికి వచ్చిన నాలుగోరోజే హేస్టింగ్స్ మరణించాడు. పదేళ్లలోనే అతని వయసు నలభై ఏళ్లు పెరిగినట్లుగా కనిపించడం గమనార్హం.

"రేపటి నుంచి ఇటువంటి కమ్మటి కాఫీ మిస్ అయిపోతాను మేడమ్" అన్నాడు రఫీ కాఫీ సిప్‌చేస్తూ.

"అదేం? " రంగనాథం మూతి నాప్‌కిన్‌తో తుడుస్తూ అంది నీరజ.

"మరో పేషంట్ కుదిరాడు మేడమ్- వాళ్ళు పొద్దున్న ఏడుగంటలకే రావాలంటున్నారు! అయ్యగారి కోసం రేపటి నుంచీ సాయంత్రం ఆరింటికి వస్తాను మేడమ్!" రంగనాథం ఎడం కాలికి ఆయిల్ మర్దన చేస్తూ అన్నాడు రఫీ.

"అసలు రాకపోతే మరీ మంచిది!" నవ్వాడు రంగనాథం. "ఒక నెల టైం ఇస్తున్నాను రఫీ! ఏం చేస్తావో తెలియదు, ఆయన చేత అడుగులు వేయించాలి!" గదిలో ఫ్యాన్ వేస్తూ అంది నీరజ.

"అయ్యగారు కోపరేట్ చేస్తే అడుగులేం ఖర్మ, డాన్స్ చేయిస్తాను!" అన్నాడు రఫీ నవ్వుతూ!

మర్నాడు రంగనాథం కాఫీ తాగాక, ఆయనకి పేపర్లో వార్తలు చదివి వినిపిస్తోంది నీరజ.

"నీరజా, రఫీని ఇలా రమ్మను-త్వరగా!" మేడమీదనుంచే గట్టిగా అరిచాడు శ్రీధర్!

ఆ అరుపుకి హడలిపోయి మేడమీదికి పరిగెత్తింది నీరజ. "ఏమయింది? పొద్దున్నే రఫీ ఎందుకు? "

"నిద్రలో నడుం పట్టేసినట్లుంది- తనని ఒకసారి రమ్మను" ఎడంచేత్తో నడుం రుద్దుకుంటూ అన్నాడు శ్రీధర్.

"ఈరోజు నుంచీ రఫీ సాయంత్రం ఆరింటికి వస్తానన్నాడు" మంచం మీద కూర్చుని "ఎక్కడ నొప్పి? " అని అడిగింది నీరజ, శ్రీధర్ నడుం మీద చేయివేస్తూ.

"ఎందుకు? పొద్దున్న ఏడింటికి వచ్చేవాడుగా!"

"కొత్త పేషంట్ కుదిరాడట- వాళ్లూ ఏడింటికే రమ్మన్నారట"

"అలా అని ఎంతో కాలంగా అటెండ్ అవుతున్న పేషంట్‌ని నిర్లక్ష్యంచేస్తాడా? "

"మనకి సాయంత్రం వచ్చినా ఫరవా లేదు కదా!"

"ఎందుకూ, ఆ టైమ్‌లో వస్తే నువ్వు కూడా కాళ్ళూ, చేతులూ పట్టించుకుందామనుకున్నావా? "

అతని మాటల్లో శ్లేషని అర్థం చేసుకోలేని నీరజ "నాకెందుకండీ- నా ఒళ్లు ఉక్కుతో చేసింది. మా నాన్న బాడీ చాలా స్ట్రాంగ్‌గా వుండేదట- ఆ పోలికే వచ్చిందనేది మా అమ్మ"

"అలా స్ట్రాంగ్‌గా వున్నావు కాబట్టే మరో మగాడితో ఒళ్ళు పట్టించుకోవాలనిపిస్తుంది!"

ఎర్రబడుతున్న శ్రీధర్ కళ్ళను చూడగానే నీరజకి వీరాస్వామి వ్యవహారం గుర్తుకు వచ్చింది.

"మీరు ఏం మాట్లాడుతున్నారో నాకు అర్థం కావడం లేదు" అంది అతని నుంచి చూపులు తప్పించుకుంటూ.

"నాకు చెప్పకుండా ఈ ఇంట్లో ఎటువంటి మార్పులు జరగడానికి వీలు లేదు. సాయంత్రం రఫీ వస్తే వెనక్కి పంపించేయి. పగలు ఏడింటికి రాలేకపోతే మరొకరిని చూసుకుంటాం అని చెప్పు!" ఒకసారి నడుం సవరించుకుని, చిన్నగా నడుస్తూ బాత్‌రూంలోకి వెళ్ళిపోయాడు శ్రీధర్.

## 8

ఆరోజు- "మీతో కొంచెం పర్సనల్‌గా మాట్లాడాలి మామయ్యగారూ" అంది నీరజ రంగనాథం చేత జామకాయ ముక్కలు తినిపిస్తూ.

"చెప్పమ్మా!"

"ఈయనని నేను అర్థం చేసుకోలేకపోతు న్నానా, లేక నన్ను ఆయన అర్థం చేసుకో వడం లేదా తెలియక తికమకగా వుంటోంది"

"ఏం జరిగింది? "

నీరజ దాచకుండా వీరాస్వామి విషయం లోనూ, రఫీ విషయంలోనూ శ్రీధర్‌తో జరిగిన సంభాషణ అతికష్టం మీద రంగ నాథంకి వివరించింది.

"చెప్పాను కదమ్మా! వాడికి అనుమానం జాస్తి! నువ్వే కొంచెం ఓపికతో సర్దుకుపో వాలి!"

"ఒక భార్య స్థానంలో మీరు వుంటే నా బాధ అర్థం అవుతుంది!" నీరజ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ముక్కూ మొహం తెలియని మనిషిని సర్వస్వం అని నమ్ముకుని వచ్చి ఆ కుటుంబం కోసం జీవితం అంకితం చేస్తుంది ఆడది- అదే భార్య! అటువంటి భార్య, భర్త తనని అనుక్షణం అనుమాని స్తున్నాడని తెలిస్తే ఎలా తట్టుకోగలదు? ఆ అవమానం ఎలా సహించగలదు? "

"నువ్వు బాధపడకమ్మా" అనునయంగా అన్నాడు రంగనాథం.

"ఈ మధ్యనే మరో విపరీతం జరిగింది. రెండు నెలల క్రితం వీడి ఫ్రెండ్ పెళ్లాం, పెళ్ళయి కాపురానికి వచ్చిన ఆరేళ్ళ తరు వాత తను జాకెట్లు కుట్టించుకునే టైలర్‌తో కలిసి, బొంబాయి వెళ్ళిపోయింది"

"ఎవరో ఏదో చేశారని, కట్టుకున్న పెళ్ళాన్ని అనుమానించడం అమానుషం కాదా? పెళ్ళయి ఆరునెలలు కావొస్తోంది. నేనెలాంటి దానినో ఆయన ఇంకా గ్రహిం చలేదా? " రోషంగా అడిగింది నీరజ.

"కొంచెం సర్దుకో తల్లీ! కాలమే అన్ని సమస్యలకీ పరిష్కారం చూపిస్తుంది!" నీర జకి నచ్చచెప్పాడు రంగనాథం.

★ ★ ★

ఆరోజు నిద్ర లేస్తూనే తల్లి పోయిన తిథి అని గుర్తుకు వచ్చి దుఃఖం ఆగలేదు నీరజకి!

స్నానం చేస్తూనే పెరట్లో ముద్ద మందా రాలు దండగా గుచ్చి తల్లి ఫొటోకి నమ స్కరించింది.

"అదేం తల్లీ, అలా వున్నావు? " కాఫీ తీసుకు వచ్చిన నీరజను చూస్తూనే అడిగే శాడు రంగనాథం.

"ఒంట్లో బాగా లేదా? "

భోరున ఏడ్చేసింది నీరజ. "ఈరోజు అమ్మ తిథి"

"అలాగా" తనూ బాధపడ్డాడు రంగ నాథం.

"తల్లిలేని లోటు ఎవరూ తీర్చలేరు. నా దురదృష్టం మా అమ్మ చిన్నతనంలోనే పోయింది"

"అమ్మ పేరుమీద ఏదయినా చేయాలని ఉంది!"

కాస్సేపు ఆలోచించాడు రంగనాథం. "ఒక పనిచేయి... గోదావరి ఒడ్డున జీవకారుణ్య సంఘం వారి అనాధాశ్ర మంలో పిల్లలకి దుప్పట్లు, స్వీట్లు, పళ్లు అమ్మ పేరున పంచిరా!"

ఆ ఆలోచన నచ్చింది నీరజకి!

తొమ్మిదింటికి వెళుతున్న శ్రీధర్‌తో "పన్నెండింటికి కారు పంపించండి! జీవ కారుణ్య సంఘానికి వెళ్ళాలి!" అంది నీరజ.

"అక్కడికి ఎందుకు? "

"చెప్పానుగా అమ్మ తిథి అని! కొన్ని దుప్పట్లు, స్వీట్లు, పళ్ళు కొని తీసుకువెళ తాను!"

"అలాగే!" వెళ్ళిపోయాడు శ్రీధర్.

సరిగ్గా పన్నెండింటికల్లా కారు వచ్చే సింది.

కారులోంచి దిగుతున్న శ్రీధర్‌ని చూసి ఆశ్చర్యపోయింది నీరజ!

"మీరు వచ్చారే! పెద్ద బిజీగా లేదా

ఈరోజు!" శ్రీధర్‌కి మంచినీళ్ళ గ్లాసు అందిస్తూ అంది నీరజ.

"నేను రావడంతో డిసప్పాయింట్ అయ్యావా?" వ్యంగ్యంగా అన్నాడు శ్రీధర్.

"డ్రైవర్‌తో కలిసి ఊరంతా చుట్టి రావాలని ప్లాన్ చేశావేమో!"

"నోటికి ఎంత వస్తే అంత మాట్లాడటమేనా?" పొద్దున్నుంచీ ఏమీ తినకపోవడంతో నీరసంగా ఉన్న నీరజకి దుఃఖం పొంగి వచ్చింది. "అమ్మ జ్ఞాపకంలో బాధగా ఉన్న నన్ను..."

"పద! నాకు సెంటిమెంట్లు గిట్టవు!" వెళ్లిపోయి కారులో కూర్చున్నాడు శ్రీధర్.

అనాథాశ్రమంలో తల్లి పేరు మీద చేయాలనుకున్నది చేసినా, నీరజలో నిర్లిప్తత, నిరాసక్తత, నిస్తేజం!

★ ★ ★

రాత్రి తొమ్మిదవుతోంది!

నీరజ శ్రీధర్ కోసమే ఎదురుచూస్తోంది!

ఎనిమిదింటికల్లా భోజనం చేసి, అర గంటలో నిద్రలోకి జారుకుంటాడు రంగనాథం!

అప్పటిదాకా ఆ లంకంత కొంపలో ఒంటరి పక్షి నీరజ! నిజంగానే ఆ విశాల సౌధం బంగారు పంజరంలా కనిపిస్తోంది నీరజకి! తనకి ఆ ఇంట్లో సకల సౌకర్యాలు ఉన్నాయి! కాలు కింద పెట్టవలసిన అవసరం లేదు! ఆ ఇల్లే యాభై లక్షల విలువ చేస్తుంది. అయినా తనలో ఏదో అసంతృప్తి వెలితి! పెళ్ళయి ఆరునెలలు దాటినా ఇంక 'ఈ ఇల్లు నాది- ఈ మనుషులు నావాళ్లు' అనే ఫీలింగ్ కలగడం లేదు. టీచర్ ఉద్యోగం బదులు, ఈ ఇంటి నిర్వహణా బాధ్యత చూసే ఉద్యోగం చేస్తున్నట్లుగా వుంది! మునుపటి సంతోషం కూడా మృగ్యం అయిపోయింది. ఇలా ఎందుకనిపిస్తోంది. లోపం తనలో ఉందా? శ్రీధర్‌లో ఉందా? శ్రీధర్ తన చుట్టూ గీస్తున్న గిరిని దాటలేకపోతోంది

[redacted]

**పెళ్లయ్యేదాకా**
**ఆరాటం**
**ఆపై అనుక్షణం**
**పోరాటం**

-అచ్యుతుని రాజ్యశ్రీ, హైదరాబాద్

తను! లేకపోతే శ్రీధర్ ఆ అవకాశం ఇవ్వడం లేదా? శ్రీధర్ మనస్ఫూర్తిగా తనని నమ్మడం లేదనే బాధగా తన అంతరంగాన్ని దహించి వేస్తోంది! మునుపటి స్వతంత్రం కూడా కోల్పోయినందుకా తనలో ఈ అసంతృప్తి? ఎందుకు? ఎందుకు తను ఆనందంగా వుండలేకపోతోంది?

పిచ్చి పిచ్చి ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోతోంది నీరజకి!

తలుపు తీసుకుని బయటకు వచ్చింది!

నిండు పౌర్ణమి! వెన్నెట్లో ఆవరణలో ఉన్న పూల మొక్కలు ఆనందంగా తలలు ఆడిస్తున్నాయి! గాలి చల్లగా వీస్తోంది!

హాల్లో ఫోన్ మోగింది

ఈ టైమ్‌లో ఎవరు చేసి ఉంటారు?

"హలో" ఫోన్ లిఫ్ట్ చేసింది నీరజ.

"మీరెవరు?" అవతలవైపు మొగ గొంతు.

"మీకు ఎవరు కావాలో చెప్పండి" చిరాకుగా అంది నీరజ.

"మీరెవరో చెప్పండి ముందు!"

"ఫోన్ చేసింది మీరు- ఎవరి కోసం చేశారో చెప్పండి! లేకపోతే ఫోన్ పెట్టేస్తాను!" బెదిరిస్తున్నట్లుగా అంది నీరజ.

"శ్యామలని పిలవండి!"

"రాంగ్ నంబర్" ఫోన్ పెట్టేసింది నీరజ.

"నిజంగా రాంగ్ నంబరా? నన్ను చూసి ఫోన్ పెట్టేశావా?" గుమ్మంలో శ్రీధర్!

డ్రైవర్ రవి క్యారేజీ ఉన్న బుట్ట టేబుల్ మీద పెట్టి వెళ్ళిపోయాడు.

"చెప్పు, అలా తెల్లమొహం వేశావే?"

"మిమ్మల్ని చూసి ఫోన్ ఎందుకు పెట్టేస్తాను?" నిజంగానే తెల్లమొహం వేసింది నీరజ.

"ఏమో ఏమయినా పర్సనల్ కాల్స్ వుండొచ్చు కదా!" బూట్లు విప్పుకుంటున్నాడు శ్రీధర్.

"నేనే నెలకి రెండు మూడుసార్లు గోపాలరావు గారితోనూ, రత్నం ఆంటీతోనూ మాట్లాడతానని, నాకే ఫోన్లు రావని మీకు తెలుసు"

"నేను లేనప్పుడు ఎక్కడి నుంచి కాల్స్ వస్తున్నాయో నాకేం తెలుసు? ఏ నిరంజనమయినా చేస్తున్నాడేమో!"

"నిరంజనం ఎందుకు చేస్తాడు?"

"నాకేం తెలుసు? అది మీ ఇద్దరి మధ్య వ్యవహారం"

నీరజ ఏదో అనబోతుండగా రంగనాథంకి పెద్దగా దగ్గు వచ్చింది.

గ్లాసులో మంచినీళ్ళు, కాఫ్ సిరప్ సీసా తీసుకుని వెళ్ళింది నీరజ!

"అబ్బాయి వచ్చాడా? ఆలస్యం అయిపోయింది. త్వరగా భోజనం చేయండి!" చెంచాలోని కాఫ్ సిరప్ చప్పరిస్తూ అన్నాడు రంగనాథం.

"అలాగే"

నీరజ హాల్లోకి వచ్చేసరికి శ్రీధర్ మేడమీదికి వెళ్ళిపోయాడు.

భారంగా నిట్టూర్చింది నీరజ.

"ఈ రోజు రఫీ రాడు కదూ!" అన్నాడు రంగనాథం కాఫీ తాగుతూ.

"ఎవరిదో పెళ్ళట! రేపు వస్తాడు. కాఫీ తాగాక మీరు ఎక్సర్‌సైజులు చేయక తప్పదు!" నీరజ అక్కడే కుర్చీలో కూర్చుంది.

"ఈ రోజు రెస్ట్ కావాలమ్మా, నీరసంగా వుంది!" ఖాళీ కాఫీ గ్లాసు నీరజకి అందిస్తూ అన్నాడు రంగనాథం.

"మీ అబ్బాయి గొడవ పడ్డాడు!" అంటూ క్రితం రాత్రి జరిగిందంతా వివరంగా చెప్పింది నీరజ.

"మామయ్యగారూ! ఈయనకి ఆడవాళ్ళంటే మరీ చులకన భావం, అనుమానం! చిన్నతనంలోనే ఏర్పర్చుకున్న తప్పుడు అభిప్రాయాలు పెద్దవాళ్ళే తొలగించి, సరి అయిన దిశానిర్దేశం చేయాలి! ఇప్పుడు అనుమాన పిశాచం ఈయన మనసుమీద పూర్తి అధిపత్యం సంపాదించింది! మనం ఏం చెప్పినా నమ్మరు. సైక్రియాటిస్ట్ మాత్రమే ఆ దయ్యాన్ని వదలగొట్టగలడు! మీరెలాగయిన ఆయనను ఒప్పించి..." ఆవేశంగా చెప్పుకుపోతున్న నీరజ, రంగనాథం వెనక్కి వాలిపోవడం చూసి కంగారుపడింది!

చూస్తుండగానే రంగనాథం ఒళ్ళంతా స్వేదం కమ్మేసింది! ఊపిరి తీసుకోవడం కష్టంగా వుంది! తట్టుకోలేనంత బాధతో గుండెలు పట్టుకుని మెలికలు తిరిగిపోతున్నాడు! "అయిపోయింది తల్లీ, నాపని అయిపోయింది" అస్పష్టంగా గొణుగుతున్నాడు రంగనాథం.

"మీరు ధైర్యంగా వుండండి మామయ్యగారు. ఇప్పుడే డాక్టర్ని పిలిపిస్తాను- వెంటనే ఈయనను లేపి తీసుకువస్తాను!" నీరజ పరిగెత్తుకు వెళ్ళి, శ్రీధర్‌ని తీసుకువచ్చేసరికి రంగనాథం మెడ పక్కకు వాలిపోయి వుంది. ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసలు శాశ్వతంగా ఆగిపోయాయి.

★ ★ ★

శ్రీధర్ తండ్రికి అన్నీ, శాస్త్రప్రకారం యధావిధిగా జరిపించాడు! నీరజ ఆ ఇంట్లోకి అడుగు పెట్టినరోజు కనబడిన

చుట్టాలందరూ మళ్ళీ రంగనాథం పోయిన రోజు కనబడ్డారు. పన్నెండవరోజు వరకూ అందరూ ఆ ఇంట్లోనే వుండిపోయారు. ఒంగోలు నుంచి, కందుకూరు నుంచి కూడా పదిమందిదాకా వచ్చారు!

పన్నెండవరోజు సాయంత్రానికి ఇల్లు ఖాళీ అయిపోయింది.

ఇంట్లో శ్రీధర్, నీరజ మిగిలారు!

తండ్రి పోయిన దుఃఖంలో వున్న శ్రీధర్‌ని ఆ రెండు వారాలూ కంటికి రెప్పలా చూసుకుంది నీరజ!

ఈ రెండు వారాలూ బొంగరంలా తిరగడంతో పూర్తిగా అలిసిపోయింది నీరజ.

చూస్తుండగానే రంగనాథం మొదటి మాసికం అయిపోయింది!

ఆ రోజు ఉదయం నీరజ కాఫీ కలుపుతూవుంటే, శ్రీధర్ సోఫాలో కూర్చుని పేపర్ చూస్తున్నాడు.

కాఫీ కలుపుతుంటేనే కడుపులో వికారంగా అనిపించింది నీరజకి!

శ్రీధర్‌కి కాఫీ కప్పు అందించి, అతని ఎదురుగా సోఫాలో కూర్చుంది నీరజ!

శ్రీధర్ కాఫీ సిప్ చేస్తూ పేపరు చూస్తున్నాడు.

నీరజకి కాఫీ తాగాలనిపించడం లేదు. బలవంతంగా ఒక గుక్క తాగగానే, వాంతి వచ్చినట్లయింది.!

పరిగెత్తుకెళ్ళి వాష్ బేసిన్‌లో వాంతి చేసుకుంది నీరజ!

మొహం కడుక్కుని, నాప్‌కిన్‌తో తుడుచుకుని, నీరసంగా వచ్చి సోఫాలో కూర్చుంది.

"ఏమయింది నీకు!" పేపరు టీపాయ్ మీద పెడుతూ అడిగాడు శ్రీధర్.

"ఏమో, వికారంగా వుంది. కడుపులో తిప్పుతోంది!" సోఫాలో వెనక్కువాలి కళ్ళు

మూసుకుంది నీరజ.

"రెస్టుగా కూర్చో- ఇప్పుడే వస్తాను!" మేడ మీదికి వెళ్ళి పాంట్, షర్ట్ వేసుకుని వచ్చాడు శ్రీధర్.

"పద"

"ఎక్కడికి? " విస్తుపోయింది నీరజ.

"లేడీ డాక్టర్ దగ్గరికి"

"ఈ మాత్రం దానికి డాక్టర్ ఎందుకు? " కదిలే ఓపిక లేదు నీరజకి.

"కళ్ళు తిరుగుతున్నాయి- పడుకోవాలని వుంది"

"ఆ డాక్టర్ మా ఫ్రెండ్ వైఫే! పైగా ఇంటికి వెళుతున్నాం. ఐదు నిముషాల్లో చూసి పంపించేస్తుంది!" నీరజని బలవంతంగా లేవదీస్తూ అన్నాడు శ్రీధర్!

కారు పది నిముషాల్లో దానవాయి పేటలో ఉంది.

బయట లాన్‌లో కూర్చుని పేపర్ చూస్తోంది డాక్టర్ సుధ.

"నమస్తే సుధగారు! మావాడు లేడా? "

"రండి శ్రీధర్‌గారూ, ఈయన ఏదో కాన్ఫరెన్స్ వుందట, హైదరాబాద్ వెళ్ళారు!' ' పనిమనిషితో మరో రెండు కుర్చీలు తెప్పించింది సుధ.

"నమస్తే" చేతులు జోడించింది నీరజ.

"మీ ఆవిడ కదూ! రిసెప్షన్ పార్టీలోనే చూడటం!" నవ్వింది సుధ.

"ఏమిటి పొద్దున్నే ఇలా వచ్చారు? "

"తనకి ఒంట్లో బాగోలేదు. ఒక వాంతి కూడ చేసుకుంది. ఒకసారి మీరు చూస్తే..."

"ష్యూర్... రా, అమ్మా!" నీరజను లోపలికి తీసికెళ్ళింది సుధ.

శ్రీధర్ అక్కడే కూర్చుని పేపరు చేతిలోకి తీసుకున్నాడు.

పది నిముషాల్లో తిరిగి వచ్చింది సుధ. "ఏమీ కంగారు పడకండి శ్రీధర్. నాన్నగారు పోయినప్పటి నుంచి రెస్ట్ లేదు కదా! జనరల్ వీక్‌నెస్ అంతే! బ్లడ్ తక్కువగా వున్నట్టుంది. టాబ్‌లెట్స్ వ్రాశాను!"

"థాంక్స్ డాక్టర్" కుర్చీలోంచి లేచాడు శ్రీధర్.

తిరిగి వస్తున్నప్పుడు "హమ్మయ్య- ఏమీ లేదట! డాక్టర్ ఏం చెబుతుందో అని ఒకటే టెన్షన్" అన్నాడు శ్రీధర్ కర్చీఫ్‌తో మొహం తుడుచుకుంటూ.

"ఆమె చెప్పిన టాబ్‌లెట్స్ రెగ్యులర్‌గా వాడు"

"చెప్పానుగా- ఏమీ వుండదని! మీరే అనవసరంగా కంగారుపడ్డారు!" చిరుకోపంతో అంది నీరజ.

అయితే శ్రీధర్ తన కోసం కంగారు పడ్డాడనే నిజం నీరజకి ఎంతో ఆనందాన్ని కలిగించింది. ఈ ప్రపంచంలో తను ఒంటరి కాదు- తనకోసం తపించే వాళ్ళున్నారు!

వాళ్ళ మొదటి మ్యారేజ్ డే రంగనాథం పోయిన వారంలోపే వచ్చింది. దుఃఖంలో వున్న నీరజకి ఆ విషయమే గుర్తుకు రాలేదు!

అయితే పదిహేను రోజుల తరువాత శ్రీధర్ ఆఫీస్ నుంచి వస్తూ కొత్త సెల్ తీసుకువచ్చి నీరజ చేతిలో పెట్టాడు. "మన మ్యారేజ్‌డేకి నీకేమీ ఇవ్వనే లేదు!"

పొంగిపోయింది నీరజ!

శ్రీధర్ చూడకుండా గట్టిగా ఆ సెల్‌ని ముద్దు పెట్టుకుంది!

"పైనుంచి మామయ్యగారు ఆశీర్వదిస్తున్నారేమో! అందుకే ఈ నెల లోపలే తన సంసారంలో కూడా కొన్ని ఆనంద క్షణాలు!" మనసులోనే రంగనాథంను స్మరించుకుంది నీరజ.

ఆ రోజు రాత్రి శ్రీధర్ వస్తూనే, "ఆకలి దంచేస్తోంది. అన్నీ డైనింగ్ టేబుల్ మీద రెడీ చేయి! పదినిముషాల్లో స్నానం చేసి వచ్చేస్తాను!" అంటూ మేడ మీదికి వెళ్ళిపో

యాడు.

చాకలి ఇస్త్రీ చేసి తీసుకుని వచ్చిన లుంగీలు, టవల్స్ కిందే వున్నాయి! టేబుల్ మీద అన్నీ సర్ది, టవల్ తీసుకుని పైకి వెళ్ళింది నీరజ.

శ్రీధర్ ఎవరితోనో సెల్‌లో మాట్లాడు తున్నాడు!

"నా రిపోర్ట్స్ అన్నీ మళ్ళీ ధరోగా చెక్ చేశారన్నమాట! ఆరు నెలలుగా మందులు వాడుతున్నా స్పెర్మ్ కౌంట్ పెరగలేదు! అయితే ఇక నాకు మామూలుగా పిల్లలు పుట్టే ఛాన్స్ లేనట్లే కదా! ఇట్స్ ఒకే! దీనికి మీరు సారీ చెప్పడం దేనికి?" శ్రీధర్ మాటలు గుమ్మం బయట వున్న నీరజకి స్పష్టంగా వినిపిస్తున్నాయి!

శ్రీధర్ ఫోన్‌లో ఎవరో డాక్టర్‌తో మాట్లాడుతున్నట్లుగా కూడా అర్థం అయి పోయింది!

అంటే... అంటే... శ్రీధర్‌కి పిల్లలు పుట్టరు- ఆరు నెలల క్రితమే ఈ సంగతి అతనికి తెలుసు!

"హమ్మయ్యా! ఏమీ లేదట! డాక్టర్ ఏం చెబుతుందో అని ఒకటే టెన్షన్!" అంటూ డాక్టర్ సుధ ఇంటి దగ్గర నుంచి తిరిగి వస్తున్నప్పుడు శ్రీధర్ ఎందుకు హ్యాపీగా ఫీల్ అయ్యాడో ఇప్పుడు అర్థం అవుతోంది!

"శ్రీధర్ తనమీద అనుమానపడ్డాడు! తనకి ప్రెగ్నెన్సీ వచ్చిందేమో అని ఆందో ళన పడ్డాడు! అతని ఆందోళనని తన మీద ప్రేమగా అన్వయించుకుని ఆనందపడింది తను!" అలా అనుకుంటున్నప్పుడు దుఃఖం పొంగి వచ్చింది నీరజకి.

★ ★ ★

నీరజ శ్రీధర్ దగ్గర ఆ ప్రస్తావన ఏమీ తీసుకురాలేదు.

అయితే అతనితో అంటీముట్టనట్లుగా వుంటోంది! శ్రీధర్‌కి వేళకి అన్నీ అమర్చి పెడుతుంది. అతను అడిగినదానికి సమా ధానం చెబుతుంది అంతే!

## కొత్తగాలి... 

**భూమి గుండ్రంగానే ఉందంటే**
**ఆశ్చర్యపోయాను**
**నాకొడుకూ చేర్చాడుగా**
**వృద్ధాశ్రమంలో మరి?**

-తమిరశ జానకి, హైదరాబాద్

రోజంతా రంగనాథం గదిలోని ఆధ్యా త్మిక పుస్తకాలతో కాలక్షేపం.

రాత్రిళ్ళు ఇద్దరూ కలసి భోజనం చేస్తారు!

భోజనం కాగానే శ్రీధర్ బెడ్‌రూంలో మంచం మీద వాలిపోయి, టీవీ ఆన్ చేస్తాడు. నీరజ చూడాలనుకుంటే టీ.వీ చూస్తుంది. లేకపోతే గోడవైపుకి తిరిగి పడుకుంటుంది!

ఆ రోజు భోజనాలు అయ్యాక మంచం మీద వాలి ఇద్దరూ టీ.వీ చూస్తున్నారు. ఎప్పుడూ రిమోట్ శ్రీధర్ చేతిలోనే వుంటుంది.

అతనికి నచ్చిన ప్రోగ్రాంలే నీరజ చూడాలి!

ఏదో ఛానల్‌లో 'ప్రేమికులకు మాత్రమే' అనే ప్రోగ్రాం నడుస్తోంది! ఎవరెవరో ఫోన్ చేసి తమ ప్రేమ కథలు వినిపిస్తు న్నారు!

"అంతేనా, ఇంకేమీ జరగలేదా? నిజం చెప్పండి, నేనెవరికీ చెప్పను!" అని మెలి కలు తిరుగుతూ, వెకిలిగా నవ్వుతూ ఆ ప్రోగ్రాం నడుపుతోంది మగ డ్రస్సులో ఉన్న లేడీ యాంకర్!

ఆ యాంకర్‌ని చూడలేక, ఆ ప్రేమ కథలు వినలేక ఆ వైపుకు తిరిగిపోయింది నీరజ.

ఒక బూతుపాట అయ్యాక "నెక్స్ట

కాలర్ ఎవరో చూద్దాం. "హలో" అంది యాంకర్.

"హలో- ఇది 'ప్రేమికులకి మాత్రమే' ప్రోగ్రాం కదండీ!"

"అవును. ఇది 'ప్రేమికులకి మాత్రమే' ఇంతకీ మీరు ప్రేమికులో కాదో చెప్ప లేదు!"

"అది చెప్పడానికి ఫోన్ చేశాను"

"ముందు ఎక్కడి నుంచి ఫోన్ చేస్తున్నారో చెప్పండి"

"మున్నంగి నుంచి- గుంటూరు జిల్లా"

"మీ పేరు"

"నా పేరు గోపి- మా నాన్నగారి పేరు ప్రకాశం" అంటూ అతను ఇంకా ఏదో చెప్పబోతుండగా అడ్డుపడింది యాంకర్.

"మీ వంశవృక్షంతో పనిలేదు. మీ ప్రేమ కథ చెప్పండి. ఇంతకీ మీ ప్రియురాలి పేరు? "

"తన పేరు నీరజ"

కళ్ళు మూసుకుని వున్న నీరజ ఆ పేరు విని ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది.

శ్రీధర్ టీవీ వాల్యూం బాగా పెంచేశాడు.

"చెప్పండి, నీరజతో మీ ప్రేమాయణం ఎప్పుడు మొదలయింది? అనవసరంగా పళ్ళు బయటపెట్టి, జీన్స్‌ప్యాంట్ సర్దుకుంది యాంకర్.

"ఇది పదిహేనేళ్ళ క్రితం మాట!"

"బాప్‌రే- ఇదేదో చరిత్రకు ఎక్కవలసిన కథలా వుందే! త్వరగా చెప్పండి గోపీగారూ!" సస్పెన్స్ భరించలేని దానిలా మొహం పెట్టింది యాంకర్.

అప్పట్లో నరసింహం గారు మా ఊరి పోస్ట్‌మాస్టర్‌గా పనిచేసేవారు. ఆయన చెల్లెలు తన కూతురుతో నీరజతో మా ఊరు వచ్చింది. మా ఊరి పసుపు తోటల్లో మొదటిసారి నీరజను చూసినప్పుడే నా మనసు చలించింది. రెండోసారి అరటి తోటలో చూసినప్పుడు నా మనసు ఎటో వెళ్ళిపోయింది"

"ఇంకెక్కడికీ... మీ ప్రియురాలు నీరజ దగ్గిరకే అయివుంటుంది" ఇకిలించింది యాంకర్!

నీరజ ఆలోచిస్తోంది. తను నరసింహం మామయ్య దగ్గరికి తల్లితో కలిసి మున్నంగి ఒకసారి వెళ్ళింది. కానీ ఈ గోపీ ఎవడు? ఎంత ఆలోచించినా గుర్తుకు రావడంలేదు! గోపీ చెబుతున్నాడు. ఒకరోజు చీకటిపడేవేళ కాలువ మీద వంతెన దాటుతున్న నీరజ కనిపించింది. నా మనసు ఆగలేదు! ఆమె బుగ్గలమీద ముద్దు పెట్టుకుని పారిపోయాను!"

"మీరేమీ తప్పుపని చేయలేదు... ప్రేమించడానికి ధైర్యం కావాలి" అంటూ

### అంతా 'లాసే'



ఆత్రేయ, తమిళకవి కణ్ణదాసన్ మంచి ఆత్మీయులు, ప్రాణస్నేహితులు. ఒకరోజు ఆత్రేయ కణ్ణదాసన్ గారిని కలసి 'నల్లా ఇరికింగ్లా' (బాగున్నారా? ) అంటూ కుశల ప్రశ్నవేశారు తమిళంలో.

అయితే కణ్ణదాసన్ "ఆ 'నల్లా' (బాగుగా) అనే పదాన్ని కొట్టేయండి! ఏదో 'ఉన్నాను' ఇలా" అన్నారట.

తరువాత ఆయన ఆత్రేయగారిని తెలుగులో 'మీరు కులాసా? ' అని అడిగితే- 'ఆ 'కులాసా'లో, 'కు'అనే అక్షరం కొట్టేయండి. అంతా 'లాసే' అన్నారట ఆత్రేయ నవ్విస్తూ.

ప్రేమికుల లక్షణాలు ఏకరువు పెడుతోంది యాంకర్.

నీరజకి లీలగా గుర్తుకు వస్తోంది. ఆ రోజు తను వంతెన మీదనుంచి వస్తూంటే ఎవరో వెనకనుంచి పరిగెత్తుకు వస్తున్నారు. "జామకాయల దొంగ- పట్టుకోండి!" అన్న కేకలు వినిపించాయి.

తనని దాటుకుని పారిపోబోతున్న ఒక కుర్రాడిని గట్టిగా పట్టుకుంది తను. వాడికి కూడా పద్నాలుగేళ్ళకి మించి వుండవు. అర్భకంగా వున్నాడు! విడిపించుకోడానికి ప్రయత్నిస్తున్నవాడి జుట్టు పట్టుకుని వంచి, వీపుమీద నాలుగు గుద్దులు వేసింది తను. వాడు చట్టున తన బుగ్గ మీద ముద్దు పెట్టుకున్నాడు.

"ఛీ... ఎంగిలి" అంటూ పరికిణీతో మొహం తుడుచుకుంటూ వుంటే ఆ కుర్రాడు పారిపోయాడు.

నీరజకి నవ్వొచ్చింది. అదేదో గొప్ప ప్రేమ కథలా టీవీ వాళ్ళకి చెబుతున్నాడు ఆ గోపీ!

"ఇంతకీ తరువాత కలిసినప్పుడు నీరజ మీతో మాట్లాడిందా!" యాంకర్ అనుమానం.

"లేదు, నవ్వింది. మరోసారి కనబడినప్పుడు 'ఐ లవ్ యూ' అంది. ఇద్దరం చెట్టాపట్టాలు వేసుకుని కాలవ గట్లమీద, అరటి తోటల్లో పరుగులు పెట్టాం-పాటలు పాడుకున్నాం! ఎన్నో బాసలు చేసుకున్నాం" గోపీ చెప్పుకుంటూ పోతున్నాడు.

"ఇడియట్-ఎన్ని కోతలు కోస్తున్నాడో!" పళ్ళు నూరుకుంది నీరజ.

"ఇంకా ఏం చేసుకున్నారో నాకు చెప్పరూ, ప్లీజ్" హొయలు ఒలకబోసింది యాంకర్.

"అవన్నీ పర్సనల్! అయితే మా ప్రేమ ఫలించలేదు" గోపీ గొంతులో విచారం.

"బ్యాడ్‌లక్... ఎందుకూ? " ఆత్రుతగా అడిగింది యాంకర్.

"సెలవలకి వచ్చిన నీరజ వాళ్ళ అమ్మతో వెళ్ళిపోయింది. ఇద్దరం ఉత్తరాలు వ్రాసుకోవాలని ప్రమాణం చేసుకున్నాం. నేను వ్రాసిన పన్నెండు ఉత్తరాలకీ జవాబు లేదు! పోస్ట్‌మాస్టర్ నరసింహం మా ఊరి నుంచి ట్రాన్స్‌ఫర్ అయివెళ్ళిపోయాక తెలిసింది, మేం వ్రాసుకున్న ఉత్తరాలు అతడు చించి వేశాడని! నీరజ ఎక్కడ వుందో తెలియదు. నేను మాత్రం ఏనాడయినా నా నీరజ వస్తుందనే ఆశతో బ్రహ్మచారిగానే మిగిలిపోయాను"

"అయామ్ సారీ గోపీగారూ! ఒకవేళ మీ ప్రియురాలు నీరజ ఈ కార్యక్రమం చూస్తూవుంటే తప్పకుండా మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తుంది. మీ ప్రేమ కథ సుఖాంతం అవుతుంది!" అంటూ గోపీని ఊరడించింది యాంకర్.

తరువాత "ఇంతటితో ఈనాటి 'ప్రేమికులకి మాత్రమే' కార్యక్రమం ముగిసింది. అన్ని కథలలోకి 'గోపీ-నీరజ'ల కథ ఉదాత్తంగా వుంది. ఉత్తమ ప్రేమకథకి ఇవ్వదలుచుకున్న ఈ పదివేలు ఖరీదు చేసే హారం గోపీగారికి అందించబడుతుంది" అంటూ ఒక బంగారుహారం అటూ ఇటూ తిప్పుతూ చూపించింది యాంకర్.

టీవీ ఆఫ్ చేశాడు శ్రీధర్.

పదినిముషాలపాటు ఆ గదిలో మౌనం రాజ్యమేలింది!

శ్రీధర్ మౌనం భీతి కల్పించేలా వుంది! గదిలో ఏ.సి. రన్ అవుతున్నా నీరజకి ముచ్చెమటలు పోస్తున్నాయి. తను తప్పేమీ చేయకపోయినా, శ్రీధర్ కేసి తిరగాలంటేనే భయంగా వుంది.

ఆ గోపీ చెప్పిన కల్పిత ప్రేమకథ పర్యవసానం ఏమిటి?

## కొత్తగాలి...

కొత్తపార్టీ
అయస్కాంతం
ఉన్నపార్టీ
'సూర్యకాంతం'

-అద్దేపల్లి భరత్‌కుమార్, చిలకలూరి పేట

శ్రీధర్ గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నట్లుగా తెలుస్తోంది.

"పోస్ట్‌మాస్టర్ నరసింహం మీ మామయ్యకదా! ఎప్పుడో ఒకసారి మున్నంగి వెళ్ళినట్లు నాకు చెప్పావు కూడానూ!" హఠాత్తుగా అన్నాడు శ్రీధర్.

"నీరజకి నోరు పెగలడంలేదు.

"మాట్లాడవే? నీ ప్రియుడు చెప్పిన ప్రేమ కథను విన్నావుగా!"

"వాడు నా ప్రియుడేంటీ, వాడి మొహం!"

"నటించకు"

"లేదండీ, నేను నిజమే చెబుతున్నాను. అసలు ఏం జరిగిందంటే..." జరిగిందంతా పొల్లుపోకుండా శ్రీధర్‌కి చెబుదాం అనుకుంది నీరజ.

"ఆ సోది నాకు అనవసరం. ఒక మాటకి జవాబు చెప్పు- అతను నీ బుగ్గ మీద ముద్దు పెట్టుకున్నాడా, లేదా? " సూటిగా అడిగాడు శ్రీధర్.

"ఏవేవో కల్పించాడు- జరగనివన్నీ జరిగాయి అన్నాడు- ఉత్తరాలు రాసుకున్నాం అన్నాడు కానీ..."

"నాకు కావలసింది వాడు నిన్ను ముద్దు పెట్టుకున్నాడా లేదా అన్న విషయం! అంతే!"

"పెట్టుకున్నాడు.. అయితే..."

"ఇంకేమీ చెప్పకు! కందుకూరులో కలిసినప్పుడే నీకు ప్రేమాయణాలు ఏమయినా వున్నాయా అని తరచి తరచి అడిగాను. ఏమీ లేవన్నావు!"

"ఇది ప్రేమాయణం కాదు!"

"వాడు నిన్ను ముద్దుపెట్టుకున్నాడు కదా!"

"వాడు చెప్పేదాకా ఆ సంగతే నాకు గుర్తు లేదు"

"గుర్తులేనంత మందికి ముద్దులిచ్చావా నువ్వు? "

బలవంతంగా నీరజను తన వైపుకి తిప్పుకున్నాడు శ్రీధర్.

ఆ కళ్ళు అగ్నిగోళాల్లా ఉన్నాయి. మొహం అంతా స్వేదం- ఒళ్ళంతా కంపిస్తోంది- పెదవులు పక్కకుపోతున్నాయి!

ఉన్మాదిలా కనిపిస్తున్న శ్రీధర్‌ని చూసి 'కెవ్వు'మనబోయి, తమాయించుకుంది నీరజ.

"మీరు నమ్మినా నమ్మకపోయినా చిన్నతనంలో జరిగిన ఆ సంఘటన ఇప్పటిదాకా నాకు గుర్తులేదు" మొండిగా అంది నీరజ.

నీరజను విసురుగా పక్కకు తోసేసి, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ, కిందకు వెళ్ళిపోయాడు శ్రీధర్.

నీరజ తలంతా మొద్దుబారిపోయినట్లుంది! పక్కకు ఒత్తిగిల్లే ఓపిక కూడా లేనంత నిస్సత్తువగా అనిపించింది!

నీరజకి మెలుకువ వచ్చేసరికి ఆరవుతోంది!

గబగబా మెట్లు దిగి కిందకి వచ్చింది. శ్రీధర్ రంగనాథం గదిలో నిద్రపోతున్నాడు.

"హమ్మయ్య" అనుకుని, బాత్‌రూంలోకి నడిచింది.

నాలుగు రోజులపాటు నీరజతో ఏమీ మాట్లాడలేదు శ్రీధర్. ఇంట్లో భోజనం కూడా చేయలేదు. రాత్రి పడుకోవడం కూడా రంగనాథం గదిలోనే.

"అసలు ఈయన ఉద్దేశం ఏమిటో సూటిగా అడిగేయాలి! ఇప్పటికి ఆ ఆవేశం కొద్దిగా తగ్గివుంటుంది. అప్పుడు జరిగిందే మిటో వివరించాలి! ఈ మౌనవ్రతం భరిం చడం తనవల్ల కాదని గట్టిగా చెప్పేయాలి! అతని మనసు బాధపడి వుంటే క్షమించ మని అడగాలి! అసలే తండ్రిపోయిన బాధలో వున్నాడు. బిజినెస్ తలనొప్పులు ఎన్నో వుంటాయి. తను సాధ్యమైనంత వరకూ అతను సంతోషంగా వుండేలా చూడాలి!" స్నానం చేస్తూ ఒక నిర్ణయానికి వచ్చింది నీరజ!

ఆమె స్నానం చేసి వచ్చేసరికి ఇవతల శ్రీధర్ నిలబడి వున్నాడు!

అతను నీరజను చూస్తూనే మొహం పక్కకు తిప్పుకుని, ఏదో కాగితాలని మంచం మీదకు విసిరికొట్టాడు.

"ఏమిటివి? " ఆశ్చర్యంగా అడిగింది నీరజ.

"విడాకుల పత్రాలు. నువ్వు నన్ను మోసం చేశావు. ఇక నేను నీతో కాపురం చేయలేను!" ఖచ్చితంగా అన్నాడు శ్రీధర్.

మాన్పడిపోయింది నీరజ. "నేనే తప్పు చేయలేదు. నన్ను నమ్మండి. జరిగింది చెబుతాను పూర్తిగా వినండి!"

"నాకేమీ చెప్పొద్దు- ఎవడో నిన్ను ముద్దుపెట్టుకున్నాడనే ఊహే నేను భరిం చలేను!"

"అదికాదు"

"ఇక వాదనలు అనవసరం! నువ్వీ కాగి తాల మీద సంతకం పెట్టకపోతే ఈ సాయంత్రం లోపల నా శవం కళ్ళచూ స్తావు!"

నాలుగు రోజులుగా నిద్రలేదేమో, శ్రీధ ర్‌కి మొహం అంతా పీక్కు పోయిన ట్లుంది. జుట్టు చిందర వందరగా, కళ్ళు ఎర్రగా, బట్టలు నలిగిపోయి అన్నంతపనీ చేసేవాడిలా కనిపిస్తున్నాడు!

క్షణంపాటు అతని మొహంలోకే చూసి, ఆ కాగితాలు చేతిలోకి తీసుకుంది నీరజ.

"ఇదిగో పెన్ను" చొక్కా జేబులోంచి పెన్ను పైకి తీశాడు శ్రీధర్.

నీరజ చిన్నగా నవ్వింది. "క్షణం ఆలస్యం కూడా భరించలేనట్లుగా వున్నారు!"

"ముందు సంతకాలు పెట్టు"

ఆ కాగితాల మీద పెట్టవలసినచోట సంతకాలు పెట్టేసింది నీరజ.

"థ్యాంక్స్!" కాగితాలు చేతిలోకి తీసుకు న్నాడు శ్రీధర్.

"మళ్ళీ చెబుతున్నాను- నేను నిరపరా ధిని!"

"ఇకనాకేమీ చెప్పవలసిన పనిలేదు" వెళ్ళిపోయాడు శ్రీధర్.

కారు వెళ్ళిపోయిన సౌండ్ వినిపించాక, అలా అచేతనంగా పావుగంటసేపు మంచం మీదే కూర్చుండిపోయింది నీరజ!

ఇప్పుడు తనేం చేయాలి?

దిక్కుతోచని పరిస్థితి?

ఇక ఈ ఇంట్లో తనకి స్థానం లేనట్లే!

ఎక్కడికి వెళ్ళాలి?

వెళ్ళి ఏం చేయాలి?

బీరువా మీదనుంచి సూట్‌కేస్ దింపి, తను తెచ్చుకున్న చీరలు మాత్రం సర్దు కుంది నీరజ. పైన తల్లి ఫొటో పెట్టు కుంది!

బీరువాకి, బెడ్‌రూంకి తాళం పెట్టి, కిందికి వచ్చింది.

రాజమ్మ హాలు తుడుస్తోంది.

"రాజమ్మా, ఈ తాళాలు అయ్యగారు రాగానే ఇచ్చేయి!" టీపాయ్ మీద తాళాలు పెడుతూ అంది నీరజ.

"తమరెక్కడికమ్మా? " పెళ్లయి ఆ ఇంటికి వచ్చాక, ఎక్కడికీ కదలని నీరజ, ఒంటరిగా సూట్‌కేస్‌తో బయలుదేరడం చూసి ఆశ్చర్యపోయింది రాజమ్మ.

"అయ్యగారితో, మీరు ఎక్కడికి వెళ్లారని చెప్పాలి? "

"ఆ సంగతి అయ్యగారికి తెలుసులే!" హాల్లో రంగనాథం ఫోటోకి వేసివున్న దండను సవరించి, చిన్నగా అడుగులు వేసుకుంటూ బయటకు వెళ్లిపోయింది నీరజ.




**అ**మ్ముకునేవాళ్ల అరుపులతో, బిచ్చగాళ్ల పాటలతో రైలంతా గోలగోలగా ఉంది!

ఒక పక్కగా కిటికీ దగ్గర కూర్చుని బయటకు చూస్తోంది నీరజ! మొహంమీద పడుతున్న జుట్టును పక్కకు తోసుకోవాలనే ఆలోచన కూడా లేదు!

రెండు గంటల క్రితం కందుకూరు వెళ్లడానికి, ఇంటి నుంచి తిన్నగా రైల్వే స్టేషన్‌కి వచ్చింది నీరజ!

"పది నిముషాల్లో జన్మభూమి ఎక్స్‌ప్రెస్ వస్తుంది!" అన్నారు ఎంక్వయిరీలో ఒంగోలు రైలును గురించి అడిగితే.

తెనాలి టికెట్ కొనుక్కుని రైలెక్కేసింది నీరజ!

కిటికీలోంచి చల్లగాలి వీస్తున్నా మెదడు వేడెక్కిపోయింది! తను గవర్నమెంట్ ఉద్యోగం వదులుకుని పెద్ద తప్పే చేసింది! ఆర్థిక స్వాతంత్ర్యం లేని ఆడది మగవాడికి అణిగిమణిగి వుండవలసిందే! స్వతంత్రించి ఏ నిర్ణయమూ తీసుకోలేదు! తన దగ్గర ఇరవైవేల రూపాయలు కాబోలు వున్నాయి. కందుకూరు బ్యాంక్‌లో మరో పదివేలు వుండవచ్చు! ఇవి ఖర్చయిపోయే లోగా ఏదయినా ఉద్యోగం చూసుకోవాలి! శ్రీధర్ భరణం ఇస్తానన్నా తనకి అవసరం లేదు!

ఆమధ్య ఫోన్‌లో క్రింద వాటాలోకి వచ్చిన కుటుంబం మంచిది కాదని, ఆ ఇంట్లో రోజు గొడవలే అని, త్వరలోనే వాళ్లచేత ఇల్లు ఖాళీ చేయిస్తానని రత్నం ఆంటీ చెప్పింది!

తమ వాటా ఖాళీగా వుంటే అంతకుమించిన అదృష్టం మరొకటి వుండదు!

జరిగిన దానికి రత్నం ఆంటీ, గోపాలరావుగారు చాలా బాధ పడతారు! తనని నిందించరనే ధైర్యం వుంది! తనని అర్థం చేసుకున్న మనుషులు వాళ్లే!

తన శేషజీవితం కందుకూరులోనే రాసిపెట్టినట్లుంది. అందుకే పెళ్లయి ఏడాది దాటగానే తిరిగి ఒంటరిగా కందుకూరు చేరుకుంటోంది తను!

ఆలోచనలలో వున్న నీరజ రైలు తెనాలి స్టేషన్‌లో ఆగడం గమనించనే లేదు!

చిన్నగా రైలు దిగింది!

ప్రతి ప్లాట్‌ఫాం మీదా గుంపులు గుంపులుగా జనం!

"బాపట్లకి అవతల గూడ్స్ పట్టాలు తప్పిందట- ఉదయం నుంచీ ఒంగోలు సైడు రైళ్లు లేవు!" ఎవరో చెప్పారు!

ఉస్సూరుమంది నీరజ ప్రాణం!

ప్లాట్‌ఫాంమీదే రెండు ఇడ్లీలు తిని, కాఫీ తాగి సూట్‌కేస్ మీదే కూర్చుంది!

సాయంత్రం నాలుగు దాటింది!

ప్లాట్‌ఫారాలన్నీ క్రిక్కిరిసి వున్నాయి.

"ఆరయ్యాక ముందు కృష్ణాని పంపిస్తారట" ఎవడో కూలీ చెప్పాడు.

ఆ జనం చూస్తే నీరజకి భయం వేసింది!

అరడజను రైళ్లు వెళితేనేగానీ రైలు ఎక్క

గలిగేలా లేదు పరిస్థితి!

అంతకన్నా బస్సు కోసం ప్రయత్నిస్తే మంచిది!

ముందే తనకి ఆ ఆలోచన రానందుకు తిట్టుకుంటూ చిన్నగా నడుచుకుంటూ బయటకు వచ్చి, బస్సు స్టాండ్‌కి రిక్షా మాట్లాడుకుంది!

బస్సు స్టాండ్‌లో రెండు విజయవాడ బస్సులు, ఒక మచిలీపట్నం బస్సు, ఒక రేపల్లె బస్సు మాత్రం వున్నాయి!

సూట్‌కేస్ పక్కన పెట్టుకుని ఒక సిమెంట్ బెంచీ మీద కూర్చుంది అలసటగా!

బస్సు స్టాండ్ మురికిగా ఉంది!

ఝూమ్మంటూ ముసురుకుంటున్న ఈగలు, ముష్టివాళ్లు!

పది నిముషాల తరువాత ఏదో బస్సు వచ్చి, నీరజ కూర్చున్న బెంచీకి దగ్గరగా ఆగింది!

ఊరి పేరు చూడటం కోసం లేచి నిలబడింది నీరజ. 'మున్నంగి'.

ఆ పేరు చూడగానే గోపీ గుర్తుకు వచ్చి కోపంతో మొహం ఎర్రబడింది. ఆ ఫూల్ చెప్పిన కట్టుకథ వల్ల తన జీవితం ఇలా అయిపోయింది! వాడిని విడిచిపెట్టకూడదు! తగిన బుద్ధి చెప్పాలి! తను కందుకూరు రేపయినా వెళ్లవచ్చు. ముందు 'మున్నంగి' వెళ్లాలి. ఆ గోపీని పట్టుకోవాలి! వాడెలాంటి వాడయినా తను బెదరకూడదు- మెత్తపడకూడదు! తన నైజానికి విరుద్ధంగా కఠినంగా వ్యవహరించాలి! అవును, ఆ గోపీగాడిని వదలకూడదు- వాడి పని పట్టాలి!

ఒక నిర్ణయానికి వచ్చిన నీరజ 'మున్నంగి' బస్సు ఎక్కి కూర్చుంది!

బస్సు కాలవగట్టు దాటుకుని, పచ్చని పొలాల మధ్యలోంచి వెళుతోంది!

దాదాపు పదిహేనేళ్ల క్రితం, తల్లితో ఆ ఊరు వెళ్లడం గుర్తుకు వచ్చింది! అప్పుడు

## కొత్తగాలి...

**సిప్పయినా**
**గాసిప్పయినా**
**ఆధారం**
**లిప్పే బ్రదరూ**

– జి. వర్మ, విశాఖపట్నం

కూడా తెనాలిలో రైలు దిగి, బస్సు ఎక్కారు! వారం రోజుల తరువాత తండ్రి వచ్చి, రెండు రోజులుండి, తమని వెనక్కి తీసుకువచ్చేశాడు! ఆ పదిరోజులూ మున్నంగిలో ఆనందంగా తిరిగింది! ఆ జ్ఞాపకాలను మదిలో అపురూపంగా దాచుకుంది! అయితే ఆ ఊరు వెళ్లడమే ఒక శాపంగా మారి, తన జీవితం అగమ్యగోచరంగా అయిపోయింది!

దీనికంతటికీ కారకుడైన ఆ గోపీని, కనిపించగానే రెండు దవడలూ వాయించాలి!

బస్సు మున్నంగి చేరుకునేసరికి ఆరవుతోంది! చీకట్లు ముసురుకుంటున్నాయి! దుకాణాలలోనూ, వీధిలోనూ దీపాలు వెలిగాయి!

బజారులో బస్సు దిగింది నీరజ!

పదిహేనేళ్ళ క్రితం చూసిన ఆ ఊరిని, చీకట్లో పోల్చుకోలేకపోయింది!

బరువుగా వున్న సూట్‌కేస్‌ను ఒక పక్కనే పెట్టి, అక్కడ వున్న మెడికల్ షాప్ దగ్గరికి నడిచింది. "గోపీ ఇల్లు ఎక్కడో చెప్పగలరా? "

షాపులో ఒక అరవైఏళ్ళ ముసలాయన వున్నాడు. పాతికేళ్ళ కుర్రాడు అటక మీద నుంచి ఏవో దింపుతున్నాడు.

నీరజనే తేరిపార చూశాడు ముసలాయన "ఏ గోపీ!" క్షణం ఆలోచించింది నీరజ "ప్రకాశం గారి అబ్బాయి"

## కొత్తగాలి...



**దారిలో నడిస్తే నాకంలో**
**అడ్డంగా నడిస్తే నరకంలో**
**ఎటూ నడవకపోతే తనలో**
**ఐక్యం చేసేవాడే దేముడు!**

*-డాక్టర్ ఎం. విజయగోపాల్, విశాఖ*

"ఆ గుడి దాటి పైకి వెళ్ళాక కుడివైపు రెండో వీధి" వేలు పెట్టి చూపించాడు ముసలాయన.

"థాంక్స్ అండీ" సూట్ కేస్ చేతిలోకి తీసుకుని చిన్నగా నడుస్తోంది నీరజ!

దుకాణాల బయట నిలబడి వున్న వాళ్ళూ, ఇళ్ళ అరుగుల మీద కూర్చుని వున్న వాళ్ళూ నీరజనే చూస్తున్నారు!

నీరజకి ఇబ్బందిగా వుంది!

తల వంచుకుని నడుస్తోంది!

ముసలాయన చెప్పిన సందులోకి తిరగ గానే, ఒక చిన్న కుర్రాడు పరిగెత్తుకుంటూ వస్తూ కనిపించాడు.

"ప్రకాశంగారి ఇల్లు ఏది బాబూ!" ఎక్కడ పారిపోతాడో అన్నట్లుగా ఆ కుర్రాడి చేయి పట్టుకుంది నీరజ.

పదిహేనేళ్ళ క్రితం గోపీ చేయి కూడా ఇలాగే పట్టుకుంది!

"ఎడంవైపు నాలుగో ఇల్లు!" కుర్రాడు తుర్రుమన్నాడు.

అదో చిన్న డాబా ఇల్లు! తలుపు మూసి వుంది!

అరుగుమీద సూట్ కేస్ పెట్టి, తలుపు గడియ చప్పుడు చేసింది నీరజ!

లోపలనుంచి పెద్దగా వినిపిస్తోంది టీవీ సౌండ్!

గోపీ తలుపు తీయగానే ఎడం కాలి చెప్పుతో దవడలు రెండూ వాయించాల న్నంతా ఆవేశంగా వుంది నీరజకి!

"గోపీ ఇవాళ నీ పని అయిపోయింది!" ఆవేశంగా పళ్ళు కొరుక్కుంది నీరజ! తనలో ఎక్కడలేని ధైర్యం రావడం తనకే ఆశ్చర్యంగా వుంది!

టీవీ గోల తప్పించి, ఎవరూ వస్తున్న అలికిడి లేదు.

మరోసారి గట్టిగా, గడియ చప్పుడు చేసింది నీరజ!

"వస్తున్నా, వస్తున్నా!" ఒక పాతికేళ్ళ అమ్మాయి వచ్చి తలుపు తీసింది. చంకలో ఒంటిమీద చొక్కా మాత్రం వున్న ఏడాది కుర్రాడు.

"ఎవరు కావాలి మీకు!" కుర్రాడిని ఎడం చంకలోకి మార్చుకుంటూ అడిగింది ఆ అమ్మాయి.

"గోపీ ఉన్నాడా? "

"లేదు- మీరెవరు? " ముందుగదిలో లైటు వేసింది ఆ అమ్మాయి.

ఆ గదిలో ఒక మూల గోడకి మడత మంచం ఆనిచ్చి వుంది. అడ్డదిడ్డంగా నాలుగు ప్లాస్టిక్ కుర్చీలు - కింద చిందర వందరగా మరమరాలు!

"పోనీ ప్రకాశంగారు ఉన్నారా? " ఆ అమ్మాయినే పరిశీలనగా చూస్తూ అడి గింది నీరజ!

"అందరూ పెళ్ళికని బెజవాడ వెళ్ళారు! రేపు పొద్దున్న వస్తారు. అలా గుమ్మం లోనే నిలబడిపోయారు! లోపలికి రండి!" అంది ఆ అమ్మాయి పక్కకు తప్పుకుంటూ!

నీరజ అప్రయత్నంగా లోపలికి అడుగు వేసింది! సూట్ కేస్ తలుపు పక్కనే పెట్టి, నిస్సత్తువగా ప్లాస్టిక్ కుర్చీలో కూలబడిపో యింది!

ఆ అమ్మాయి కుర్రాడిని దింపి, స్టీలు గ్లాసులో మంచినీళ్ళు తీసుకు వచ్చింది. "నా పేరు కమల. ఇంతకీ మీరెవరో చెప్పనే లేదు!"

"ప్రకాశం గారితో ఒక ముఖ్యమైన

విషయం మాట్లాడాలి! ఇంతకీ గోపీ..."

"మా ఆయనే!" కొద్దిగా సిగ్గుపడింది కమల.

నీరజకి పాలమారింది. "గోపీ ఇంకా తనకి పెళ్ళికాలేదన్నాడు!"

"అయ్యో రామా! నాలుగేళ్ళ క్రితమే మా పెళ్ళయింది. వీడు పుట్టి పదకొండు నెలలు..." కింద పాకుతున్న కుర్రాడిని చంకలోకి తీసుకుంది కమల!

పిల్లవాడు కూడా తల్లిలాగే పెద్ద పెద్ద కళ్ళతో, తెల్లగా వున్నాడు! ఆ పిల్లవాడి మొహంలోని అమాయకత్వమే కమలలోనూ కనిపించింది నీరజకి!

"చూడండి! నా పేరు నీరజ! రాజమండ్రి నుంచి నేను మీ వాళ్ళతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడటానికి వచ్చాను. అయితే సమయానికి వాళ్ళు లేరు!"

"తెల్లవారగానే వచ్చేస్తారు! మీరేమీ మొహమాట పడవద్దు! ఈ ఇల్లు మీ ఇల్లే అనుకోండి!" స్వచ్ఛంగా నవ్వింది కమల!

నీరజ ఆలోచనలో పడింది! తను మాత్రం ఈ చీకట్లో ఎక్కడికి వెళుతుంది! ఆ గోపికి గడ్డి పెట్టిగానీ ఈ ఇంట్లోంచి కదలకూడదు!

"చికాకుగా వుంది! స్నానం చేస్తాను!" సూట్‌కేస్‌లోంచి చీర, టవల్, సోప్ తీసుకుంది నీరజ!

లోపలి గదిలో టి.వి. ఆఫ్ చేసి నీరజకి పెరట్లో వున్న బాత్‌రూం చూపించింది కమల! ఒంటిమీద చల్లటి నీరు గుమ్మరించుకుంటూ వుంటే ఎంతో సేద దీరినట్టుగా అనిపించింది నీరజకి!

నీరజ స్నానం ముగించుకుని వచ్చేసరికి "హ్యాండ్ బ్యాగ్‌లో మీ సెల్ మోగితే మీకిద్దామని తీశాను! కట్ అయిపోయింది! ఈ పుస్తకం మీద నంబరు నోట్ చేశాను!" ఏదో మేగజైన్‌తో పాటు, సెల్ కూడా నీరజ చేతికి అందించింది కమల!

"నంబర్ సెల్‌లో కనిపిస్తుందిలెండి!" మేగజైన్ కిటికీలో పెట్టేసింది నీరజ!

ఆశ్చర్యం! శ్రీధర్ నుంచి ఫోన్ వచ్చింది!

ఇప్పుడు శ్రీధర్ ఫోన్ ఎందుకు చేసినట్లు?

నీరజ టవల్ కుర్చీమీద ఆరేస్తూ వుంటే మళ్ళీ సెల్ మోగింది.

ఇష్టంలేకపోయినా 'హల్లో' అనక తప్పలేదు నీరజకి!

"కందుకూరులో నీ సామాను నీకు అప్పజెప్పమని మా మధు బావకి చెప్పాను!" పొడిగా అన్నాడు శ్రీధర్.

"థ్యాంక్స్" సెల్ ఆఫ్ చేసింది నీరజ.

"మీ ఆయన దగ్గర నుంచి ఫోనా? " ఆరాగా అడిగింది కమల. ఏమనాలో తెలియక అవునన్నట్లుగా తల వూపింది నీరజ.

"అప్పుడే ఫోన్ పెట్టేశారేం!"

"ఆయన చాలా బిజీగా ఉన్నారు!"

"మా ఆయన ఫోన్ పట్టుకుంటే వదలరు!" నవ్వింది కమల!

నీరజ ఏమీ మాట్లాడలేదు.

వెండి కంచంలో కలిపి తెచ్చిన పెరుగన్నం పిల్లవాడికి తినిపిస్తూ ఏవేవో కబుర్లు చెబుతోంది కమల!

అన్యమనస్కంగా ఊ కొడుతోంది నీరజ!

"వీడు మరో గంటకిగానీ పడుకోడు! పక్కింటి రాజ్యానికి వీడిని ఇచ్చి వస్తాను! మనం భోజనం చేసేద్దాం!"

నీరజ నుంచి జవాబు కోసం ఆశించకుండా, వీధి తలుపు దగ్గరగా వేసి వెళ్ళిపోయింది కమల!

నీరజకి అంతా విచిత్రంగా అనిపిస్తోంది. ముక్కూ మొహం తెలియని వాళ్ళింట్లో భోజనం!

వంటింట్లో రెండు పీటలు వాల్చి, రెండు కంచాల్లో ఇద్దరికీ వడ్డించింది కమల!

అరటికాయ వేపుడు, వంకాయ పెరుగు పచ్చడి, కంది పొడి వున్నాయి కంచంలో!

"మొహమాట పడకండి!" అన్నం కెరడు మీద కాచిన నెయ్యి వడ్డిస్తూ నవ్వింది కమల!

క్రితం రాత్రే భోజనం చేయడం! కరక రమంటున్న ఆకలి నీరజలోని మొహమా టాన్ని అవలీలగా జయించింది.

కమల వంట అద్భుతం అనిపించింది!

"అన్నీ బావున్నాయి!" పెరట్లో చేయి కడుక్కుంటూ అంది నీరజ.

"మీరు వంట బాగా చేస్తారు!"

భోజనం పూర్తి చేసాక, పావుగంటసేపు పెరట్లో పచార్లు చేసింది నీరజ!

చుట్టూ ఆవరించుకుని ఉన్న కటిక చీక టిలా కనిపించింది భవిష్యత్తు!

దూరంగా పారిజాతం చెట్టు మీద ఎగు రుతున్న మిణుగురులు ఆ చీకట్లో చిరుదీ పాల్లా వున్నాయి!

"ఈ చీకటి శాశ్వతం కాదు- కాస్సేపట్లోనే తెల్లవారుతుంది- వెలుతురు కూడా వస్తుంది!" తనకి తాను ధైర్యం చెప్పుకుని ఇంట్లోకి నడిచింది నీరజ!

ఆసరికి ముందు గదిలో మడత మంచం వాల్చి దుప్పటి పరుస్తోంది కమల! "అప్పుడే తొమ్మిది దాటింది! ప్రయాణం చేసి వచ్చారు కదా- తొందరగా పడుకుంటారని..."

"కొత్త ప్రదేశం కదా- నిద్ర పట్టకపో వచ్చు"

"కళ్ళు మూసుకోండి- అదే పడుతుంది! రాత్రి బాత్‌రూమ్‌కి వెళ్ళాలంటే నన్ను లేపండి- లోపలి గదిలో వుంటాను!"

"నేను రాత్రిళ్ళు లేవను!"

"నానిగాడికి పాలు తాగించి పడుకోబె ట్టాలి!" లోపలికి వెళ్ళిపోయింది కమల.

మడత మంచం మీద వాలింది నీరజ! బయట కీచురాళ్ళ రొద!

ఇదంతా నిజమేనా? తను జీవితంలో ఏనాడు ఊహించలేదు- ఇలా అపరిచితుల ఇంట భోజనం, నిద్ర! తల్లిపోయిన కొత్తల్లో రత్నం రాత్రిళ్ళు తమ ఇంట్లో పడుకోమన్నా మొహమాటంకొద్దీ వెళ్ళేది కాదు! రత్నమే వచ్చి తనకి సహాయంగా పడుకునేది! అటు వంటి తను ఇలా ఎవరింటికో ఎలా వచ్చే సింది? ఇదంతా కలలా తోస్తోంది! తన జీవితంలో పెళ్ళి కూడా అలాగే జరిగి- కల లాగే కరిగిపోయింది! అసలు తనకి ఇంత ధైర్యం ఎలా వచ్చింది? నిజానికి కొత్తవా ళ్ళతో మాట్లాడాలంటేనే తనకి బెరుకు? పిల్లలతోటే తన ప్రపంచం! తనలో ఇంత మార్పు రావడానికి కారణం ఎవరు? శ్రీధరా? జీవితంలో ఎదురయినా పరిస్థి తులా? అంతా చిత్రవిచిత్రంగా అనిపి స్తోంది.

లోపలి నుంచి, పిల్లవాడిని నిద్రపు చ్చుతూ కమల పాడుతున్న జోలపాట చిన్నగా వినిపిస్తోంది.

★ ★ ★

నీరజ నిద్ర లేచేసరికి ముందు గదిలోని గోడ గడియారంలో ముళ్ళు రెండూ ఎని మిది మీద ఉన్నాయి!

"అమ్మో ఎంత పొద్దుపోయిందో!" మడత మంచం గోడకు ఎత్తేసి, బ్రష్ టవల్ తీసుకుని బాత్‌రూంలోకి నడి చింది. నీరజ!

ఆసరికే పిల్లవాడి స్నానం చేయించి టవ ల్‌తో ఒళ్ళు తుడుస్తున్న కమల, నీరజను చూసి పలకరింపుగా నవ్వింది. "రాత్రి సరిగ్గా నిద్ర పట్టినట్లు లేదు!"

అవునన్నట్లుగా తల వూపింది నీరజ.

"తెల్లవారుజామున కునుకు పట్టడంతో లేచే సరికి ఈవేళ అయింది"

మొహం కడుక్కున్న వెంటనే, స్నానం కూడా పూర్తిచేసి వచ్చింది నీరజ.

కమల పిల్లవాడికి గ్లాసుతో పాలు పట్టి స్తోంది. "ఐదు నిముషాల్లో కాఫీ తెస్తాను"

అన్నట్లుగానే ఐదు నిముషాల్లో రెండు

స్టీలు గ్లాసుల్లో కాఫీ తీసుకువచ్చింది కమల.

కాఫీ సిప్ చేస్తున్న నీరజలో మళ్ళీ రక రకాల ఆలోచనలు! తన భవిష్యత్తు ఏమిటి? కందుకూరులో ఏదయినా ఉద్యోగం దొరుకుతుందా? లేకపోతే ఎక్క డికి వెళ్ళాలి? తనకిక జీవితకాలపు ఒంటరి పోరాటం తప్పదు! అమ్మ అదృష్టవంతు రాలు- వెళ్ళిపోయింది! లేకపోతే తన ఇప్పటి పరిస్థితికి బెంగ పెట్టుకుని మంచం పట్టేసివుండేది! శ్రీధర్‌ని వదిలి రావడంలో తను ఏమాత్రం తొందరపడలేదు! ఆ విష యంలో తనకి పశ్చాత్తాపం అణు మాత్రం కూడా లేదు!

“అదిగో మా వాళ్ళు వచ్చేశారు!” కొడు కును చంకలో వేసుకుని కుర్చీలోంచి లేచింది కమల!

యాభై ఐదేళ్ళ బట్టతల మనిషి, దాదాపు యాభై ఏళ్ళున్న స్థూల కాయపు ఆడమ నిషి, భుజానికి ఎయిర్ బ్యాగ్‌తో సన్నగా, పొడవుగా, గెడకర్రలా ఉన్న ముప్పై ఏళ్ళ వ్యక్తి లోపలికి వచ్చారు!

ఆ గెడకర్రని గోపీగా పోల్చుకుని, అత డినే పరిశీలనగా చూసింది నీరజ! మనిషి చామనఛాయలో చిరుమెల్లతో, కురచ జుట్టుతో అతి సాధారణంగా వున్నాడు. ఇటికె రంగు ప్యాంటు మీద, చారల నీలం చొక్కా! కాళ్ళకి అరిగిపోయిన పాత చెప్పులు!

తన జీవితంలోకి తుఫాను మోసుకు వచ్చిన అపరిచితుడు! కుర్చీలో కూర్చుని కాఫీ తాగుతున్న నీరజను చూసి ఖంగుతి న్నారు ముగ్గురూ!

కోడలి చేతిలోంచి పిల్లవాడిని అందు కుంటూ, “ఎవరీ అమ్మాయి? ” అన్నట్లుగా కమల కళ్ళల్లోకి చూసింది జయమ్మ.

“నీరజగారట! బావను కలవడానికి రాజ మండ్రి నుంచి వచ్చారు!” గోపీ చేతిలోని ఎయిర్‌బ్యాగ్‌ను అందుకుంటూ అంది కమల.

“నన్ను కలవడానికా? ” ఖంగుతిన్నాడు గోపీ.

“ఎవరివమ్మా నువ్వు? ” విచిత్రంగా నీర జనే చూస్తూ అడిగింది జయమ్మ.

ఆ మాటలకు జవాబు చెప్పకుండా, “గోపీ బావున్నావా? మళ్ళీ ఇన్నేళ్ళ తర వాత నిన్ను చూడటం ఎంత ఆనందంగా వుందో తెలుసా? ” అంది నీరజ చిన్నగా నవ్వుతూ!

“ఇంతకీ మీరెవరు? ” అన్నాడు గోపీ తెల్లమొహం వేసి!

“అదేంటి, నిజంగా నేనెవరో తెలియ నట్లు, ‘మీరు’ అంటూ కొత్తగా సంబోదిస్తు న్నావు? నిజంగా నన్ను గుర్తుపట్టలేదా? ”

లేదన్నట్లుగా తలవూపాడు గోపీ.

“కోతలు కోయకు!”

“అలా దబాయిస్తావేమిటమ్మా, వాడు నిన్ను గుర్తుపట్టలేదంటున్నాడుగా! ఇంతకీ నువ్వెవరివి? ఎందుకు వచ్చావు? ” కల్పిం చుకుంది జయమ్మ.

“నేనెవరినో మీ గోపీనే అడగండి!”

“వాడు తెలియదంటున్నాడుగా!” అసహ నంగా అన్నాడు గోపీ తండ్రి ప్రకాశం.

“ఇంతకీ నువ్వొచ్చిన పని? ”

“నాపేరు నీరజ! గోపీ చిన్ననాటి ప్రేయ సిని! ఇద్దరం చెట్టాపట్టాలు వేసుకుని ఈ ఊరి కాలువగట్లమీద, అరటితోటల్లో పరు గులు పెట్టాం! పాటలు పాడుకున్నాం, ఎన్నో బాసలు చేసుకున్నాం! పరిస్థితుల వల్ల దూరం అయిపోయాం! మొన్న టీవీలో ఏదో కార్యక్రమంలో గోపీ మా ప్రేమకథ అంతా చెప్పాడు. తను ఇంకా పెళ్ళి చేసుకోకుండా నా కోసమే ఎదురు చూస్తున్నట్లుగా కూడా చెప్పాడు! అందుకే రెక్కలు కట్టుకుని వచ్చి వాలిపోయాను!” ఊపిరి తీసుకోడానికన్నట్లుగా ఆగింది

నీరజ!

"అయ్యో! మీరు పొరబడుతున్నారు! గోపీ మా వారండీ! నాలుగేళ్ళ క్రితమే మా పెళ్ళయింది! ఈ కుర్రాడు మా పిల్లాడే!" జయమ్మ చేతిలోని కొడుకును అందు కుంటూ కంగారుగా అంది కమల.

"నేను నమ్మను! గోపీ నా కోసమే ఇంకా ఒంటరిగా నిరీక్షిస్తున్నట్లుగా టీవీలో చెప్పాడు, మీరు చూడలేదా!" జయమ్మ కళ్ళల్లోకి గుచ్చి చూస్తోంది నీరజ.

"వాడు ప్రైజు కొట్టాలని ఏవోవో కల్పించి చెప్పాడు! ఆ మాటలు పట్టుకుని నువ్వు పరిగెత్తుకు వచ్చేయడమేనా? ఆ మాత్రం ఇంగితం వుండొద్దూ? " చేతులు తిప్పుతూ పెద్దగా అరిచింది జయమ్మ.

"ఇక నువ్వు మర్యాదగా వచ్చిన దారినే బయలుదేరు!"

"తిరిగి నన్నెక్కడికి వెళ్ళమంటారు? "

"అంటే? " అర్థం కానట్లుగా అంది జయమ్మ.

"గోపీ చెప్పిన ప్రేమకథ విని మా ఆయన విడాకుల పత్రాల మీద సంతకాలు పెట్టించి, నన్ను ఇంట్లోంచి పంపించివే శాడు! ఇక నేను శాశ్వతంగా గోపీతోనే వుండిపోవాలని వచ్చాను! గోపీ నువ్వలా బెల్లం కొట్టిన రాయిలా నిలబడి పోయావే మిటి? మీ వాళ్ళకి నచ్చచెప్పు!" కర్రలా బిగుసుకుపోయివున్న గోపీ భుజం కుది పింది నీరజ!

గోపీకి నోట మాట రావడంలేదు!

కమల చిన్నగా ఏడ్పు ఆరంభించింది.

జయమ్మకి ఆవేశం పొంగి వచ్చింది. "ఉండిపోవాలనుకోవడం నీ ఇష్టమేనా? మేం గాజులు తొడుక్కునిలేం? ఏం అను కుంటున్నావే మమ్మల్ని? ఊరంతా కలసి నిన్ను రాజమండ్రిదాకా తరిమికొడతాం!"

"ఏదీ, రండి చూస్తాను! కాస్సేపట్లో తెనాలి నుంచి మా ఎస్సై బాబాయి పర మేశం వస్తున్నాడు! నేను నిన్ననే తెనా లిలో మీ అబ్బాయి మీద కంప్లైంట్ ఇచ్చి వచ్చాను- ఒక వివాహిత మహిళ వేధింపు లకు గురి అయ్యేలా టీవీలో మాట్లాడాడని! నేను తిరిగి రాజమండ్రి వెళ్ళినా వెళ్ళకపో యినా మీ అబ్బాయి మాత్రం అక్కడి సెంట్రల్ జైల్‌లో అంట్లు తోమక తప్పదు! నన్ను ఈ ఇంట్లో వుండనిస్తే సరేసరి! లేక పోతే ఎంతకయినా తెగిస్తాను నేను!" జీవి తంలో మొదటిసారిగా అంతలా గొంతు పెంచింది నీరజ!

"నేను ఈ ఇంట్లో క్షణం వుండను!" పెద్దగా రోదిస్తూ లోపలి గదిలోకి పారిపో యింది కమల!

తల్లి ఏడ్పు చూసి, పిల్లవాడు కూడా పెద్దగా ఏడునొక్కరాగం అందుకున్నాడు!

గోపి పిచ్చిచూపులు చూస్తున్నాడు!

ఈ గోల బయటకు వినిపించకుండా, వీధి తలుపు గడియపెట్టాడు ప్రకాశం!

"అమ్మా మమ్మల్ని క్షమించు! మా గోపీకి టీవీ పిచ్చి! అన్ని లైవ్ ప్రోగ్రాంలకి ఫోన్ చేసి పిచ్చి వాగుడంతా వాగుతూవుం టాడు! వందలకొద్దీ ఎస్ఎమ్ఎస్‌లు పంపిస్తూ వుంటాడు! మాకు నెలకి ఎలా లేదన్నా పదివేల రూపాయల టెలిఫోన్ బిల్లు వస్తుంది! ఇన్నాళ్ళూ ఇవన్నీ చూస్తూ ఊరుకున్నందుకు నన్ను నేను చెప్పుతో కొట్టుకోవాలి! ఇక మీదట వాడు టీవీ షోలకి ఫోన్ చేయకుండా కట్టడి చేస్తాను! అవాకులు, చెవాకులు పేలితే ఆ క్షణంలోనే వాడి పళ్ళు రాలగొడతాను! మా కోడలికి ఆందోళన పెరిగితే ఫిట్స్ వస్తాయి! గొడవ పెంచకు! దయచేసి వెళ్ళిపో! మా గోపీకి బుద్ధి చెప్పే పూచీ నాది!" నీరజ గడ్డం పట్టుకుని కాళ్ళబేరానికి వచ్చింది జయమ్మ.

"మీ గోపీకి బుద్ధి వస్తే నా కాపురం చక్కబడుతుందా? "

"వాడు చేసింది క్షమించరాని తప్పు!

అందుకు పెద్దవాళ్ళమైనా నీకు చేతులెత్తి దండం పెడతాం! ఊళ్ళో మా పరువు తీయవద్దు!" నిజంగానే చేతులు జోడించాడు ప్రకాశం!

"పరిస్థితి ఇంతదూరం రాకముందే మీరు మీ అబ్బాయికి బుద్ధి చెప్పి వుండవలసింది! పిల్లలకి సరిఅయిన దారి చూపవలసింది పెద్దవాళ్ళేకదా! ప్రైజుల కోసం ఆశపడి, అతను చెప్పే అసత్యాలను ఖండించలేదు మీరు! అతను రెచ్చిపోయి నోటికొచ్చినట్లు తెలిసిన వాళ్ళందరి గురించీ టీవీలో రకరకాలుగా మాట్లాడాడు! అతను చేసిన దానికి నేనెందుకు శిక్ష అనుభవించాలి? ఇక నేను ఈ ఇంట్లోనే వుండక తప్పదు!" స్థిరంగా అంది నీరజ.

"కాసేపట్లో మా పరమేశం బాబాయి వస్తాడుగా! న్యాయం ఏమిటో తనే చెబుతాడు!"

ఆ మాటలకి జయమ్మ గుండెలు దడదడలాడాయి.

"ఈ విషయం మనం, మనం తేల్చుకుందాం! మధ్యలో పోలీసులు ఎందుకు? మీరోసారి లోపలికి రండి!" మొగుడిని, కొడుకుని లోపలి గదిలోకి తీసుకువెళ్ళింది జయమ్మ.

ఆ గదిలో ఒంటరిగా మిగిలిపోయింది నీరజ!

లోపల గుసగుసగా వాళ్ళంతా ఏదో మాట్లాడుకుంటున్నారు.

నీరజకి అంతా ఆశ్చర్యంగా అనిపిస్తోంది! తనేనా అంత ఖచ్చితంగా, గట్టిగా మాట్లాడింది? తనలో అంత ధైర్యంవుందని తనకే తెలియదు! కిటికీలో వున్న మంచినీళ్ళ బాటిల్ మూత తీసి గడగడ నీళ్ళు తాగేసింది!

రాత్రి పిల్లవాడిని పడుకోబెట్టాక, ఆ సీసా తీసుకువచ్చి కిటికీలో పెట్టింది కమల. కదులుతున్న నీరజను చూసి, "ఇంకా నిద్ర పట్టలేదా? " అని అడిగింది.

లేదన్నట్లుగా తల వూపింది నీరజ!

"మిమ్మల్ని ఒక ప్రశ్న అడగవచ్చా? " పక్కనే వున్న కుర్చీలో కూర్చుంది కమల.

"అడగండి"

"మీరు, వస్తూనే మా వారిని గురించి అడిగారు. ఆయన మీకు తెలుసా? "

ఏం జవాబు చెప్పాలో తోచలేదు నీరజకి.

"మీ ఆయనకి నేను బాగా తెలుసట!"

ఆ జవాబు అర్థం కాలేదు కమలకి!

"అంటే? "

"ఆయన వచ్చాక మీకే తెలుస్తుంది!"

కమల చాలాసేపు అక్కడే కూర్చుని తమ ఇంటి సంగతులు, గోపీ నైజం గురించి నీరజకి వివరించింది.

గోపీకి చదువు బొత్తిగా అబ్బలేదట! చిన్న తనంలో ఇతరుల తోటల్లోంచి జామకాయలు, మామిడి కాయలు దొంగతనంగా కోసుకువచ్చి ఊళ్ళో వాళ్ళ చేత చీవాట్లు తినేవాడట! తగని సినిమా పిచ్చి! ఇంట్లో డబ్బులు పట్టుకుపోయి తెనాలిలో మార్నింగ్షో, మ్యాట్నీ రెండూ చూసి వచ్చేవాడు! పెళ్ళయిన పదేళ్ళకి పుట్టిన ఒక్కగానొక్క కొడుకు! జయమ్మ వెర్రి గారాబంతో గోపీ చేసే వెధవ పనులన్నీ సమర్థించుకుంటూ వచ్చేదట! కొడుకు చేసే తప్పుడు పనులు ప్రకాశంకి తెలియకూడదని ఎన్నో అబద్ధాలు చెబుతూ వుండేది. అది చూసి గోపీ కూడా అయినదానికి కానిదానికి అబద్ధాలు చెప్పడం చిన్నప్పటినుంచీ వెన్నతో పెట్టిన విద్యగా అలవాటు చేసుకున్నాడు. పదో క్లాసు కాపీకొట్టి పాసయినా ఇంటర్ గట్టెక్కలేక చతికిల పడ్డాడు! రోజంతా బలాదూరు తిరగడం- తెనాలి, విజయవాడలలో పిచ్చిగా సినిమాలు చూడటం- ఇలా పాతికేళ్ళు వచ్చేదాకా ఏ పనీ చేయకుండా గడిపేశాడట!

పెళ్ళయితే కొడుకు దారిలోకి వస్తాడని జయమ్మ విశ్వాసం! అయితే గోపీ రూపు అంతత మాత్రం కావడం, పైగా ఎందుకూ కొరగాని వాడిగా తయారు కావడంతో ఎవరూ పిల్లను ఇవ్వడానికి ముందుకు రాలేదట! ఇక లాభం లేదనుకుని జయమ్మ స్వయంగా చీరాలలోవున్న అన్నయ్య ఇంటికి వెళ్లి "అన్నయ్యా! కమలని మా ఇంటి కోడల్ని చేసుకుంటాను! కానీ కట్నం వద్దు! నాకు ఒక్కడే కొడుకు! మేన కోడలే కోడలయితే ముసలితనంలో మమ్మల్ని నిరాదరణ చేయదని ఆశ!" అంటూ కమల తండ్రి చేతులు పట్టుకుందట!

నిజానికి గోపీతో పెళ్లి కమలకి సుతరామూ ఇష్టం లేదట!

కట్నం వద్దనేసరికి ఎగిరి గంతేసిన కమల తండ్రి "పదెకరాల పొలానికి వారసుడు! పెళ్ళయితే వాడే మారతాడు! బాధ్యతలు తెలుసుకుంటాడు!" అంటూ కమల నోరునొక్కి ఈ పెళ్లి చేశాడట!

పెళ్ళయ్యాక గోపీ తిరుగుడు తగ్గినా, మూడేళ్ళుగా కొత్తగా టీవీ పిచ్చిపట్టుకుందట! ఇంట్లో కూర్చుని అదే పనిగా రోజంతా అన్ని లైవ్ ప్రోగ్రామ్స్‌కీ ఫోన్ చేసి, ఆ ప్రోగ్రాంలకి తగ్గట్లుగా అవీ ఇవీ కల్పించి మాట్లాడుతుంటాడట! వందలకొద్దీ ఎస్.ఎమ్.ఎస్‌లు పంపిస్తూ వుంటాడట! ఆశ్చర్యంగా ఛానళ్ళకి చేసిన ఫోన్‌లు అతనికి సులువుగానే కలుస్తాయట! స్టూడెంట్స్‌తో తను ఇంజనీరింగ్ స్టూడెంట్‌నని చెబుతాడట! సినీ యాక్టర్‌తో మాట్లాడుతున్నప్పుడు చూడని సినిమా కూడా చూసినట్లు కోతలు కోస్తాడట! ప్రతి యాంకర్‌తోనూ, 'మీ యాంకరింగ్ అద్భుతం- మీ కోసమే ఈ ప్రోగ్రాం చూస్తాను' అంటూ అవలీలగా అబద్ధాలు చెప్పేస్తాడట! టీవీ ప్రోగ్రాంల ద్వారా పట్టు చీరలు, మిక్సీలు, ఉంగరాలు ఇలా చాలానే బహుమతులు సంపాదించాడట!

"మనకీ అబ్బాయి పుట్టాడు! బాధ్యతలు పెరుగుతున్నాయి. మామయ్యతో వెళ్లి పొలం పనులు నేర్చుకో! లేకపోతే మెయిన్‌రోడ్డులో ఏదయినా షాపు పెట్టు!" అని కమల మొత్తుకుంటున్నా, ఏదీ పట్టించుకోడట!

"నా సోదంతా చెప్పి మీకు నిద్రలేకుండా చేశాను. అంతా నా ఖర్మ! బావ ఈ జన్మలో మారడు!" అంటూ కమల భర్తను గురించి కపటం లేకుండా అంతా చెప్పేసింది.

కమల మాటలు నీరజలో ఆలోచనలు రేపాయి. గోపీ లాంటి బాధ్యత లేని భర్తతో వేగుతున్న కమలమీద జాలి పొంగుకొచ్చింది.

నీరజ క్లుప్తంగా తనను గురించి చెప్పి టీవీ కార్యక్రమంలో గోపీ తనను గురించి ఏం చెప్పాడో వివరించి, నిజంగా చిన్నతనంలో తమ మధ్య ఏం జరిగిందో పొల్లుపోకుండా వివరణ ఇచ్చి "అన్నీ అసత్యాలు చెప్పి, నా కాపురంలో నిప్పులు పోసిన మీ ఆయనను కడగడానికి వచ్చాను నేను!" అంది కొంచెం కరకుగా!

నోరు వెళ్ల బెట్టుకుని నీరజ చెప్పిందంతా విన్న కమల, పమిట చెంగులో మొహం దాచుకుని బావురుమంది!

"మీరెందుకు ఏడవడం?" కంగారు పడింది నీరజ!

"మా ఆయన చేసిన మూర్ఖపు పనివల్ల మీ జీవితం నాశనం అయింది! పెద్దలు చేసిన పాపం పిల్లలకి కొడుతుందంటారు! నాకు చాలా భయంగావుంది! ఈ కాపురం నాకు, నా కొడుకుకి ఏం చేటు చేస్తుందోనని! ఈ జన్మకి మా బావకి బుద్ధిరాదు!" పమిట చెంగుతో మొహం తుడుచుకుంటూ చిన్నగా అంది కమల. "మిమ్మల్ని క్షమిం

చమని అడగడానికి కూడా నాకు మొహం చెల్లడం లేదు!"

నీరజ ఏమీ మాట్లాడలేదు!

ఇద్దరి మధ్య మౌనం!

"రేపే నేను నా కొడుకుని తీసుకుని ఈ ఇంట్లోనుంచి వెళ్లి పోతాను! బావ చేసిన పాపానికి ఇదే పరిహారం!" సీరియస్‌గా అంది కమల. "కాపురం విచ్ఛిన్నం అయితే ఎంతబాధ అనుభవించాలో బావకి తెలియాలి!"

"నేను మీ కాపురం చెడగొట్టాలని రాలేదు!" కంగారుగా అంది నీరజ. "గోపీకి గట్టిగా వార్నింగ్ ఇచ్చి వెళదామని వచ్చాను!"

"మీ బావ, అత్త అన్నీ దులిపేసుకుని తిరిగే రకాలు! వాళ్ళు సులభంగా మారరు!'
'

నీరజ ఆలోచనలో పడింది! "రేపు వాళ్లు రాగానే ఇలా చేద్దాం! మీరూ, నేనూ కూడా కొద్దిగా నటించాల్సి వుంటుంది. ఈ అనుభవంతో వాళ్ళు మారితే అంతా మీ అబ్బాయి అదృష్టం అనుకుందాం" అంటూ వాళ్ళు వచ్చాక ఏం చేయాలో కమలకి వివరించింది.

అయితే తను నటనలో ఇంతలా జీవించడం తనకే ఆశ్చర్యంగా వుంది!

హఠాత్తుగా గదిలో గోపీ ప్రత్యక్షం అవడంతో ఏవో ఆలోచనలలో వున్న నీరజ ఉలిక్కిపడింది.

"నన్ను క్షమించండి. నాకు సోదరిలాంటి వారు మీరు. నా వల్ల మీకు తీరని అన్యాయం జరిగింది" చప్పున వంగి నీరజ కాళ్ళు తాకే ప్రయత్నం చేశాడు గోపి.

వెంటనే తన కాళ్ళను వెనక్కు లాక్కుంది నీరజ.

"కమల పుట్టింటికి వెళ్లిపోతుందట. కమల లేకుండా నేను బతకలేను. మీరు క్షమించానంటేగానీ, కమల నా మాట వినదు. ఇకపై ఇటువంటి తెలివితక్కువ పనులు పొరబాటున కూడా చేయను. నాకు బుద్ధి వచ్చింది" గోపీ కళ్ళల్లో నీటి పొర.

"ఇప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది" కఠినంగా అంది నీరజ.

"అందుకే అహం వదలి మీ కాళ్ళమీద పడ్డాను. నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదు"

నీరజ ఏమీ మాట్లాడలేదు.

అప్పుడే లోపలి గదిలోంచి వచ్చిన జయమ్మ "తన గదిలో స్పృహ తప్పినట్లుగా పడివుంది మా కోడలు! నా మనుమడు అలా వున్న తల్లిని చూసి జడిసిపోయి గుక్కపెట్టి ఏడుస్తున్నాడు. ఆ చంటిపిల్లాడి మొహం చూసయినా మా గోపీని క్షమించు. ఇక వాడు టీవీ వాళ్ళకి ఫోన్ చేస్తే చేయి విరగగొడతాను! అవాకులు చెవాకులు పేలితే, నాలికమీద అట్లకాడతో వాత పెడతాను!" కొడుకుని మింగేసేలా చూస్తూ, నీరజ చేతులు పట్టుకుంది జయమ్మ.

"మా వాడి నిర్వాకంవల్ల నువ్వు హఠాత్తుగా ఇల్లు వదలవలసి వచ్చింది! ఎన్నో అవసరాలు వుంటాయి. ఏమీ అనుకోక ఈ డబ్బు..." మూసివున్న ఒక తెల్లకవరు నీరజ చేతికి అందివ్వబోయాడు ప్రకాశం!

"ఇవేమీ వద్దు! మీ అబ్బాయి ఇకమీదట బుద్ధిగా వుండేలా చూసుకోండి. అతనివల్ల మీ కోడలు ఇకముందు బాధపడకూడదు. అంతే" సూట్‌కేస్ చేతిలోకి తీసుకుని, తలుపు తీసుకుని వీధిలోకి వచ్చేసింది నీరజ!

మెయిన్ రోడ్డుమీదకు రాగానే దుమ్ము లేపుకుంటూ తెనాలి బస్సు వచ్చింది.

ఖాళీగా వున్న ఆ బస్సులో కిటికీ పక్కన కూర్చుంది.

చల్లగాలి వీస్తోంది.

## కొత్తగాలి...

**కోరికలకు**
**వృద్ధాప్యం రాలేదు**
**మనమే**
**ముసలివాళ్లమైపోయాం**

*-ఎ. రాంబాబు, హైదరాబాద్*

పచ్చటి పొలాలు, కాలువలు దాటు కుంటూ బస్సు ముందుకు దూసుకుపోతోంది!

ఇప్పుడు నీరజ మనసులో మునుపటి కోపం, కసి లేవు! మనసంతా ప్రశాంతంగా వుంది. గోపీ మీద వున్న అసహ్యం, కోపం అన్నీ మటుమాయం. తను అనుకోకుండా మున్నంగి రావడం మంచిదే అయింది. గోపీలో మార్పు స్పష్టంగా కనిపిస్తోంది.

"కమల ఇదివరకటిలా వాళ్ళదగ్గిర, వీళ్ళ దగ్గిర భర్తను గురించి బాధగా చెప్పుకునే అవసరం వుండదు" అనుకోగానే మనసు కెంతో తృప్తి!

తెనాలిలో రైలు ఎక్కి ఒంగోలులో దిగే వరకూ కమల అమాయకపు మొహమే నీరజ కళ్ళముందు కదులుతోంది.

ఒంగోలులో ప్లాట్‌ఫాం మీద కాలు మోపుతున్నప్పుడు మళ్ళీ తన భవిష్యత్తు ప్రశ్నార్థకంగా కళ్ళముందు నిలిచింది.

సూట్‌కేస్ చేతిలో పట్టుకుని చిన్నగా మెయిన్ ఎంట్రన్స్‌వైపు అడుగులు వేస్తూ వుంటే హ్యాండ్‌బ్యాగ్‌లో సెల్ మోగింది.

సూట్‌కేస్ కిందపెట్టి, హాండ్‌బ్యాగ్ జిప్ లాగి, సెల్ పైకి తీసింది నీరజ!

శ్రీధర్ కాల్ చేస్తున్నాడు!

అప్పటికే చాలామంది బయటకు వెళ్ళిపోయారు. అక్కడక్కడ బెంచీల మీద కూర్చున్నారు ప్రయాణీకులు!

ఇష్టం లేకపోయినా సెల్ అటెండ్ చేయకతప్పలేదు నీరజకి.

"హలో..."

"హలో నీరజా... నేను శ్రీధర్‌ని! అయామ్ వెరీ సారీ!" అవతల పక్కనుంచి చిన్నగా వినిపిస్తోంది శ్రీధర్ గొంతు.

"నువ్వు వెంటనే బయలుదేరి ఇంటికి వచ్చేయి!"

నీరజ తన చెవులని తానే నమ్మలేకపోతోంది.

"పావుగంట క్రితం గోపీ, కమల ఫోన్ చేసి, మీ చిన్నతనంలో నిజంగా జరిగింది ఏమిటో వివరంగా చెప్పారు! వాళ్ళ పేరెంట్స్ కూడా మాట్లాడారు. గోపీ మళ్ళీ మళ్ళీ సారీ చెప్పాడు. నేను ఒంటరిగా వుండలేకపోతున్నాను. నీ కోసమే చూస్తున్నాను"

"సారీ" కఠినంగా అంది నీరజ.

"నేను తిరిగి రాను!" తన నిర్ణయం చెప్పేసింది.

"అంత మాట అనకు నీరజా! గోపీ అంతా వివరించాక ఇప్పుడు నాకు నీ మీద ఎటువంటి అనుమానం లేదు" శ్రీధర్ గొంతులో వణుకు స్పష్టంగా తెలుస్తోంది.

"నువ్వు తిరిగి రావలసిందే!" దైన్యంగా అభ్యర్థించాడు శ్రీధర్.

"రానుగాక రాను!" స్థిరంగా అంది నీరజ.

"మీరు నేను చెప్పింది వినిపించుకోలేదు. నమ్మలేదు. గోపీ చెప్పాక ఇప్పుడు వెనక్కి పిలుస్తున్నారు. భార్యాభర్తల మధ్య బంధం బలంగా వుండటానికి నమ్మకమే పునాది! ఆ పునాది కుంగిపోయాక ఆ సంసారసౌధం నిలబడదు. నా మనసు పూర్తిగా విరిగిపోయింది. ఇక నాకు ఫోన్లు చేయవద్దు. చేసినా ఇక నేను మాట్లాడేది ఏమీ లేదు" విసురుగా సెల్ ఆఫ్ చేసింది నీరజ.

"అమ్మా ఆకలిగా వుంది. ఒక రూపాయి..." ఎవరో కుంటి బిచ్చగాడు తన అల్యూమినియం గిన్నె నీరజ ముందుకు చాపి, అందులోని చిల్లర చప్పుడు అయ్యేలా చేయి కదిలిస్తున్నాడు. పది రూపాయల నోటుతోపాటు, సెల్ ఫోన్‌ని కూడా వాడి బొచ్చెలో వేసి, వడివడిగా అడుగులు వేస్తూ స్టేషన్ బయటకు నడిచింది నీరజ.

★ ★ ★

రత్నాన్ని చూస్తూనే అప్రయత్నంగా నీరజ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

రత్నం కూడా కళ్ళనీళ్ళు పెట్టుకుంది. "అప్పుడే నిన్ను చూసి ఏడాది దాటింది. మనది జన్మజన్మల బంధంలా వుంది!" నిన్ను తలుచుకోని రోజంటూ లేదు. నేనెప్పుడూ అద్దెకున్నవాళ్ళతో ఇంతలా అనుబంధం పెంచుకోలేదు" రెండు చేతులతో నీరజను చుట్టేసి, ఆప్యాయంగా మేడమీదకు తీసికెళ్ళింది రత్నం.

రాత్రి భోజనాలు అయ్యాక రత్నం రమాపతులకు జరిగిందంతా చెప్పింది నీరజ. "నాకీ ప్రపంచంలో మించిన ఆత్మీయులు లేరు. అందుకే కష్టకాలంలో ఎటువంటి సంకోచం లేకుండా తిన్నగా మీ ఇంటికే వచ్చేసాను. ఇక నా కాళ్లమీద మళ్లీ నేను నిలబడే ప్రయత్నం చేయాలి!"

స్వంత కూతురికే అటువంటి కష్టం వచ్చినట్లు ఎంతగానో తల్లడిల్లిపోయారు రత్నం, రమాపతులు!

"ఇది నీ ఇల్లే అనుకో! ఇక మాతో పాటే నువ్వూనూ! ఆ ఏడాది కాపురాన్ని పీడ కలలా మర్చిపోయి, రేపటి నుంచే కొత్త జీవితం ఆరంభించు! ఏ లోకంలో ఉన్నా మీ అమ్మ ఆశీస్సులు నీకు ఎప్పుడూ ఉంటాయి" ధైర్యం చెబుతున్నట్టుగా నీరజ వెన్ను రాస్తోంది రత్నం.

తల్లి ప్రసక్తి రాగానే నీరజ కళ్లు చెమ్మగిల్లాయి.




**మ**ర్నాడు స్నానం చేశాక రత్నం ఇంటి నుంచి గోపాలరావు గారికి ఫోన్ చేసింది నీరజ.

"నేను సార్, నీరజని. ఎలా ఉన్నారు? "

"బాగానే ఉన్నానమ్మా! ఇంతకీ నీ సంగతులేమిటి? "

క్లుప్తంగా జరిగిందంతా చెప్పింది నీరజ.

అంతా విని భారంగా నిట్టూర్చారు గోపాళరావుగారు. "అయాం వెరీ సారీ అమ్మా!"

"ఇప్పుడు నాకో దారి చూపవలసినవారు మీరే!"

"నేనా? "

"అవును మాష్టారూ! నాకు ఉద్యోగం కావాలి."

"సారీ నీరజా! నీకు తెలుసు కదా. మనది గవర్నమెంట్ స్కూలు- నువ్వు ఏడాది క్రితమే రిజైన్ చేసేశావు!"

"ఇప్పుడు నన్నేం చేయమంటారు? మీకు బాగా తెలుసు. ఉపాధ్యాయ వృత్తే నాకు ప్రాణం! పోనీ ట్యూషన్లు ఏమయినా..." అని నీరజ మాట పూర్తి చేయకముందే, "అన్నట్లు నీకు మా నిరంజనం తెలుసు కదా!" అన్నారు గోపాలరావు గారు హఠాత్తుగా.

"తెలుసు"

"వాడు కెనరా బ్యాంకులో లోన్ తీసు

కుని చినలింగాయపాలెంలోనే పెద్ద రెసిడె న్షియల్ స్కూలు కట్టించాడు. రిటైర్ అయ్యాక నన్ను వాడి స్కూల్ కే రమ్మంటు న్నాడు. నువ్వొకసారి వాడితో మాట్లాడు."

నిరంజనం సెల్ నంబర్ నోట్ చేసు కుని, "థాంక్స్ మాష్టారూ!" అంటూ ఫోన్ పెట్టేసింది నీరజ.

ఒకసారి తల్లిని, మాల్యాద్రి నరసింహ స్వామిని మనసులోనే స్మరించుకుని నిరం జనానికి ఫోన్ చేసింది.

"హలో" అవతల నిరంజనం గొంతు.

నీరజకి ఉద్వేగంగా ఉంది. "నేను నీర జని. గుర్తున్నానా"

"అయ్యో! అదేం మాట! ఎలా ఉన్నారు? " ఆప్యాయంగా అడిగాడు నిరం జనం!

"మీ నుంచి నాకో హెల్ప్ కావాలి"

"చెప్పండి"

"మీ స్కూల్లో ఉద్యోగం కావాలి"

కాస్సేపు నిరంజనం ఏమీ మాట్లాడలేదు. "సారీ... నీరజగారు..."

నీరజకి నీరసం ముంచుకు వచ్చింది. "మీ స్కూల్లో ఉద్యోగాలు లేవా? "

"అది కాదు..."

"పోనీ నేను మరేదయినా ఉద్యోగం చూసుకునేదాకా టెంపరరీగానయినా..."

"నేను కొన్ని ఉన్నత సిద్ధాంతాలతో, ఆద ర్శాలతో ఈ స్కూలు ఆరంభించాను. పల్లె టూళ్లల్లో ముఖ్యంగా ఆడపిల్లల చదువు ఏడో క్లాసుతోటే ఆగిపోతుంది. ఏడో తర గతి గట్టెక్కగలిగితే మహా అయితే పది దాకా సాగుతుంది. పదహారో ఏటే పెళ్లిళ్ళు- పద్దెనిమిదేళ్లకే తల్లులు. మారు మూల పల్లెల్లోని అమ్మాయిలు ఈ ఆధు నిక వ్యవస్థలో కూడా ఎంతో దోపిడీకి గురవుతున్నారు" ఊపిరి తీసుకోడానికన్న ట్లుగా ఆగాడు నిరంజనం.

నీరజ శ్రద్ధగా వింటోంది.

"అవకాశం, శ్రద్ధ ఉన్న వాళ్లకి కూడా ఇక్కడి విద్యా ప్రమాణాలు నాసిరకంగా ఉండటం వల్ల పెద్ద యూనివర్శిటీల్లో, ఐఐ టీలలో చదువు అనేది ఒక కల. పట్టణా లలో ఇంగ్లీష్ మీడియం స్కూళ్ళల్లో, పెద్ద పెద్ద కార్పొరేట్ కాలేజీల్లో చదువుకున్న అమ్మాయిలతో వాళ్ళు పోటీ పడలేక పోతు న్నారు. అందుకే ఇక్కడి అమ్మాయిలు కూడా తమ తెలివి తేటల్ని సానబెట్టుకుని, నలుగురితో సమానంగా పోటీ పడగల ఆత్మ విశ్వాసాన్ని, ధైర్యాన్ని పెంపొందించు కోవాలనే ధ్యేయంతో ఈ స్కూలు స్థాపిం చాను. ఎంతో మంది దయార్ద్రహృద యులు ఒంగోలు నుంచి, నెల్లూరు నుంచి కూడా విరాళాలు పంపిస్తున్నారు. ఇంటర్ అవగానే అన్ని రకాల పోటీ పరీక్షలు సమ ర్థవంతంగా ఎదుర్కోడానికి ప్రాథమిక స్థాయినుంచి ప్రత్యేక సిలబస్ తయారు చేశాను."

నిరంజనం మాటలు నీరజలో ఉపా ధ్యాయ వృత్తి పట్ల ఆసక్తిని రెట్టింపు చేస్తు న్నాయి.

"నా పాఠశాలలో అమ్మాయిలందరికీ విద్య ఉచితం! తప్పనిసరిగా విద్యార్థినులం దరూ స్కూల్ ఆవరణలోనే ఉన్న హాస్ట ల్ లో ఉండాలి. ఎంతో అంకిత భావంతో పనిచేసే అధ్యాపకులు కావాలి నాకు. వాళ్లకి కూడా హాస్టల్ లోనే బస. వేరే బాదరబందీలు లేని వారయి ఉండాలి. బ్రహ్మీ ముహూర్తంలోనే పిల్లల్ని లేపి, దగ్గ రుండి చదివించాలి. అనుక్షణం వాళ్లకి తోడూనీడగా ఉంటూ, ఎప్పటికప్పుడు వాళ్ల సందేహాలు నివృత్తి చేస్తూ, విద్యా ప్రమా ణాలు మెరుగు పరుస్తూ, వారి బంగారు భవితకు దిశా నిర్దేశం చేయాలి. ఇటు వంటి కఠినమైన రూల్స్ ఉన్న స్కూల్లో మీరెలా పని చేయగలరు? "

నిరంజనం ఉదాత్తమైన ఆశయాలు, నీర

జకి కొత్త ఊపిరిని పోశాయి. నూతన ఉత్సాహాన్ని కలిగించాయి. "అలా అయితే మీ స్కూలే నా జీవిత గమ్యం. మీ ఆశయాలే నాకు స్ఫూర్తి. దయచేసి నాకొక అవకాశం ఇచ్చి చూడండి. మీ అంచనాలను నేను అందుకోలేకపోతే నిరభ్యంతరంగా నన్ను బయటకు పంపించేయండి." అర్థింపుగా అంది నీరజ.

వెంటనే సమాధానం చెప్పలేక పోయాడు నిరంజనం. "మీకు పెళ్లయి... రాజమండ్రీ వెళ్ళిపోయారని..."

"అదంతా గతం! నా భవిష్యత్తు అంతా మీ స్కూల్‌లోనే! నాకు ప్రాణప్రదమయిన ఉపాధ్యాయ వృత్తికి పునరంకితం అయ్యే అవకాశం కలిగించి పుణ్యం కట్టుకోండి!"

నిరంజనానికి నీరజ మాటలు అర్థమయీ అవనట్లుగా ఉన్నాయి. "కానీ ఈ ఉద్యోగానికి మీవారు ఒప్పుకుంటారా అని..."

"మీరు ఫ్రీగా వుంటే ఓ పదినిముషాలు మీ అమూల్యమైన సమయాన్ని తీసుకుంటాను!" అంటూ నీరజ జరిగిందంతా వివరంగా చెప్పింది!

"నాకు ఉద్యోగం చాలా అవసరం..."

"మీలాంటి టీచరమ్మ మా స్కూలు పిల్లలకి కూడా చాలా అవసరం! మీరు వెంటనే వచ్చేయండి"

"రేపే వచ్చేస్తాను! పంచమి కదా!" ఉత్సాహంగా అంది నీరజ.

★ ★ ★

స్టీలు ప్లేట్‌లోకి నాలుగు వేడివేడి ఇడ్లీలు తీసి, పక్కనే కమ్మటి కొబ్బరి చట్నీ వేసి "అమ్మా నీరజా! టిఫిన్ రెడీ!" అంటూ హాల్లోకి వచ్చింది రత్నం!

హాల్లో నీరజ లేదు!

సోఫా పక్కనే నీరజ సూట్‌కేస్ వుంది!

"నీరజా ఎక్కడ నువ్వూ?" చుట్టూ చూస్తోంది రత్నం.

తలారా స్నానం చేసి దేవుడి గదిలో దీపం వెలిగిస్తోంది నీరజ. "ఐదు నిముషాల్లో వచ్చేస్తాను!"

"టిఫిన్ ప్లేటు డైనింగ్ టేబుల్ మీద పెట్టి, దేవుడి గది గుమ్మం దగ్గిరకి వచ్చింది రత్నం!

రెండు చేతులూ జోడించి, దేవుడికి దండం పెట్టుకుంటోంది నీరజ!

"మరో అరగంటలో నీరజ వెళ్ళిపోతుంది!" బాధగా అనుకుంది రత్నం.

"అనుకోకుండా తను కోరుకున్న ఉద్యోగం దొరికింది! అంతవరకూ అదృష్టవంతురాలే!"

గంట చప్పుడు చేస్తూ దేవుడికి హారతి ఇస్తోంది నీరజ.

"పిచ్చిపిల్ల! ఇంత చిన్న వయసులోనే ఎన్ని కష్టాలు పడిందో! ఇప్పటికయినా ఆ నరసింహస్వామి ఒకదారి చూపించాడు! ఆశలు, ఆకాంక్షలు, గమ్యాలు ఒక్కటే అయిన ఆ నిరంజనం చెంతకి మళ్లీ ఈ అమ్మాయిని చేరుస్తున్నాడు! ఇద్దరూ జీవితంలో ఒక విధంగా ఓడిపోయిన వాళ్లే! అయితే ధైర్యంగా మళ్లీ తలెత్తుకుని ఒక ఉదాత్త ఆశయంతో ముందుకుసాగే ప్రయత్నంలో ఉన్నారు. ఆ ఇద్దరూ ఇది విధి తమకిచ్చిన మరో సువర్ణావకాశంగా భావించి, జీవితాంతం ఒకరికి ఒకరు తోడుగా వుంటే ఒక ఇలలో వాళ్ళు సాధించలేనిదంటూ ఏమీ వుండదు! తమ లక్ష్యాన్ని సులువుగా చేరుకోగలరు! ఆ నరసింహస్వామి మళ్ళీ వాళ్ళిద్దరినీ ఒకటిగా కలిపితే బావుండును! తప్పకుండా ఇది జరిగేలా చూడు స్వామీ!" మనసులోనే నీరజ కోసం ప్రార్థిస్తోంది రత్నం!

అందుకు 'తథాస్తు' అంటున్నట్లుగా పైన నరసింహస్వామి ఫొటో మీదనుంచి ఎర్ర మందారం ఒకటి మెత్తగా జారి, నీరజ తలమీద పడింది!

©

# ఇదీ వేదం

# పితృకర్మలు

9

-డాక్టర్ సంధ్యావందనం లక్ష్మీదేవి

మనిషి మరణానంతరం జీవుని గతేమిటి? మనిషి చనిపోయిన తరువాత చేయాల్సిన ఉత్తర క్రియలేమిటి తదితర ప్రశ్నలకు వేదమే సమాధానం చెపుతుంది.

వాయురనిల మ మృత యథేదగ్ం
భస్మాంతగ్ం శరీరం ఓం క్రతో।
స్మర క్లి బేస్మర కృతగ్ం స్మర॥

-యజుర్వేదం 40-15

మృతుని శరీరం నుండి జీవాత్మ వేరైన సమయంలో అతని ప్రవృత్తేమిటో తెలుసుకోవాలి. జీవాత్మ శరీరం నుండి బయటకు వెళ్లిన తరువాత మృత శరీరాన్ని నెయ్యి, సుగంధ పదార్థాలతో భస్మం చేయాలి. దహనకర్మ జరిగిన తరువాత మృత శరీరానికి చేయాల్సిన క్రియలేవి వుండవని యజుర్వేదం స్పష్టం చేస్తుంది.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం
జన్మ మృతస్యచ

-గీత

పుట్టిన వారికి మరణం తప్పదు. మరణించిన వారికి మరల జన్మ తప్పదు. ఇది నిశ్చిత సిద్ధాంతమని శ్రీకృష్ణ భగవానుడన్నాడు.

మరణానంతరం ఆత్మ వుంటుందా? ఉండదా? అనే ప్రశ్నకు సమాధానంగానే కఠోపనిషత్ రచింపబడింది.

జీవుడు శరీరాన్ని విడవడం, కొత్త శరీరాన్ని ధరించడమనేది కాలచక్రంలో సామాన్య విషయం. మరణానంతరం జీవుడు తను చేసిన పాప పుణ్య కర్మల ఫలాలననుసరించి వివిధ శరీరాలను పొందుతాడని ఉపనిషత్కారులన్నారు. ఆత్మజ్ఞానమనేది చాలా సూక్ష్మమయిన విషయం.

మృత శరీరాన్ని దహనం చేసిన తరువాత మనం వారికోసం ఏమి చేసినా అది వారికి చేరదని ధర్మశాస్త్రకారులన్నారు.

శ్రాద్ధతర్పణాలు, ఆబ్దికాలు, ఏకాదశాహం, ద్వాదశాహం, సపిండీకరణం, గోదానం, తిలాదానం, సువర్ణదానం ఇవేవి చనిపోయిన వారికి చేరవు. సామాన్య మానవులు



రచించిన గ్రంధాలకు రుషుల పేర్లు పెట్టారు. అందులోనే చనిపోయిన తల్లిదండ్రులకు ఉత్తర క్రియలు, పితృకర్మలు చేయాలని రాసిపెట్టారు. ముఖ్యంగా పితరులంటే జీవించి వున్నవారని వేదమంటుంది.

**పుత్రాసో యత్ర పితరో భవన్తి మానో**
**యధ్యారీ రిషతాయుర్గంతోః**

పరమాత్మా! మా పుత్రులు పితరులయ్యేంత వరకు మాకు ఆయువును ప్రసాదించమని తల్లితండ్రులు ప్రార్థించినట్లుగా రుగ్వేదంలో కనిపిస్తుంది.

వేద వాఙ్మయంలోగాని, ఆర్ష సాహిత్యంలోకాని పితరశబ్దం వచ్చిందంటే అది కేవలం జీవించివున్న తల్లిదండ్రులు, ఆదరణీయులైన గురుజనులకు మాత్రమే వర్తిస్తుందని మహర్షులన్నారు.

వేదాలలో చెప్పిన పితృయజ్ఞమే ధర్మశాస్త్రాలలో పితృకర్మలుగా, అదే శ్రాద్ధ తర్పణాదులుగా ఉంది.

**శ్రద్ధయా యత్ క్రియతే తత్ శ్రాద్ధమ్!**
**తృప్యంతే ఇతి తర్పణమ్**

జీవించి వున్న తలిదండ్రులకు శ్రద్ధాపూర్వకంగా సేవచేయడం శ్రాద్ధమని, వారికి తృప్తిని కలిగించడమే తర్పణమని ధర్మశాస్త్రకారులన్నారు. తల్లి తండ్రి, అన్న తమ్ముడు ఈ సంబంధాలు శరీరంతో ఉన్నప్పుడు వుంటాయి. కాని జీవునితో కాదు. తలిదండ్రులు శరీరాలనే పుట్టిస్తారుకాని జీవులను కాదు.

చనిపోయిన తల్లిదండ్రులను స్మరిస్తూ జీవించివున్న పెద్దలకు భోజనం పెట్టాలనే సంకల్పం గృహస్థులకు కలిగితే పవిత్రమైన ఆచారమున్న వారిని ఎంచుకోవాలి. అంతే కాదు జ్ఞాననిష్ఠులు తపోనిష్ఠులు తపః స్వాధ్యాయ నిష్ఠులు కర్మనిష్ఠులైన వారిని నిర్ణయించాలి. అప్పుడే మనమిచ్చే ఆతిథ్యానికి మహా ఫలితముంటుందని వేద రుషులన్నారు.

శ్రాద్ధతర్పణాలు జీవించి ఉన్న వారికే చేయాలి. మరణించిన వారికి కాదు. చనిపోయినవారికి సేవచేయడం గాని, వారిని తృప్తిపరచడంగాని వీలుపడదు. జీవించి



వున్నవారికే శ్రద్ధతో సేవచేస్తూ వారిని సుఖపెట్టి గౌరవించడమే శ్రాద్ధ-తర్పణాలని వేదాలలో వివరించారు. సేవచేసేవారు, సేవలు పొందేవారు ఉంటేనే ఈ క్రియలు సాధ్యపడతాయి. లేకుంటే జరగవు. ఈ ఇద్దరిలో ఏ ఒక్కరు జీవించి లేకపోయినా శ్రాద్ధ తర్పణాలకు వీలుండదని వేదవేత్తలన్నారు. వృద్ధాప్యంలో పెద్దలను నిర్లక్ష్యం చేయకూడదు. వారు సంతానాన్ని బాల్యంలో ఎంత చక్కగా సంరక్షణ చేస్తారో అంతకంటే ఎక్కువగా వారిని

**జీవించి వున్న తలిదండ్రులకు శ్రద్ధా పూర్వకంగా సేవచేయడం శ్రాద్ధమని, వారికి తృప్తిని కలిగించడమే తర్పణమని ధర్మశాస్త్రకారులన్నారు. తల్లి తండ్రి, అన్న తమ్ముడు ఈ సంబంధాలు శరీరంతో ఉన్నప్పుడు వుంటాయి. కాని జీవునితో కాదు. తలిదండ్రులు శరీరాలనే పుట్టిస్తారుకాని జీవులను కాదు.**

కాపాడుకోవాలి. వారు బ్రతికి వుండగా దుఃఖపడే పరిస్థితి రానివ్వకూడదు. వారిని కష్టపెట్టడం ఇంటికి సుఖదాయకం కాదు. వారికి తగిన విధంగా అన్న వస్త్రాలిచ్చి రక్షించడం పిల్లల ధర్మం. ఈ ధర్మాన్ని మనం సక్రమంగా పాలిస్తే మన సంతానం మరల మనలను ఆదరిస్తారు. ఈ తరం ఏ మంచి పనిచేసినా వచ్చే తరానికి అదొక సందేశం. అందుకే పెద్దలను, అత్తమామలను, వృద్ధులను, తల్లిదండ్రులను బలవంతంగా వృద్ధాశ్రమాలలో చేర్పించకూడదు. వారు మనలను పెంచి పోషించి విద్యాబుద్ధులు చెప్పించి మంచి పౌరులుగా తీర్చిదిద్దారు. మనం పెద్దవాళ్ళమైన తరువాత వారి రుణం తీర్చుకోవాలి. అట్లాగే ఆచార్యులు, విద్వాంసులు, వయస్సులోనూ జ్ఞానంలోను వృద్ధులైన వారిని పాలు, పండ్లు వంటి ఉత్తమ పదార్థాలతో తృప్తిపరచాలని శాస్త్రకారులన్నారు. ఈనాటికీ సమాజంలో శ్రాద్ధతర్పణాలంటే చనిపోయిన వారికి పెట్టేవనే అభిప్రాయముంది. కాని ఇది సత్యం కాదు. సంస్కృత శబ్దాలకు అర్థాలు తెలియక, పూర్వాపర విషయాలను లోతుగా పరిశీలించక ధర్మశాస్త్రాలకు భిన్నమైన అర్థాలు చేస్తున్నారు. సత్యం విషయం తెలియనంతకాలం పొరపాటు చేయవచ్చు. శాస్త్రమనే ప్రకాశం దొరికినప్పుడు అజ్ఞానం, భ్రమ దూరమవ్వాలి. అప్పుడే శాస్త్ర ప్రయోజనం చేకూరుతుంది.

భస్మాంతగ్ం శరీరం

మనిషి చనిపోయిన తరువాత మనకు వారికి ఏ విధమైన సంబంధం వుండదు. ఇది ఈశ్వర నియమం. కర్మఫలానుసారం ఆ ఆత్మ వేరే శరీరంలో ప్రవేశిస్తుంది. ఇది నిశ్చితమైన శాస్త్రసిద్ధ విషయం.

తమసోమాజ్యోతిర్గమయ

-శతపథ బ్రాహ్మణం

మనం జ్ఞానమనే జ్యోతిర్మయ మార్గంలో పయనించాలి.

పెద్దల ఆజ్ఞలను పాలించి, వారికి తృప్తిని సంతోషాన్ని కలిగించాలి. కాని దేహాన్ని విడిచిన తరువాత వారికోసం మనం ఏమి చేసినా అది ప్రయాసే అవుతుంది. తల్లిదండ్రులు, పెద్దలు జీవించి వున్నప్పుడు శ్రద్ధగా ఆదరించని సంతానం వారు చనిపోయిన తరువాత చాలా ఘనంగా పితృకర్మలు చేస్తున్నారు. పెద్దల పేరు మీద ప్రజలకు హితాన్ని కలిగించే మంచి పనిచేస్తే పరమార్థముంటుంది.

# మోసగాడు



1997లో పీటర్ మేక్స్‌వెల్ తన మీద తనే దావా వేసుకుని గెలిచాడు! తను యజమానిగా వున్న ఫేక్టరీలో అతని చెయ్యి ఓ మిక్సింగ్ యంత్రంలో చిక్కుకుని కాలింది. దాంతో వర్క్‌మేన్ కాంపెన్సేషన్ చట్టం కింద, కంపెనీ యజమానిగా తన బాధ్యతని సక్రమంగా నిర్వహించని కారణంగా 1,22,500 డాలర్లకి నష్టపరిహారానికి కేసు వేసుకున్నాడు. అంతేకాకుండా అందులో గెలిచాడు కూడా!

చట్టప్రకారం ఆ డబ్బుని తన టాక్స్‌లో తగ్గించుకున్నాడు. నష్టపరిహారంగా వచ్చిన డబ్బుమీద టాక్స్ లేనందున అలా చేశాడు. ఈ విధంగా అతను అమెరికన్ ఇంటర్నల్ రెవెన్యూ సర్వీస్ (ఇన్‌కమ్ టాక్స్) మోసం




చేసాకకాని జడ్జి ఆ కేసు స్వరూపాన్ని పూర్తిగా అర్థం చేసుకోలేకపోయాడు. అప్పటికే ఆలస్యమయింది. ఇచ్చిన తీర్పుని వెనక్కి తీసుకోలేడు కదా!?

లోకానికి సమాజానికి ఉపకారం చేసేందుకు ధార్మిక సంస్థలకు సహాయం చేయడం, జ్ఞానదానం చేయడం, దీన జనులకు సేవచేయడం తదితర కార్యాలను చేయవచ్చని విజ్ఞులు తెలియచేశారు.

ధర్మశాస్త్రాలలోని అంశాలను అర్థం చేసుకోవాలి. రుషులు మంత్రార్థద్రష్టలు, త్రికాలజ్ఞులు. వారు సత్యమే బోధిస్తారు. వారి మాటలలోగాని, వారి శాస్త్రాలలోగాని అసత్యమనేది వుండేందుకు వీలు లేదు. అందుకే రుషులు మనలో పరిశీలనాత్మకమైన సత్యనేత్రం, వివేచనా శక్తి వుండాలని అన్నారు.

రుషులు నిష్పక్షపాతంగా వివరించిన పితృయజ్ఞంలో పెద్దలను పూజించి, సేవించి, వారి మాటలకు విలువనిచ్చి, వారి ఆదేశాలను ఆలకించాలని వుంది.

**అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవిదః**

**చత్వారి తస్యవర్ధన్తే ఆయుర్విద్యా యశోబలమ్॥**

-మనుస్మృతి

జ్ఞానులను, వృద్ధులను, పెద్దలను శ్రద్ధతో సేవించేవారికి నాలుగు వరాలు సిద్ధిస్తాయి. దీర్ఘాయువు, శాస్త్ర విద్యలు, విశేషమైన కీర్తి, ఆత్మబలమనే సుగుణాలు వారికి ప్రాప్తిస్తాయని మహర్షులు ప్రబోధించారు.

సర్వే భవంతు సుఖినః 

కథ వెనుక కథ

# కులీనుల కోణంలో పోరాటాల ఆవిష్కరణ చావువిందు


రఘోత్తమరెడ్డి

అన్నల వెన్నెల కాన, కార్మికుల రాకాసి కోన- తెలంగాణ. 'తల్లి నువ్వు నవ్వావంటే మాగాణి- యద తలుపు తెరిచావంటే సింగరేణి' అంటారు. అందులో మొదటిది అబద్ధం. రెండోది నిజం. సరిగ్గా ఈ వైరుధ్యమే తెలంగాణలో విప్లవ బీజమైంది. తొడ గొట్టి దొరల గడీల మీద తిరగబడింది. కార్మికలోకం కదనరంగాన కాలూనింది. 'పెద్దల' పీఠం కదలబారింది. బలవంతుల్ని నిలువెల్లా కంపింపజేసింది. ఆ కంపనలను రికార్డు చేసిన రిక్టర్ స్కేల్ తుమ్మేటి రఘోత్తమరెడ్డి కథ 'చావు విందు'. రండి... బంధు మిత్ర సపరివారంగా మీరంతా ఈ విందుకు ఆహ్వానితులే! దీని 'కథ వెనక కథ' ఏంటో రచయిత మాటల్లోనే ఆస్వాదిద్దాం పదండి..

"చావువిందు కథ అనేక సంవత్సరాలుగా మనసులో రూపొందుతూ వచ్చింది. ఆ కథలో చిత్రించిన జీవితమూ మరెన్నో సంవత్సరాలది.

వృత్తిపరంగా సింగరేణి బొగ్గుగనుల్లో పనిచేసేవాన్ని. అది చాలా కఠినమైన పని. విపరీతమైన అలసట. దానికి తోడు నా ప్రవృత్తివల్లా ఎక్కువగా రాయలేకపోయాను. క్లుప్తత-సమగ్రతల గురించి బాగా ఆలోచిస్తూ వచ్చేవాన్ని. అందుకని ఒక కథని అనేక విధాలుగా నిర్మించి-చూసి-చివరికి నాకు సంతృప్తి కలిగిన ఓ కథా నిర్మాణాన్ని ఎన్నుకునేవాన్ని. దీనివల్ల రాయడంలోని వేస్టేజి బాగా తగ్గేది.

నా కథల్లోని చివరి సగం కథలన్నీ అంటే 'పాత స్నేహితుడు' నుంచి 'హంతకులు' దాకా నవలలుగా రాయతగినవి. నవలలు రాయమని అల్లం రాజయ్య ఎంతగానో చెప్పేవారు. నేను రాసేవాన్ని కాదు.

కథ క్లుప్తత ప్రధానంగా సాగేదయితే, నవల విస్తృతి ప్రధానంగా సాగేది. అప్పటికి ఉన్న పద్ధతిలో కథ నాకు సరిపోదు. నవల నేను రాయలేను. నా చుట్టూవున్న జీవితం-దానిలో మనుషులు ప్రతీదీ పెను ప్రభావానికి లోనయ్యేకాలం. వ్యక్తిగత-కుటుంబ-సామాజిక జీవితాల్లోని విషయాలను అట్లనే చిత్రించాలంటే కథకుడిగా నాకున్న పరిధులను ఛేదించుకొనేందుకు నేను కథాస్థలాలను జాగ్రత్తగా ఎన్నుకునే

వాన్ని.

దృక్పథంతోబాటు కథానిర్మాణంలో దృష్టి కోణం నాకు ముఖ్యం! ఏకకాలంలోనే జరిగే వ్యక్తిలోని అంతఃసంఘర్షణ- వ్యక్తుల మధ్య సంఘర్షణ, విరుద్ధవర్గాల మధ్య సంఘర్షణలని ఒకే సమయంలోనే చిత్రించబూనడం... అందుకు నేనెన్నుకున్నది- దృష్టికోణం! 'ఎక్కన్నించి చూస్తే నేను రాయదల్చుకున్న విషయాలన్నీ కథలోకి సులువుగా వస్తాయా'ని ఆలోచించేవాన్ని.

జీవితంలోని అనేక ఒత్తిడులు, సంఘటనలుగా వ్యక్తం అవుతాయి. సంఘటనలు హఠాత్తుగా జరిగినట్టు కనిపిస్తాయి. కానీ అవి రూపొందడానికీ ఓ క్రమం వుంటుంది. సంఘటనల దరిమిలా జరిగేవి కూడా ఓ క్రమానుగతమైన దానికి అనుగుణంగానే సాగుతాయి. సంఘటన దగ్గర ఆరంభిస్తే, దాని చరిత్రతో సహా సమస్త విస్తృతితో కథను చిత్రించవచ్చనేది నాకునేను గట్టిగా నిర్ణయించుకున్నది.

అంతకు ముందరి పరిణామాల్లో భాగంగానే అయినా ఇందిరా గాంధీ విధించిన ఎమర్జెన్సీని జనతా గవర్నమెంట్ వచ్చి ఎత్తివేసిన తదుపరి ఇక్కడ కరీంనగర్ జిల్లాలోని సిరిసిల్ల, జగిత్యాల తాలుకాల్లో రైతుకూలీ ఉద్యమం ఆరంభమై పెనుసంచలనంగా మారింది. ఆ రైతుకూలి ఉద్యమ చరిత్ర, అందరూ ఎరిగిందే కనుక ఇప్పుడు అప్రస్తుతం. అటు తరువాత ఆ ఉద్యమం ఉత్తర తెలంగాణా జిల్లాలన్నిటా ఎట్లా వ్యాపించిందో-దాని పర్యవసానాలేమిటో కూడా చాలామందికి తెలుసు. రాజయ్యగారు ఆ పరిణామాలను చాలావరకు నవలలుగా రాస్తూవచ్చారు. నేనూ చూస్తూ, ఆలోచించుకుంటూ ఏవో మనసులో రూపొందించుకుంటూ వస్తుండేవాన్ని.

1990 జనవరి వచ్చేసరికి మనరాష్ట్రంలో అధికారం ఎన్.టి.ఆర్ నుంచి కాంగ్రెస్ తరపున మర్రి చెన్నారెడ్డికి మారింది. అందుకుగల కారణాలూ అందరెరిగినవే.

అదే సంవత్సరం మేలో వరంగల్‌లో రైతుకూలి బహిరంగసభ జరిగింది. లక్షలాది మందితో.. 'దున్నేవానికే భూమి' అంటూ దిక్కులు పిక్కటిల్లేలా నినదిస్తూ ఆ సభ ముగిసింది.

ఆ సభ ముగియగానే, దాని ప్రభావం గ్రామాల్లో మొదలైంది. ఉప్పెనలా భూస్వాముల భూములను రైతుకూలీలు ఆక్రమించుకోవడం ప్రారంభించారు. అటువంటి సంచలన దినాలలో నేను కరీంనగర్‌జిల్లా పెద్దపల్లి మండలంలోని ఒక గ్రామంలో జరిగిన మా బంధువుల పెళ్లికి హాజరైనా. ఆ పెళ్లి సందర్భంగా ముఖ్యులందరికీ ప్రత్యేకంగా ఓ రాత్రి భోజనాలు ఏర్పాటు

## ఇదీ వడ్డింపు...

- 1991 ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచికలో తొలిసారి ప్రచురితమైంది.
- జె. లక్ష్మీరెడ్డి సురేశ్ ద్వివేది సంయుక్తంగా 'మృత్యు భోజ్'పేరిట హిందీలోకి అనువదించారు. ఇది ఇండియన్ లిటరేచర్‌లో ప్రచురితమైంది.
- వాగ్దేవు రంగారావు ఇంగ్లీషులోకి అనువదించగా ఆక్స్‌ఫర్డ్‌వారి కథా సంకలనం 'ద టేబుల్ ఈజ్ లైడ్' లో వచ్చింది.
- మద్రాసు నుంచి వచ్చిన కథాసాగర్ సంకలనంలో వచ్చింది.
- సాహిత్య అకాడమీ వారి 'బంగారు కథలు' సంకలనంలో వచ్చింది.
- వల్లంపాటి వెంకట సుబ్బయ్య 'ద లెవన్త్ డే' పేరిట ఇంగ్లీషులోకి మరో అనువాదం చేసి 'ప్రతిభా ఇండియా'లో ప్రచురించారు.

చేసారు. తాగుడూ తినుడూ మామూలు విషయం.

ఆ విందులో వరంగల్, కరీంనగర్ జిల్లాల్లోంచి తండె పర్కాల, చిట్యాల మంథని, హుజూరాబాద్, పెద్దపల్లి, జమ్మి కుంట ప్రాంతాల్లోని ప్రసిద్ధ భూస్వామ్య వంశాల వాళ్లు చాలామంది పాల్గొన్నారు. వాళ్లలో అనేక మంది నాకు రక్త సంబంధీకులు- బంధువులు - బంధువుల బంధువులు. నా బాల్యం నుంచీ నాకు తెలిసిన మనుషులు. అందులో కొందరు స్వాతంత్ర్య తదనంతర కాలం నుంచీ రాజకీయాల్లో వున్నవాళ్లూ ఉన్నతోద్యోగాల్లో వున్న వాళ్లూ వున్నారు. గ్రామాల్లో ఉద్యమపు ఒత్తిడిని తట్టుకోలేక గ్రామాలు వదిలి పట్టణాల్లోకి మకాములు మార్చిన వారు కొందరు - రకరకాల వ్యాపారాల్లోకి దిగినవాళ్లు మరికొందరు - కొందరు గ్రామాల్లో ఉంటూ చితికిపోతున్నవారు- మరికొందరు చితక కొట్టబడుతున్నవారు- ఈ పెనుఒత్తిడిలోంచి ఎట్లా బయటపడాలో తెలియని అందరూ ఆ విందులో పాల్గొన్నారు. ఈ విందులో వరంగల్ నగరంలో జరిగిన రైతుకూలి మహాసభా - దాని తీర్మానాలు - తరువాత గ్రామాల్లో ప్రారంభమైన భూఆక్రమణల గురించి



చాలా ఆసక్తికరమైన చర్చ జరిగింది.

చావు విందు కథ రాయడానికి ఈ విందొక ప్రేరణ. అయితే నేను పాల్గొన్నది పెళ్లి విందులో!

భూస్వామ్య వ్యవస్థ స్వయంకృతాపరాధాన్ని దాని సమస్త విషాదంతో సహా చిత్రించాలంటే పెళ్లివిందు తగిన సందర్భం కాదనిపించింది. విషాద సందర్భమేదో కావాలనిపించింది. అటువంటి సందర్భాల గురించి ఆలోచించి, చివరికి 'పెద్దకర్మ' రోజును ఎన్నుకున్నా. చనిపోయిన పదకొండో రోజున చేసే కర్మకాండని మా వైపు 'దినాలు' అంటారు. ఈ కథకు నేను పెట్టిన పేరు 'దినాలు' అనే! ప్రచురణా క్రమంలో ఎవరివో మహాను'బాహువులు' దినాలును తొలగించి 'చావువిందు' ను తగిలించిరి!

చావువిందు అనే పదం మా వైపుది కాదు. అదట్లా వచ్చి చేరింది. అటువంటి విందు సందర్భాన్ని తీసుకుని రాయడం కష్టంగానే తోచింది. ఇలాంటి సందర్భాల గురించి మన పూర్వులు ఎట్లా రాసారా అని వెనుతిరిగి ఆలోచించా. రష్యన్ సాహిత్యం గుర్తుకొచ్చింది. టాల్‌స్టాయ్ వర్ణించే విందు సన్నివేశాలను మరోమారు చదివాను. రాజయ్యగారు చెప్పగా విన్న హిందీ సినిమా 'పార్టీ'- గోవింద్ నిహలాని తీసింది- దాని ప్రభావమూ ఈ కథపై కొంతవుంది.

'చావు విందు' కథని ఆ కోణం నుంచే నడపాలని నిర్ణయించుకోవడానికి మరో నాలుగు కారణాలున్నవి. మొదటి కారణం ఏమంటే- అక్కడ ఆరంభిస్తేనే ఆ కథకు సంబంధించిన సమస్త విషయాలు కథలోకి తేవడానికి అలివి అవుతుంది. రెండో కారణం- అప్పటికి మా కథల్ని ప్రచురించే ఏకైక పత్రిక 'సృజన' ఆగిపోయింది. మాకు ప్రచురణ అవకాశాలు దాదాపు లేవు. అప్పటికే మా స్వంత ప్రచురణ

## ఇదీ కథ!

డబ్బుండాలేగానే 'చావు కూడా పెళ్లిలాంటిదే'! దుఃఖాన్ని కూడా 'భారీ లెవెల్లో' సెల బ్రేట్ చేసుకోవచ్చు. కానీ, ఈ కథలో దొర్సాని కన్నుమూసేనాటికి అందరికీ పోయేకాలం వచ్చేసింది. బంధు గణం, ఊరి జనం తినగా ఓ మంద మేకలు మిగిలిపోయేలాటి పరి స్థితులు తల్లకిందులై దొరలుముక్కల కోసం, చుక్కకోసం వెతుక్కోవాల్సిన కాలం వచ్చే సింది. ధన మదం, కండబలం, నెత్తినెక్కి నాట్యమాడే అహంకారంతో చుట్టూ ఏం జరుగుతోందో దొరలు చేతులు కాలేదాకా కనుక్కోలేకపోయారు. ఫలితం నలభై ఏళ్లుగా తాము సంపాదించుకున్న వందల ఎకరాల్లో ఎర్రజెండాలు వెలిశాయి. ఆ మాట వినే దొర్సాని కాలం చేసింది. ఆమె పదకొండో రోజు అతికొద్దిమంది దగ్గర బంధువులు ఒక దగ్గరజేరి చేసుకునే విందే ఈ 'చావు విందు'. ఈ నేపథ్యంలో వారంతా తాగి వర్లుతూ తమ అహంకారాలనీ, అభిజాత్యాలనీ, అమాయకత్వాలనీ బయటపెట్టుకుంటారు. అంతే కథ. అంతకుమించి ఏమీలేదు. కానీ, కథకుడు ప్రతిభావంతుడు కావడంతో కత్తిమీద సాములాంటి శిల్పంతో కథను అత్యద్భుతంగా మలిచాడు. దశాబ్దాల నక్సల్బరీ పోరా టాన్ని కథలో ఇమిడ్చాడు. శిల్పంతో ప్రయోగం చేస్తే విప్లవ కథను రొటీన్ బురద నుంచి ఎలా బయటకులాగొచ్చో ప్రతిభావంతంగా నిరూపించాడు.

ఆరంభించి- మెల్లగా కొనసాగిస్తూ వున్నా, అది చాలా పరిమితం. బయట పత్రికలే శరణ్యం. బయటి పత్రికలు మునుపటిలా ఉద్యమాన్ని డైరెక్టుగా చిత్రిస్తే వేసే పరి స్థితి లేదు. వాళ్లచేత వేయించే ప్రయత్నం చేయాలంటే 'ఈవలి కోణం' కుదరదు. 'ఆవలి కోణం'లోకి జంప్ కావాలి అని అనుకున్నా. రాజయ్యగారూ తల ఊపారు.

మూడో కారణం ఏమంటే- మన కథల్లో మధ్యతరగతి గురించి, పట్టణ పేద తరగతి గురించి, రైతులూ కార్మికులూ ఇట్లా చాలానే సాహిత్యం వచ్చింది. కాని శ్రామికవర్గ దృక్పథంతో పాలకవర్గాలను చిత్రిస్తూ కథా సాహిత్యం వచ్చిన దాఖ లాలు దాదాపు లేవు.

నాలుగోకారణం ఏమంటే ఆ కథలోకి వచ్చే పాత్రలన్నీ నా చుట్టాలు - బంధు వులు రక్త సంబంధీకులు - నేను పుట్టి పెరిగిన వాడిగా వాళ్లతో ఏదో విధంగా సంబంధ బాంధవ్యాలు కలిగినవాన్ని. వాళ్లకు నిజంగానే చాలా విషయాలు తెలి యవు- సామాజిక జ్ఞానం వాళ్ల దరిదా పుల్లో లేని విషయం. చాలా చిన్న విష యాలని కూడా పెద్దపెద్ద దెబ్బలుతినో- లేక బాగా నష్టపోయో నేర్చుకునేవారు- అందులో కూడా చాలామంది చాలా విష యాలని నెగిటివ్‌గానే తీసుకునేవారు- స్వార్థ ప్రపంచమే. కాని నా జన్మవల్ల స్వజ నులు! వాళ్లను నా పాఠకులుగా భావించు కుంటే... రచనా పద్ధతిలో ఏదోమార్పు కావాలి. దానికి వాళ్ళవైపు నుంచే కథ నడపడం కరెక్టు మెథడ్ అనుకున్నాను. అంతేకాక నిరంతర చలనంలోని రూలింగ్ క్లాస్ గురించి ఇటువైపువాళ్లూ తెలుసుకోవ లసివుంటుందనే ఓ అవగాహన కూడా తోడైంది.

పైన వివరించిన కారణాలన్నిటితో బాటు- అప్పటికి మొత్తం ఇరవై సంవత్స రాల ఉద్యమ సారాంశాన్ని ఒకే ఒక్కక థలో చెప్పాలనే ఓ అన్వేషణ కారణంగా 'చావువిందు' అట్లా రూపొందించవలసి వచ్చింది."

-సేకరణ: **దేశరాజు**

# బోటు షికారు

**ఉదయం జూపార్క్ శిల్పారామం అయిపోయాయి.
పనిలోపని తన ముద్దూ తీర్చేసుకున్నాడు.
ఇక వదిలించుకోవడమే మిగిలింది..**

రాగిణికి తెగ సంబరంగా ఉంది. ఎప్పటి నుంచో కంటున్న తన కలను బావ ఇవ్వాళ నిజం చేశాడు. హుస్సేన్ సాగర్ నీళ్లలో బోట్ సర్రున దూసుకుపోతుంటే ఆమె పసిపిల్లలా కేరింతలు కొడుతోంది. హైదరాబాద్ రావాలని, సినీహీరోలు, హీరోయిన్లతోపాటు చార్మినార్.. ట్యాంక్ బండ్, శిల్పారామం వగైరాలు చూడాలని నాలుగేళ్లుగా కలలు కంటోందామె. బావ పుణ్యమాని అది ఇన్నాళ్లకు నెరవేరింది. లేకపోతే తనెక్కడ? హైదరాబాద్ ఎక్కడ?

బావ నాలుగేళ్లుగా హైదరాబాద్‌లో సినిమా కంపెనీలో చేస్తున్నాడు కాబట్టే ఇప్పటికైనా కుదిరింది! లేకుంటే ఎప్పటికీ తానా పల్లెలో బర్రెలు మేపుకుంటూనే చచ్చిపోయేది.. అవును నీళ్ల మధ్యలో ఆ పొడుగాటి బొమ్మేంటి?

'బావా.. బావా ఆ బొమ్మేంటి బావా? అంత పొడుగ్గా ఉంది?'

'బుద్ధుడు బొమ్మ అదేనే పిచ్చిమొద్దూ..' విసుగ్గా అన్నాడు రాజేశ్. అతని ఆలోచనలు ఎటెటో తిరుగుతున్నాయి.

ఎప్పట్నించో లైనేస్తుంటే ఇప్పటిగ్గానీ పడలేదిది.. హైదరాబాద్ మీద దీనికున్న మోజునే ఎరగావేసి ఒడుపుగా సిటీకి తెచ్చాడతను. మొన్న అన్నపూర్ణ, రామానా







యుడు స్టుడియోలు తిప్పాడు. ఫిల్మ్‌సిటీకి ఒక రోజంతా పట్టింది. నిన్న చార్మినార్, గోల్కొండ చూశారు. ఉదయం జూపార్క్, శిల్పారామం అయిపోయాయి. పనిలోపని తన ముద్దూ తీర్చేసుకున్నాడు. ఇక వది లించుకోవడమే మిగిలింది.. అందుకే సాయంత్రం కనుచీకటి పడ్డాక సాగర్‌లో బోట్ షికార్ ప్రోగ్రామ్ పెట్టాడు. పడవలో తామిద్దరూ తప్ప మరెవ్వరూ లేరు. బోట్ డ్రైవర్ పడవకు ఆ మూలెక్కడో కూర్చు న్నాడు..

పడవ ఎక్కేముందు బోట్‌డ్రైవర్ తమకు రెండు లైఫ్‌జాకెట్లు ఇచ్చాడు. అతని ముందు వేసుకున్నట్లే వేసుకుని తర్వాత తన జాకెట్ విప్పేశాడతను.

రాగిణి ఆశ్చర్యంగా చూస్తుంటే-

'చమట కంపు! ఇప్పటికి ఎంతమంది తొడుక్కుని ఉంటారో! వాళ్ల రోగాలన్నీ మనకొస్తాయ్.. అందుకే...' అన్నాడు తెలి విగా. వెంటనే ఆమె కూడా విప్పేసి

పక్కన పెట్టింది.

ఈ సమయంలో నీళ్లలోకి రాగిణిని తోసేస్తే ప్రమాదవశాత్తూ పడిందని అనుకుంటారే తప్ప ఎవ్వరూ అనుమానించరు. ఊళ్లోవాళ్లకి తెలిసే అవకాశమే లేదు. తనకు కాలం కూడా కలిసొస్తోంది.. నీళ్లను కోసుకుపోతున్న పడవను తొంగి చూస్తూ తనలోకంలో తానుంది రాగిణి.

రాగిణి అనసూయమ్మత్త కూతురు! నాలుగేళ్లుగా చూస్తునే ఉన్నాడు. దబ్బపండులా మిసమిసలాడుతూ బంతిలా గెంతే దాన్ని చూడ్డానికే ఏదో సాకుతో నెలకోసారి పల్లెకు వెళ్లేవాడు. సినిమాకంపెనీలో పని చేస్తానని తెలిసి అంతా అతన్ని ఓ హీరోలా చూసేవారు. చిరంజీవి ఎలాఉంటాడు? బాలకృష్ణ సంగతులేంటి? అంటూ కుర్రకారు చుట్టూ చేరేవారు. ఉన్నవీ లేనివీ కలిపి అతనూ కోతలు కోసేవాడు. తన కబుర్లు వినడానికి రాగిణీ వచ్చేది. మౌనంగా వినేదేతప్ప మాట్లాడేది కాదు..

ఆ రోజు బాగా గుర్తు. అందరికన్నా ముందు రాగిణి వచ్చింది.

'బావా.. నువ్వు చార్మిని చూశావా?' అని అడిగింది వస్తూనే. అప్పటికే ఆమె రంగు, పొంగు, హంగులకు మనసులోనే దాసుడైన అతను ఛాన్సు దొరికిందని విజృంభించాడు.

'చూడడమేంటే నీ తలకాయ! ఆవిడ డైలాగు పేపర్ చదివి చెప్పేదే నేను! ఆవిడ ఒక్కతేనా? జెనీలియా, ఇలియానా, అశిన్ వీళ్లందరితో డైలాగులు చెప్పిస్తా.. చిరంజీవి సారైతే సెట్లో ఉన్నంతసేపూ 'రాజేశ్.. రాజేశ్' అంటూనే ఉంటాడు. అర్జున్ సార్.. అదేనే 'దేశముదురు'... చెయ్యిపట్టుకుని వదలడనుకో' అంటూ మరిన్ని కోశాడు.

రాగిణి అతనివంక అదోలా చూసింది. 'బావా.. నువ్వెంత అదృష్టవంతుడివి! సినిమా స్టార్లందరి దగ్గర తిరుగుతూ పని చేస్తావు! ఎంచక్కా అందరినీ దగ్గరనుంచి చూస్తావు' ఆమె గొంతులో కొద్దిపాటి నిరాశ.

'దాందేముందే కావాలనుకుంటే నువ్వూ చూడొచ్చు వాళ్లని.. అయితే హైదరాబాద్ రావాల'

'వస్తే చూపిస్తావా?'

'సినిమావాళ్లేకాదు.. హైదరాబాద్ మొత్తం చూపిస్తా'

మెల్లగా అలా ముగ్గులోకి దించాడు. వారంరోజుల క్రితం తన ప్లానంతా పల్లె డొంకలోనున్న మర్రిచెట్టు కింద వివరించి చెప్పాడు.

అంతా విని 'హమ్మో.. నావల్ల కాదు బాబూ' అంది.

'ఎందుకే భయం.. నేను హైదరాబాద్ వెళ్తున్నానని రేపే పల్లె నుంచి బయలుదేరి మార్కాపురం చేరుకుంటా. ఎల్లుండి పగలంతా నువ్వు ఊళ్లోనే ఉంటావు కనుక ఎవరికీ అనుమానం రాదు. రాత్రి పదింటికి మాత్రం మార్కాపురానికి వచ్చెయ్. ఇద్దరికీ టిక్కెట్లు తీసుంచుతా.. తెల్లారేసరికల్లా హైదరాబాద్‌లో ఉంటాం'

'అమ్మ..'

'అత్తదేముందే పిచ్చిమేళం! ఏదో చెప్పేయ్.. పక్క పల్లెలో ఉన్న మీ పెద్దమ్మ దగ్గరకు పోయొస్తానని చెప్పు..'

అన్నట్లుగానే ఇద్దరూ హైదరాబాద్ చేరుకుని ఓ చౌకబారు లాడ్జిలో దిగారు. పగలంతా అన్నీ తిరిగి చూపించేవాడు. రాత్రి లాడ్జిలో పండగ చేసుకునేవాడు. నాల్రోజులయ్యేసరికి మొఖం మొత్తింది. చేతిలోని పైసలూ కర్పూరంలా కరిగిపోతున్నాయి.. పైగా తనేమో పెళ్లిచేసుకుందాం అంటోంది. తప్పుదు ఎలాగైనా ఒదిలించుకోవాల్సిందే! కాదంటే ఊళ్లో పంచాయతీ

# సంకట పరిస్థితి



మిస్సోరిలోని కౌన్సాస్ సిటీకి చెందిన స్కాట్ బేకర్ మరణించిన తన తండ్రి శవాన్ని పెంపుడు జంతువుల శ్మశానవాటికలో పాతిపెట్టాడు.




మనుషుల శ్మశానవాటికలో సమాధి చేసేందుకు శవపేటికకి, సెమెట్రీ నిర్వాహకులకు కట్టడానికి 4000 డాలర్లు లేకపోవడంతో అతనలా చేశాడు. నెలసరి వాయిదాల్లో చెల్లిస్తానన్నా ఆ సెమెట్రీ వాళ్ళు అంగీకరించకపోవడంతో స్కాట్‌కు అలాంటి దుస్థితి ఎదురైంది.

అయితే స్కాట్ అక్కాచెల్లెళ్ల తండ్రి శవాన్ని బయటకితీసి మనుషుల శ్మశానవాటికలో తన సోదరుడు సమాధి చేయాలని కోర్టులో కేసు వేసారు. వాళ్లు కేసు గెలవడంతో శవాన్ని మనుషుల స్మశానానికి మార్చారు.

---

పెట్టినా పెడుతుందీ ముండ! అప్పుడే ఇదే వడితోనో లేచిపోయిందని ఊళ్లో టాకొచ్చేసిందిట. ఉదయాన్నే నారాయడు సెల్‌లో చెప్పాడు. 'అలాగా?' అన్నాడేతప్ప తను బయటపడలేదు.

'బావా.. ఇవ్వాళ బావర్చీలో బిర్యానీ తినిపిస్తానన్నావు గదా?' సడెన్ గుర్తుకొచ్చింది కాబోలు గారాలుపోతూ అడిగింది రాగిణి.

'ఓకే' అన్నాడతను. నువ్వు బతికుంటే గదా బిర్యానీ తినడానికి అనుకున్నాడు మనసులో.

ట్యాంక్‌బండ్‌మీది లైట్ల నీడల్ని నీటిలో చూస్తూ తన్మయత్వంలో ఆమె మునిగితేలుతున్న వేళ తన ప్లాన్‌ను అమలుచేశాడు రాజేశ్.

అనూహ్యంగా తోసిన తోపుకు ఆమె కెవ్వున అరుస్తూ నీటిలో పడిపోయింది.. పడిపోతూ పట్టుకోసం అతని భుజాలు గట్టిగా పట్టుకోవడంతో అతనూ బాలెన్స్ తప్పి ఆమెతో పాటే నీటిలోకి జారిపోయాడు.

బోట్‌డ్రైవర్ అదిరిపడ్డాడు. వాళ్లిద్దరికిచ్చిన లైఫ్ జాకెట్లు బోట్‌లోనే ఉండడం అతన్ని మరింత కంగారు పెట్టింది.

రెండు మునకలు వేసిన రాగిణి ఎలాగైతేనేం? మళ్లీ తేలి పడవంచు పట్టుకుంది. అమ్మోరు బావిలో ఈతకొట్టడంలో ఆరితేరిన ఆమె నీళ్లు తాగకుండా ప్రాణాలు కాపాడుకోగలిగింది. అంతేకాదు. మరోచేత్తో పక్కనే మునుగుతూ.. తేలుతూ చావుకు దగ్గరవుతున్న రాజేశ్ చొక్కాను పట్టుకుని పడవవైపు లాక్కొచ్చింది. బోట్‌డ్రైవర్ ఇద్దరినీ పైగిలాగాడు.

పొట్టనిండా నీళ్లు తాగిన రాజేశ్‌తో నీళ్లు కక్కించారు రాగిణీ, బోట్‌డ్రైవర్ కలిసి. పదినిముషాల్లో అతను తేరుకుని లేచి కూర్చున్నాడు. తనవంకే చూస్తున్న రాగిణి కళ్లలోకి చూడలేక తలదించుకున్నాడు..

చలికి గజగజ ఒణుకుతూ.. మునగదీసుకు కూర్చున్న వారిద్దరితో నిశ్శబ్దంగా పడవ ఒడ్డుకు మళ్లింది.

-చంద్రప్రతాప్

# కాలాతీతం

# మన కాలం వీరుడు



లెర్మొంతోవ్

గెలెన్‌జిక్‌లో ఉన్న తన సైనిక పటాలానికి చేరడంకోసం కథానాయకుడు పెచోరిన్ మార్గమధ్యంలోని తమాన్ రేవు పట్టణం చేరుకోవడంతో 'మనకాలం వీరుడు' ప్రారంభమవుతుంది.

"పటాలంలో చేరాక, ఓ దండయాత్రలో పాల్గొని, విశ్రాంతికోసం 'ప్యాడిగోర్‌స్క్' అనే ఖనిజ జలం గల పట్నంలో బస చేస్తాడు. ఆరోగ్యం కోసం దూరప్రాంతాలలోని ధనికులు అక్కడికొచ్చి సేదతీరుతుంటారు. అంతకు ముందే అక్కడికొచ్చిన పాత గాయపడి విశ్రాంతి తీసుకుంటున్న కేడెట్ గ్రుష్‌నీత్‌స్కీ- పెచోరిన్‌ని పలకరిస్తాడు. పదసంఘటనలతో, అలంకారిక శైలిలో మాట్లాడే అతను ఆ సమీపంలోంచి వెడుతున్న అందగత్తె అయిన రాకుమారిని ఆకర్షించేందుకు ప్రయత్నిస్తూ, ఆమె సానుభూతి పొందేందుకు తన గ్లాసుని కిందకు జారవిడిచి, గాయపడిన కాలువల్ల దాన్ని అందుకోలేక పోతున్నట్లు నాటకమాడేసరికి, రాకుమారి మేరీ దాన్ని తీసి అతనికందిస్తుంది. అది ఆమె ప్రేమచిహ్నంగా భావించాడతను.

పెచోరిన్‌కు అక్కడ డాక్టర్ వెర్నర్ మిత్రుడయ్యాడు. ఓ రోజు పెచోరిన్‌తో వెర్నర్ కావాలంటే అందగత్తె అయిన రాకు



మారిని పరిచయం చేస్తానని, ఆమె తల్లి తన పేషెంటేనని చెబుతాడు.

గ్రుష్‌నీత్‌స్కీ రాకుమారిని అంటిపెట్టుకు తిరుగుతూ, ఆమె తనను ప్రేమించిందనే భ్రమలో పడికొట్టుకుపోతూ, ఆమెను పరిచయం చేస్తానని పెచోరిన్‌తో అంటాడు. అతడందుకు అంగీకరించక, రాకుమారికి దూరంగా ఉన్నట్లు నటిస్తూ తన సంభాషణ చాతుర్యంతో ఆమె చుట్టూ మూగే ఆరాధకుల్ని తనచుట్టూ చేరేట్టు చేసుకుని, తద్వారా ఆమెను ఆకర్షించేందుకు ప్రయత్నిస్తాడు. బట్టల దుకాణంలో ఆమె బేరమాడిన రగ్గుని ఎక్కువ ధరకు తీసుకొని, ఆమెకు కోపాన్ని రగిలిస్తాడు. పైపెచ్చు గ్రుష్‌నీత్‌స్కీకి ఓ ప్రేమపాఠం ఇలా చెబుతాడు- "రష్యన్ యువతులు వివాహాపేక్ష లేకుండా కేవలం ఆధ్యాత్మిక ప్రేమకి మాత్రమే ఉంటారు. అది మనకి వెగటుగా ఉంటుంది. నీ సాహచర్యంలో ఆమెకి రెండు నిమిషాలు విసుగెత్తితే ఇక నీ పని గోవిందా. నీ ముఖభావం ఆమెకు కుతూహలాన్ని రేకెత్తించాలి. ఎంతసేపు ఆమెను నువ్వు ఆందోళన పెడుతుండాలి. నీకోసం ప్రజాభిప్రాయాన్ని ఆమె ఒకటికి పదిసార్లు ఎదిరించి దాన్ని త్యాగం అంటుంది..."

ఓ రోజు తన మాజీ ప్రియురాలు వేరాని కలుసుకుంటాడు పెచోరిన్. బాగా డబ్బున్న ముసలి రోగిష్టి సెమియోన్‌ని పెళ్లాడిందామె. అయినా పెచోరిన్‌ని మర్చిపోలేక పోతుంది. ఆమె భర్త మేరీకి బంధువైనందున, వారక్కడ మేరీతో పాటే ఉన్నారు. తనని చూడ్డానికి మేరీ ఇంటికి రమ్మని, ఇతరులకు ఇది తెలియకుండా మేరీకోసం వస్తున్నట్లు ప్రవర్తించమని వేరా కోరితే అతడంగీకరించాడు. ఇది సరదా కాలక్షేపం అనుకుంటాడు.

మేరీ అభ్యర్థన మేరకు రెస్టారెంట్ హాల్లో ఆమెతో నృత్యం చెయ్యాలని నిశ్చయించుకున్నాడతను. అతడు అంగీకరించ




డం తన విజయంగా మేరీ భావించింది. నాట్యం అనంతరం ఓ తాగుబోతు ఆమెను అల్లరి చెయ్యబోతే పెచోరిన్ ఆమెను రక్షించాడు. అదేసమయంలో తన మిత్రుడు గ్రుష్‌నీత్‌స్కీ బండారం బయటపెట్టేసరికి, తనకతనిపట్ల ఇష్టం లేదన్నదామె. ఆ మర్నాడు పెచోరిన్ గ్రుష్‌నీత్‌స్కీతో కలిసి మేరీ ఇంటికెళ్లాడుగానీ, అక్కడామెను పట్టించుకోకుండా, కొత్తగా పరిచయమైనట్లు నటిస్తూ వేరాతో మాట్లాడుతుండిపోయాడు. మేరీకి కోపం వచ్చింది. గ్రుష్‌నీత్‌స్కీ పట్ల విసిగిపోయిందామె. తను పెచోరిన్‌తో మాటలు కలిపి, అతనికబుర్లకి ఆనందిస్తూ, అతను దూరమైతే బాధపడడాన్ని గమనిస్తూ, ఆమె తనని ప్రేమిస్తున్నట్లు నిర్ధారణ చేసుకుంటాడు. తన డైరీలో "పెళ్లి చేసుకుందామని అనుకోని పడుచుపిల్ల ప్రేమకోసం పట్టువిడవకుండా ఎందుకు అన్వేషిస్తాను...ఒక ఆడదాని దగ్గర్నుండి మరో ఆడదాని దగ్గరకు..." అంటూ రాసుకుంటాడు.

ఓ రోజు షికారు వెడుతూ మేరీకి పెచోరిన్ తన చిన్ననాటి అనుభవాలను కరుణరసార్ద్రంగా వివరించి ఆమె సానుభూతి పొందాడు. అతని చేతిని పట్టుకుని విడవకుండా తొలిస్పర్శను అనుభవించిందామె. ముందు అనుకున్న ప్రకారం వేరా తన భర్తతో కిస్లోవోదీస్క్ వెడితే, ఆ తర్వాత

# లెర్మొంతోవ్

## 1814 - 1841

పుష్కిన్, గొగోల్, చెకోవ్, టాల్‌స్టాయ్, దోస్తొయేవ్‌స్కీ, గోర్కీ, కుప్రీన్, తురెనేవ్ తదితర ఉత్తమ సాహితీమూర్తుల సరసన సముచిత స్థానం అలంకరించినవాడు లెర్మొంతోవ్. కేవలం ఇరవై ఆరేళ్లకే ఒకే ఒక్క నవల 'మన కాలం వీరుడు' ద్వారా ఈ ఘనత సాధించాడు. ద్వంద్వ యుద్ధం లో మరణించకపోయుంటే అతని కలం నుండి మరెన్ని నవలలు, కావ్యాలు వెలువ డేవో. లెర్మొంతోవ్ పైన పేర్కొన్న నవలకు ముందే పలు కావ్యాలు రచించి ఆధునిక రష్యన్ మహాకవి పుష్కిన్ తర్వాత అంతటి స్థానాన్ని పొందిన సంగతి గుర్తుంచుకోవాలి.

లెర్మొంతోవ్ వర్ణనల్లాంటివి ఎవరూ చెయ్యలేరనేది కారల్ మార్క్స్ అభిప్రా యం. "మన దేశంలో ఎవళ్లూ ఇంతటి ఉదాత్తమైన జీవంతో తొణికిసలాడే వచన శైలి రాయలేదు. అతను జీవిత వాస్తవికత లోకి చొచ్చుకుపోయాడు. రష్యన్ జీవిత మహత్తర చిత్రకారుడయ్యే ఆశని కలిగిం చాడు. కానీ అకాల మృత్యువు అతన్ని మనకు దక్కకుండా చేసింది" అని ప్రసిద్ధ రష్యన్ రచయిత, నాటకకర్త గొగోల్ కొనియాడారు.

లేర్మొంతొవ్ పూర్తిపేరు మిహాయిల్ యూరియేవిచ్ లెర్మొంతోవ్. 1814 అక్టో బరు 15న మాస్కోలో జన్మించాడు. అమ్మ చిన్నప్పుడే చనిపోతే, ధనికురాలైన అమ్మమ్మే పెంచి పెద్దచేసింది. తండ్రి గురించి అంతగా తెలీదు. జర్మన్ ఆయా పెట్టిన తీవ్ర ఆంక్షలు, భూదాసులపై అమ్మమ్మ దౌర్జన్యం అతనిపై తీవ్ర ప్రభావం కలగజేసి, స్వేచ్ఛపట్ల గాఢాను రాగం కలగడానికి దోహదం చేశాయి. బైరన్‌ని ఆరాధించాడు. స్వేచ్ఛకోసం పరి తపించిన విప్లవ కవి పుష్కిన్ పట్ల ఆకర్షి తుడయ్యాడు. మాస్కో విశ్వవిద్యాల యంలో చేరాడుగానీ, ఎవరో అధ్యాపకు డిపై గేయం రాసినందుకు, పోట్లాడినం దుకో వెళ్లగొట్టేస్తే సెయింట్‌పీటర్స్‌బర్గ్‌కి వెళ్లాడు. అప్పుడే భగ్న ప్రేమికుడయ్యాడు. 1832లో అశ్విక శిక్షణాలయంలో కేడెట్‌గా చేరి, 1834లో రెండవ లెఫ్టినెంట్ రాంక్ పుచ్చుకుని హుస్సార్ దళంలో పనిచేశాడు. 1837లో మహాకవి పుష్కిన్ ద్వంద్వ యుద్ధంలో చనిపోవడంతో 'కవి మరణం' అనే ప్రసిద్ధ పద్యం రాశాడు లెర్మొంతోవ్. అందులో రాజాస్థానాన్ని విమర్శించినం దుకు ప్రవాసశిక్ష పడింది. కానీ అమ్మమ్మ

---

పెచోరిన్ వెళ్లాడు. అక్కడ కాకతాళీయంగా కలుసుకున్నట్లు కలుసుకునేవారు. ఇంతలో అక్కడికొస్తున్న మేరీ రాకుమారి బండిని చూసి అతనిగుండె దడకొట్టుకుంది. దాంతో ఆమెను తను ప్రేమించడం లేదు కదా? అన్న సందేహం వచ్చిందతనికి.

ఓ రోజు సాయంకాలం జనం గుంపు వెనుకగా వెళుతున్న మేరీ, పెచోరిన్‌లు వేగంగా ప్రవహించే వాగు దాటి వెళ్లాల్సి వచ్చింది. ఆ వాగు వేగానికి పడిపోతానే మోనని ఆమె భయపడితే ఎత్తుకుని దా టించాడతను. ఆ సమయంలో అతనితో ఆమె "నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానని మొదటనే నే చెప్పాలేమో? " అంది. ఆ సంగతి నాకెందుకని అతననేసరికి ఆమె వేగంగా దౌడు తీస్తూ గుర్రంమీద వెళ్లిపో

పలుకుబడితో బయటపడ్డాడు. ఆ రోజుల్లోనే ప్రసిద్ధ విమర్శకుడు బెలిన్‌స్కీని, ప్రముఖ రచయిత తుర్గెనేవ్‌ని కలిశాడు. ఫ్రెంచ్ రాయబారి కొడుకుతో ద్వంద్వ యుద్ధం చేసి ప్రవాస శిక్షపొందాడు. ప్రవాసంలోనే మేజర్ 'మర్తినోవ్' సోదరి, 'నదేజ్దా'ని ప్రేమించి, మేజర్‌తో ద్వంద్వ యుద్ధంలో మరణించాడు.

లెర్మొంతోవ్ జీవించిన కాలం రష్యాలో ఒక సంక్షుభిత కాలం. యూరప్‌లో ఎదురులేని నెపోలియన్ 1912లో మాస్కో ను ముట్టడించి ఓటమిపాలైతే తోకముడిచాడు. దీంతో రష్యా ఉదారవాదుల్లో స్వేచ్ఛా పిపాస నెలకొంది. జార్ మీద ఆశలు అడియాసలు కావడంవల్ల 1825 డిసెంబర్‌లో తిరుగుబాటు చేశారు. దీంట్లో పాల్గొన్నవారికి డిసెంబరిస్టులనే పేరొచ్చింది. ఈ తిరుగుబాటు విఫలమైనా రష్యన్ సంస్కృతి వికాసంపై తీవ్ర ప్రభావం నెరపి, క్రమంగా 1917లో విప్లవానికి దారి తీసింది. మాస్కో విశ్వవిద్యాలయంలో చదివేనాడే లెర్మొంతోవ్‌పై డిసెంబరిస్టుల ప్రభావం పడింది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం తపన, డిసెంబర్ తిరుగుబాటు వైఫల్యం ఫలితంగా వచ్చిన నిరాశామయ వ్యాకులపాటు లెర్మొంతోవ్ రచనల్లో కనబడుతుంది.

లెర్మొంతోవ్ 16వ ఏటే 'దేవత' అనే ప్రసిద్ధ కావ్యం రాశాడు. ఆ తర్వాత అగ్రహోదగ్ర పదాలగుబాళింపుకు గొప్ప ఉదాహరణగా విమర్శకులు పేర్కొనే 'కవి మరణం' అనే దీర్ఘపద్యం రాశాడు. దీన్ని రాసినందుకే ప్రవాసశిక్ష పడింది. రొమాంటిక్ లక్షణాలతోపాటు విషాద కావ్య లక్షణాలూ ప్రతిఫలించేట్లుగా 'దీక్షార్థి', 'రాక్షసుడు' అనే రెండు ఉత్తమ కావ్యాలు రాశాడు లెర్మొంతోవ్. 'దీక్షార్థి'లో మత జీవితానికీ, జైలుకీ తేడా లేదనీ, స్వేచ్ఛ సంపాదించుకోవడానికి ఏ ప్రమాదాన్నయినా ఎదుర్కోవడానికి సాహసించడం కనిపిస్తాయి. ఇక 'రాక్షసుడు'లో స్వేచ్ఛకోసం దేవుడి మీద తిరుగుబాటు చేసిన శక్తి స్వర్గచ్యుతుడై, 'తమార' అనే సుందరిని ప్రేమించి, అందులో విఫలం కావడం వస్తువు. రష్యన్ సాహిత్యంలో దీన్ని ఉత్తమ కావ్యంగా విమర్శకులు ప్రశంసించారు. ఇక తన నవలకి 'మన కాలం వీరుడు' అనే పేరు పెట్టడంలోనే గొప్ప అధిక్షేపాన్ని చూపించాడు రచయిత. వీరుడంటే గొప్ప పరాక్రమశాలి అని అనుకుంటాం. కానీ ఈ నవలలోని కథానాయకుడైన పెచోరిన్ అలాంటి వ్యక్తిగా కనబడడు. అతనిలో ఎన్నో ఉత్తమ గుణాలున్నా, డబ్బువల్ల వచ్చిన కొన్ని అవలక్షణాలవల్ల ఏకాంక్షలూ లేకుండా గడుపుతాడు.

---

యింది. ఆ సాయంకాలం గ్రుష్‌నీత్‌స్కీ మరికొందరితో కలిసి తనతో ద్వంద్వ యుద్ధానికి పన్నాగం పన్నడాన్ని చాటునుంచి విన్న పెచోరిన్ 'వాళ్లందరికీ తనంటే ఎందుకంత అసహ్యం?' అని ప్రశ్నించుకున్నాడు. ఆ మర్నాడు మేరీ ఇంటికతను వెళ్లినప్పుడు ఆమె పెళ్లిగురించి కదిలించేసరికి, తనామెను ప్రేమించడంలేదని చెప్పాడు. ఈ ఘట్టం జరిగినతర్వాత తనని తనే అసహ్యించుకున్నాడతను. ఏ స్త్రీతో ప్రేమకలాపం జరిపినా పెళ్లి ప్రసక్తి వస్తే ఆ ప్రేమకి నీళ్లొదులుకుంటాడు. ఇతరుల్ని వంచించడమేనా తనపని అని తననితనే ప్రశ్నించుకుని, సమాధానాన్ని డైరీలో రాసుకున్నాడు. ఆ సమాధానం ఏమిటంటే 'భయంవల్ల' అని, ఎందుకా

భయం అంటే- ఓ ముసలావిడ అతని తల్లికి అతని జాతకం చెప్పిందట- అతను ఓ దుష్టురాలైన పెళ్లాంవల్ల చనిపోతాడని! ఆ జ్యోతిష్యం అతనిమీద గాఢమైన ముద్ర వేసింది. అదీ సంగతీ!

మేరీ రాసిన చీటీ ప్రకారం మేరీతల్లి, పనివాళ్లు ఓ ఇంద్రజాలికుని ప్రదర్శనకు వెళ్లిననాటి రాత్రి ఆమెను కలుసుకున్నాడు పెచోరిన్. ఆ ఇంటినుండి తెల్లారుజామున

> కాముకుణ్ణి ఆదర్శంగా చెయ్యడం కొంత మందికి కష్టం కలిగించింది. అయ్యల్లారా! మనతరం దోషాలన్నిటినీ కలిపి కూర్చిన చిత్రం ఇది. మనిషన్నవాడు అంత దుర్మార్గంగా ఉండడని మీరన వచ్చు. కానీ విషాద కథల్లోనీ, ప్రేమ కథ ల్లోనీ దుష్టుల ఉనికిని మీరు అంగీకరించి నప్పుడు పెచోరిన్ లాంటివాడు ఉన్నాడని ఎందుకు నమ్మరు? ఇంతకంటే భయంక రమైన, ఏవగింపైన పాత్రలని మీరు అభి నందించ గలిగినప్పుడు ఈ పాత్రపట్ల ఎందుకు కనికరంగా ఉండరు? జనాలకి జీర్ణకోశం చెడిపోయినప్పుడు ఇలాంటి చేదు మందులూ, కఠోర సత్యాలే కావాలి
>
> - లెర్మొంతోవ్

దొంగచాటుగా బయట పడుతూంటే, అతన్నెలాగైనా పట్టుకోవాలని చూసిన గ్రుష్నీత్స్కీ బృందాన్ని తప్పించుకుని వెళ్లిపోయాడు. మర్నాడు తనగురించి, మేరీ గురించి ఓ రెస్టారెంట్‌లో అసభ్యంగా మాట్లాడుతున్న గ్రుష్నీత్స్కీని చూసి మండిపడి ద్వంద్వయుద్ధానికి ఆహ్వానించాడు. డాక్టర్ వెర్నర్ సహాయకుడిగా పెచోరిన్, ఆ ద్వంద్వ యుద్ధంలో గ్రుష్నీత్స్కీని చంపాడు. ఆ యుద్ధానికి ముంద తను తన డైరీలో ఇలా రాసుకుంటాడు. "నేనెందుకోసం బతికాను? ఎందుకోసం పుట్టాను? క్షుద్రకాంక్షల వ్యామోహాలకు లొంగిపోయాను. వాటి కఠోర పరీక్షల నుంచి ఇనుములాగా గట్టిగా, జడంగా బయటికొచ్చాను. బహుశా రేపు చచ్చిపోతాను. కొంతమంది నా గురించి అధ్వాన్నంగా, కొందరు మంచిగా అనుకుంటారు. ఉభయులూ తప్పే అవుతారు. దీని తర్వాత బతికేయాతన పడ్డం తగునా..? " అని రాసుకుంటాడు.

ద్వంద్వయుద్ధం నుంచి వచ్చేసరికి వేరా రాసిన ఉత్తరం వచ్చింది. తను అతని కోసం ఎంతో త్యాగంచేసింది కాబట్టి, అతను మేరీని పెళ్లాడకుండా త్యాగం చెయ్యాలని దాని సారాంశం. ద్వంద్వ యుద్ధం గురించి అధికారులు ఆరా తీశారని, అతడి మీద చర్య తీసుకోబోతున్నారని హెచ్చరించి సానుభూతి చూపించి వెళ్లాడు డా. వెర్నర్. దానితర్వాత పెచోరిన్ డైరీలో ఇలా రాసుకుంటాడు! "అది సరిగ్గా మనుషులకి లాగానేవుంది. వాళ్లంతా ఒక్కటే. ఒక చర్యకి గల దుష్టపార్శ్వాలన్నింటి గురించి తెలిసివున్నా, వాళ్లు దానికి ఆజ్యం పోసి ఆమోదం తెలుపుతారు. ఇక వేరే మార్గం లేదని గ్రహించాక చేతులు కడిగేసుకుని పోతారు. వాళ్లంతా ఒక్కలాగే వుంటారు. ఎంతో దయ, తెలివిగల వాళ్లు కూడా."

దుర్గంలో హాజరు కావలసిందిగా పై అధికారులు ఆజ్ఞాపించినప్పుడు, సెలవు తీసుకునేందుకు రాకుమారి ఇంటికెళ్లాడు పెచోరిన్. తన కూతురు అతన్ని ప్రేమిస్తోందని, ఆమె అతన్ని సుఖపెట్టగలదనీ ఆమె తల్లి చెప్పింది. అక్కణ్ణుంచి ఆమెకూతురితో మాట్లాడేందుకు వెళ్లిన పెచోరిన్, తనామెను పరిహాసం చేశానని, అందువల్ల తననామె ఏవగించుకోవాలని చెబుతూ, "మీ ముందు నన్ను నేను కించ

పరుచుకుంటున్నాను. ఒకవేళ మీరు నన్ను ప్రేమించినా, ఈ క్షణం నుంచీ అసహ్యిం చుకుంటారు... అసహ్యించుకోరూ? " అన్నాడు. అసహ్యించుకుంటున్నానని ఆమె అనేసరికి, అక్కణ్ణుంచి వచ్చేశాక తిరిగి తన గురించి ఇలా డైరీలో రాసుకున్నాడు- "నేను సముద్రపు దొంగల ఓడమీద పుట్టి పెరిగిన ఆటుపోట్లకి ఎంతగానో గురయి నవాణ్ణి. ద్వంద్వయుద్ధం చేసినందుకు శిక్షగా పెచోరిన్‌ను ఓ దుర్గానికి పంపించారు. అప్పటికి పెచోరిన్‌కి నిండా పాతికేళ్లు కూడా లేవంటే అతనెంత రాటుదేలిపోయాడో ఊహించుకోవచ్చు అతను కెప్టెన్‌కి భలేనచ్చాడు. ఆ దుర్గం చుట్టుపక్కలగల సర్కేషియన్ల రాజు కూతురి పెళ్లికి వెళ్లిన పెచోరిన్‌కి రాకుమారి బేలా నచ్చింది. డబ్బన్నా, గుర్రాలన్నా పిచ్చిగా వ్యామోహపడే ఆమె సోదరుడికి ఆశపెట్టి ఆమెను ఎత్తుకొచ్చి తనకప్పగించేలా ఏర్పాటు చేసుకున్నాడు. అలా వచ్చిన బేలా మొదట అతనికి లొంగకపోయినా, ఆ తర్వాత లొంగిపోయింది. దాంతో విచిత్రంగా అతనామెను నిరాదరించాడు. దీన్ని ప్రశ్నించిన కెప్టెన్‌తో "నా నడవడిక దురదృష్టకరమైంది. ఇతరులకు బాధకలిగిస్తే నాకు తక్కువ బాధకలగదని తెలుసు... కానీ ఆమె అంటే నాకు విసుగెత్తింది...ఏదీ నాకు తృప్తి కలిగించదు..." అన్నాడు. అంతకుముందే బేలాపై కన్నేసిన దొంగ కాజ్‌బిచ్ బేలాని ఎత్తుకెళ్లబోయి అది కాస్తా విఫలమవ్వడంతో ఆమెను పొడిచి పారిపోయాడు. కొద్దిరోజుల్లోనే ఆమె మరణించింది.

చాలాకాలం గడిచింది. పెచోరిన్ ఆ దుర్గాన్ని వదిలివెళ్లి సంవత్సరాలు గడిచిపోయాయి. ఓ రోజు కెప్టెన్ మక్సీమ్ లోయలో ప్రయాణిస్తుండగా రచయిత దారిలో తారసిల్లాడు. ప్రయాణం చేస్తూ విశేషాలు రాసిపెట్టుకునే రచయిత- కెప్టెన్ నుంచి సాహస గాథలు వినగోరేసరికి, ఆయన పెచోరిన్-బేలాల వృత్తాంతం చెప్పాడు. ఆ తర్వాత మజిలీలో వారిద్దరూ విశ్రాంతి తీసుకుంటుండగా పెచోరిన్ అక్కడికి వస్తున్నట్లు తెలుసుకుని చాలకాలం తర్వాత అతన్ని కలుసుకోబోతున్నందుకు ఆనందించాడు కెప్టెన్. కానీ హడావిడిగా వచ్చినట్లే వచ్చి వెంటనే కెప్టెన్ భోంచేసి వెళ్లమని ప్రాధేయపడినప్పటికీ ఉండక,



అర్జంటుగా వెడుతున్నానని చెప్పి, పెచోరిన్ వెళ్ళిపోయాడు. ఆ నిరాదరణకు ముసలి కెప్టెన్ కన్నీటిపర్యంతమయ్యాడు. ఆ కోపంతో తన దగ్గరుండిపోయిన పెచోరిన్ డైరీలను, రచయిత అడిగినంత మాత్రాన్నే ఇచ్చేసి, అవసరమైతే వాటిని అచ్చు వేసుకోమన్నాడు. కెప్టెన్ మనసు మార్చుకోక ముందే రచయిత వాటిని పట్టుకుపోయాడు. తర్వాత రచయితకు కొంత కాలానికి పర్షియా నుంచి వెనక్కి

వచ్చేస్తూ మార్గమధ్యంలో పెచోరిన్ చని పోయినట్లు తెలిసింది. అప్పుడు రచయిత పెచోరిన్ డైరీలను పరిశీలిస్తే, వాటిలో పెచోరిన్ తన బలహీనతల్ని నిర్దాక్షిణ్యంగా బయట పెట్టుకోవడం చూసి, అతను నిజా యితీ పరుడని అర్థం చేసుకున్నాడు. పాఠ కులకు ఎంతో కొంత మంచి చేద్దామన్న కోరికతో ఆ డైరీల్లో భాగాలను ప్రచురిస్తూ, ఆ పుస్తకానికి 'మన కాలం వీరుడు' అని పేరు పెట్టాడు. ఇదీ క్లుప్తంగా నవలలోని కథ!

లెర్మొంతోవ్‌ని, అతని నవలని అప్రతిష్ట పాలు చేసే ప్రయత్నాలకు సమాధానం చెబుతూ మహా విమర్శకుడు, ప్రజాస్వామి కవాదీ అయిన బెలిన్‌స్కీ పెచోరిన్ గురించి ఇలా రాశాడు- "దురహంకారి, దుష్టుడు, క్రూరుడు, నైతికభ్రష్టుడు... అని నీతి ప్రౌఢ విహారులు ఏక కంఠంతో అన వచ్చు. పెద్ద మనుషులారా మీరు సబబే. కానీ మీకెందుకు బాధ? అతని పాపాలకి మీరతన్ని నిందించడం లేదు. మరి మీకే అవి బోలెడున్నాయి. మీ పాపాలు మరీ అప్రతిష్టాకరమైనవి..."

లెర్మొంతోవ్ నవలని స్వేచ్ఛాయుత ఆలోచనలకి గొప్ప దర్పణంగా, విస్తృత సాంఘిక దృగ్విషయానికీ, మొత్తం ఒక తరం రుజాగ్రస్తతకీ రూపంగా పెచోరిన్ పాత్రని రష్యన్ ప్రజాస్వామిక విమర్శకులు అభినందించారు.

పెచోరిన్ వ్యక్తిగత స్వేచ్ఛకోసం ప్రయ త్నించాడు. తను ద్వేషించిన ఉన్నత వంశీ కుల సమాజాన్ని విచ్ఛిన్నం చెయ్యడంగా, తనకంటే చాలా తగ్గులో ఉన్న ప్రజల నుంచి వేర్పాటుగా దాన్నతను అర్థం చేసు కున్నాడు. అతను తనలోకి తనే ముడుచు కుపోయి విషాదభరిత ఏకాంతంలో నాశనం అయిపోయాడు. విద్వేషభరిత పరివేష్టిత ప్రపంచంతో పోరాడే సాధనం అతనికి లేకపోయిందని రష్యన్ సాహిత్య విమర్శకుడు ఆంద్రోన్నికోవ్ వ్యాఖ్యానిం చాడు.

"మన కాలం వీరుడులాంటి కాముకుణ్ణి ఆదర్శంగా చెయ్యడం కొంత మందికి నిజంగా కష్టం కలిగించింది. ఇది నిజంగా ఒక చిత్రణే గానీ, ఒక ప్రత్యేక వ్యక్తిది కాదు అయ్యల్లారా! మనతరం దోషాలన్ని టినీ కలిపి కూర్చిన చిత్రం ఇది. మనిష న్నవాడు అంత దుర్మార్గంగా ఉండడని మీరనవచ్చు. కానీ విషాద కథల్లోనీ, ప్రేమ కథల్లోనీ దుష్టుల ఉనికిని మీరు విశ్వసిం చినప్పుడు పెచోరిన్ లాంటివాడు ఉన్నా డని మీరెందుకు నమ్మరు? ఇంతకంటే భయంకరమైన, ఏవగింపైన పాత్రలని మీరు అభినందించ గలిగినప్పుడు ఆ పాత్రపట్ల మీరెందుకు కనికరంగా ఉండరు? దీనివల్ల తెలుసుకునే నీతి ఏ ముందని మీరనొచ్చు. క్షమించండి. దానికి నేనంగీకరించను. జనాలకి జీర్ణకోశం చెడి పోయేటట్టు తినిపించిన తీపి పదార్థాలు చాలు. ఇప్పుడు చేదు మందులూ, కఠోర సత్యాలే కావాలి" అంటాడు నవల ముందు మాటలో లెర్మొంతోవ్.

నిజానికీ మాటలు 160 ఏళ్ల కిందట రచయిత రష్యన్ సమాజం గురించి చెప్పినా, ఇప్పటికిప్పుడు కొన్ని చిన్న చిన్న మార్పులతో మన సమాజానికీ వర్తిస్తాయి. మన సమాజానిక్కూడా తీపి పదార్థాలు కాదు, చేదు మందులు కావాలి! పెచోరిన్ లాంటి పాత్రల సృష్టి వందలకొద్దీ జర గాలి. వ్యంగ్య, అధిక్షేప, వాస్తవిక నవలలు, కథల యొక్క ఆవశ్యకత నేడు మరింత ఎక్కువుంది, భ్రష్టు పట్టిన ఈ సమాజానికి మరమ్మత్తు చెయ్యడానికి! మరి మనకు లెర్మొంతోవ్‌లాంటి రచయితలున్నారా?

-ఎన్.వి.ఎస్.నాగభూషణాచార్యులు




★ శ్రియ ముఖచిత్రంతో వెలువడిన 'చతుర' మాకెంతగానో నచ్చింది. 'పరస' నవల గ్రామీణ ముఖచిత్రానికి దర్పణం పట్టింది. గంగిరెద్దులను ఆడించే జానపద కళాకారుల జీవనశైలి, పశువుల సంతతీరుతెన్నులు, అక్కడ బేరసారాల్లో దళారుల ప్రమేయం తదితర అంశాలన్నింటిని రచయిత ఆకట్టుకునేవిధంగా వివరించారు. 'టాంక్‌బండ్ కథలు' ప్రతి నెలా విశేషంగా అలరిస్తున్నాయి. బిపాసాబసు ఆరోగ్యరహస్యాలు పాటించాల్సిన సూత్రాలు.

– *జె. మంజుల, బాలానగర్, హైదరాబాద్*

★ 'పరస' నవలలో ఆనాటి కాటమరాజు నుంచి, ఈనాటి తారల రాజకీయ రంగ అరంగేట్రం వరకూ ఏ అంశాన్నీ విడవకుండా రచయిత చర్చించారు. అయితే, కథలో 'కావ్యాలు, కౌండిన్యాలు రాసేవోళ్లు...'అంటూ ఒక కులం గురించి ప్రస్తావించిన వ్యాఖ్యలు వాస్తవ దూరంగా ఉన్నాయి. కాళిదాసు, వాల్మీకి, వేద వ్యాసుడు రచయిత పేర్కొన్న కులానికి చెంది [redacted] లలో కులాల ప్రస్తావన తగ్గిస్తే బావుండేదనిపించింది.

– *ముండూరు అప్పల నరసింహం, నిజాంపేట, హైదరాబాద్*

★ గోదావరి కథల రచయిత బివిఎస్ రామారావు కథల్ని మళ్లీ జ్ఞాపకం చేసిన చతురకు ధన్యవాదాలు. 'లంచగొండి భార్య' చాలా చిన్నదైనా మంచి కథ.

– *జి.జి.కె. రావు, శ్రీకాకుళం*

★ చిత్తూరు, రాయలసీమ జిల్లాల ఒకప్పటి సామాజిక స్థితిగతుల్ని, సంస్కృతిని, మాండలిక భాషని పరస నవల సమగ్రంగా తెలియజేసింది. గంగెద్దుల వారి సీతారాముల పెండ్లి ఆట చిత్రీకరణ హాస్యరసభరితం. 'ఈ గంగిరెద్దువాడేమీ పల్కెడునయా మరుగుపడ్డ తెనుంగుమాట తేట' అభినవ తిక్కన తుమ్మల సీతారామమూర్తిగారన్నమాటలు గుర్తుకొచ్చాయి నాకు. 'టాంక్‌బండ్ కథ' కావేరిలో సందేశం గొప్పది.

–*పారుపల్లి వెంకటేశ్వరరావు, హైదరాబాద్*

★ 'పరస' చదవడానికి ఏమీ బాగోలేదు. ప్రవేశికను పూరించడానికి చదవవలసి వచ్చిందే కానీ ఎటువంటి ఉద్వేగం, ఉత్కంఠగానీ కలుగలేదు. 'కావేరి' టాంక్‌బండ్ కథ బాగుంది. 'ఇదీవేదం', చతురకత 'లంచగొండి భార్య' బాగున్నాయి.

– *అక్కినపల్లి రామారావు, విశాఖపట్టణం*

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ ఐదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.

1. వి.వి.నారాయణశాస్త్రి - పి.ఎం.పాలెం, విశాఖపట్నం
2. కొప్పుల అశ్విని - పిడుగురాళ్ల, గుంటూరు జిల్లా
3. రాయళ్ల లాలెప్పచౌదరి - బళ్లారి, కర్ణాటక
4. కె.కామేశ్వరరావు - జంగారెడ్డిగూడెం, ప॥ గో॥ జిల్లా
5. బిల్లా మనోహర్ - గిర్మాజీపేట, వరంగల్

అసంఖ్యాకంగా స్పందనలు రావడంతో అందరి పేర్లు ప్రచురించలేకపోతున్నాం.



# చతుర ప్రవేశిక



## అక్టోబరు - 08

అక్టోబరు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం.

1. నీరజ టీచర్‌గా పనిచేసిన ఊరు?
2. నిరంజనం బంధువైన హెడ్‌మాస్టర్?
3. జనార్దనం చేసే వ్యాపారం?
4. నిరంజనానికి లోన్ ఇస్తానన్న బ్యాంక్ మేనేజర్?
5. మాలకొండని ఇలా కూడా అంటారు?
6. ఆషా ఎన్నో క్లాసు నుంచి ప్రేమలో పడింది?
7. శ్రద్ధాపూర్వకసేవని ఏమంటారు?
8. 'చావువిందు' కథ మొదట ప్రచురణ అయిన సంవత్సరం?
9. రాగిణి ఎవరి కూతురు?
10. పెచోరిన్ డాక్టర్ మిత్రుడెవరు?

పంపినవారి పేరు: -------------------------- వయసు (   )

చిరునామా: ------------------------------------------

------------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RNI/32186/78